# భారతి

మాసపత్రిక

❦

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

❦

ఏప్రిల్ 1982
సంపుటము : 59 సంచిక : 4

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1982



20-4-'82 చైత్ర బహుళ ద్వాదశీ మంగళవారము

**కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి**
**114వ జయంతి**

# కు సు మాం జ లి

## శ్రీ గడియారం శేష ఫణిశర్మ

శ్రీకామినీ మనోజ్ఞ సౌదామినీ
  శ్రీసముల్లసన ఘనాఘన సుందరమూర్తీ
అతసీ గుచ్ఛ సచ్ఛాయ కాయస్ఫూర్తీ
వైకుంఠ పురవర్తీ,

  మునిజన మనశ్చాతక శరణ్యా
  ముహుర్ముహుర్దయాంబు కణికా
  వర్షిష్ణు వరేణ్యా
  నీ నిర్వ్యాజ కరుణా కటాక్ష వీక్షణములు
  నిరతము మాపై ప్రసరించుగాక
  ఆర్తజన రక్షాపరాయణా
  అవధరించు కుసుమాంజలి
  ఆదినారాయణా 1

గుణంలేని ఈ శుష్కవచనంతో
కవితా గుణంలేని నా నీరస రచనంలో
ఎలా వినుతింపగలను ప్రభూ
సుజనోద్ధరణ కారణ శుభాచరణైక చణాలను
నీ గుణ గణాలను
  ॥ఆర్తజన...ఆదినారాయణా॥ 2

  పంగువును సైతం
  పర్వతోల్లంఘన జంఘాలునిగా
  భీరువును సైతం
  చలన్మహామేరువుగా
  మూగను సైతం
  చటుల వాచాల శ్రేణిలో అగ్రగా
  రాగిని సైతం
  విరాగిగా మహాయోగిగా
    త్రుటిలో మారుస్తుంది ప్రభూ
    దివ్యమైన నీ అవ్యాజ కరుణాలేశము
  ॥ఆర్తజన...నారాయణా॥ 3

పాపాలను విదారించటానికి
అఖిల భవతాపాలను నివారించటానికి
పాదదాసుల లోపాలను పూరించటానికి
  సుశ్లోకమూర్తీ
  నీ దివ్యనామ సంకేతమైన ఒక్క పదంచాలు
  లోకపావని జాహ్నవీజనయిత్రికి జన్మభూమి
  నీ శ్రీపాదం చాలు
  ॥ఆర్తజన...ఆదినారాయణా॥ 4

ఎంతదయ నీకు భక్తజన చింతామణీ
అశ్రాంత చింతాపరిశ్రాంతులైన ఆర్తులపైన
చేరెడు అటుకులు నివేదనగా చెంత చేరిన
నితాంత చింతా శీలుణ్ణి కుచేలుణ్ణి
  చేరదీసి గారవించావు
  గంపెడంత సంపదనిచ్చి గట్టెక్కించావు
  ॥ఆర్తజన...ఆదినారాయణా॥ 5

ఏనాటి బంధువా గజేంద్రుడునీకు
మొరపెట్టగానే పరుగెత్తిపోయావు
పాలకడలిమరచి, ఫణితల్పం మరచి
ఇల్లుమరచి, ఇల్లాలిని మరచి
  ॥ఆర్తజన...-దినారాయణా॥ 6

నీ పదము నెఱిగి పలికినవాడు
మహాతపస్వి, మంత్రద్రష్ట
నీ పదముల కెరిగి పలికినవాడు
చిరయశస్వి, కావ్యస్రష్ట
  నీ గూర్చిన ప్రతిపదమూ మహావాక్యము
  నీ గూర్చిన ప్రతివాక్యమూ మహాకావ్యము
  ॥ఆర్తజన...నారాయణా॥ 7

ఇహంస్పృహణీయం కానివేళ
అహం రమణీయం కానివేళ
ఎదలోతుల మెత్తని కదలికగా
నీ ఎఱుక మెదలిన వేళ
  ఆర్తి అంతర్దీపవర్తియై జ్వలిస్తుంది,
  శోకం శ్లోకంగా పరిణమిస్తుంది,
  మౌనం అక్షర తత్వాన్ని వ్యాఖ్యానిస్తుంది,
  మహాకావ్యగానమై రాణిస్తుంది.
  ॥ఆర్తజన...ఆదినారాయణా॥ 8



# నా కాళ్ళ మీద నేను!

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

నేలకు మూడు వానలతో నిలువెల్ల పులకించిన నేలయిది!
పడిగింజలు నసలెత్తి పడుతూంటే
పరవశంతో తిలకించిన నేలయిది !!
మూడు దిక్కుల మున్నీరుల పన్నీటి జల్లుల
మురిసి పడుతున్న నేలయిది !
దిక్కు దిక్కుల సంస్కృతీ సంస్కారాల విలువల్ని
మురిసి పోస్తున్న నేలయిది !!
వేద ప్రవచనసార సౌరభంతో మోదభరితమైన నేలయిది !
బ్రదుకు గీతలకు చేతలకు భగవద్గీత
బ్రహ్మరథం పట్టిన నేల యిది !!
బుద్ధజిన చైతన్య మూర్తుల దివ్య సందేశాల దీపించిన
నేలయిది !
పరమ హంస అరవింద వివేకానందుల ప్రబోధాల ప్రభా
వితమైన నేలయిది !!
సీత సావిత్రి అనసూయ పడతులు పాతివ్రత్యప్రాశస్త్యాన్ని
తలకెత్తిన నేలయిది !
ఘోరాకుంభర్ మీరారాణి కబీరు తులసీ రామదాసులు
గొంతెత్తిన నేలయిది !!
చాణుక్య యుగంధర తిమ్మరుసుల రాజనీతి,
రాజనీతికి రమ్యతలు పెంచిన నేలయిది !
కౌటిల్యుని అర్థశాస్త్రములోని ఆంతర్యాన్ని ప్రపంచానికి
పంచిన నేలయిది !!
కాళిదాసు కంబర్ ఠాకూర్ తిక్కన కలం జిలుగుల వెలి
గిన నేలయిది !
కృష్ణరాయని సాహితీ నందనవనంలో అష్టదిగ్గజాలు
కవితా ప్రసూనాలు పూయించిన నేలయిది !!
కుప్పలు కుప్పలుగా త్యాగధనం తెప్పలు గట్టిననేలయిది!
రాళ్ళు రప్పలకుకూడా యోగ విద్య నలవర్చిననేలయిది!!

పొంగులెత్తిన సిరగసం కరవాల ధారల మెరిసిననేలయిది!
నింగినుండి నేలవరకు కరుణ రసం కురిసిన నేలయిది !!
అడుగు కొక్క గుడికి అడుగ కొక్క బడికి నెలవైననేలయిది!
అడుగడుగున కర్మసిద్ధాంతం కాకలు తీరుతున్న నేలయిది!!
ఔన్నత్యానికి ఆదర్శాలుగా హిమవన్నగ శిఖరాలను
నిలుపుకొన్న నేలయిది !
అభ్యుదయానికి అభ్యాగసంగా నదీ నదాలను కలుపు
కోబోతున్న నేలయిది !!
ఈ నేలమీద జన్మించడం జన్మ జన్మాల సుకృత పుణ్య
ఫల విశేషం !
ఈ నేలమీద నడయాడడం అదృష్టాన్ని ఆపోశనం
పట్టడం !!
నేను ఈ నేలమీదనే పుట్టినాను ! - ఈ నేలమీదనే
నడయాడుతున్నాను !!
నా జన్మ జన్మాల సుకృత పుణ్య ఫల విశేషం ఆ హిమా
చలాన్నత్యాలకు మించి !
అందుకే దిన దినము దూరు తుంటాను నా గుండు
గుడిసెలో తలవంచి !!
ఈ మట్టిమీద ఈ మనుష్యులమీద ఎంతో ఎంతెంతో
మమతానురాగాలు పెంచి !!!-
నా గుండు గుడిసె ముందు గన్న మామిళ్ళులేవు !-
పొన్న పొగడ లసలే లేవు.
ఉన్నది ఒక్కగా నొక్క చింతచెట్టు !- కాకి మూకల
రంపుల కాటుపట్టు !-
చూస్తూ చూస్తూ ఉండగానే ఆ చింతచెట్టు ఆకులురాలుస్తూ
రాలుస్తూ చిగురించింది.
ఒక్కసారి కాదు. రెండుసార్లు కాదు.. ఓయబ్బో
నలభై సార్లు !

ఇన్నేళ్ళుగా యింటి ముందర చింతచెట్టు కంటి గింపుగా
చిగురిస్తూంటే-
ఈ నాటికి నాలో చిగురించింది చిత్రమైన భావమొకటి.

ఈ నేలమీద నా కాళ్ళమీద నేను నిలబడ్డానా ?- అని!
దేశ ఔన్నత్యానికి కారణభూతులైన కారణ జన్ముల
సంగతి నాకు తెలియదు.

దేశ ప్రగతి రథ సారధులైన యిప్పటి మహనీయుల
ఆలోచనా సరళి అంతు దొరకదు.

ఇన్నాళ్లుగా కలుగనిసందేహం యిప్పుడెందుకు కలిగిందని
గుండె గొంతు చించుకొంటే మెడబిల్లు దన్నింది.

దర్పము దట్టా చూపుల్ని తట్టి వదలగా
ఆ చూపులు పరిసరాలను పట్టి పట్టి చూస్తూ కదలగా
నన్ను నన్నుగా నిలబెట్టిన కాళ్లు కాళ్ళక్రింద కంకర
రాళ్ళబాట కంట పడినాయి !

ఆ కంకర రాళ్ళబాటమీద నా కాళ్ళమీద నేను నిలబడి
ఆలోచించినాను.

నేను నిలబడిన ఈ బాట నేను వేసింది కాదనీ-
నేను కట్టిన బట్ట నేను నేసింది కాదనీ-
నేను త్రాగుతున్న నీళ్లు నేను త్రవ్వినబావి నుండికాదనీ-
నేను తింటున్న తిండి నేను పండించిన పంటకాదనీ-
నేను పీలుస్తున్న గాలి నేను పెట్టి పెంచిన చెట్టునుండికాదనీ
చిత్రంగా గుండెల్లో చిగురించిన భావం
చిలువలు పలువలుగా అల్లుకొనింది.

తరతమ భేదాలు మాని తప్పటడుగులు మాని
లోకాన్నే అలుము కొనింది.

కలిగిన వాడు కమ్మగా సేవిస్తున్న 'బెడ్‌కాఫీ' లాంటిదే
బ్రదుకని తేల్చింది.

ఒకడు పండించిన చెరకును మరొకడు పిండివండిన చక్కెర

ఒకడు పండించిన కాఫీ గింజల్ని మరొక్కడు వేయించి
దంచిన పొడి

ఒకడు మేపిన ఆవును మరొక్కడు పిదికి కాచిన పాలు

శ్రమల మిశ్రమ కషాయం సేదదేర్చుకోవడానికి అనువైన
ఉపాయం !

ఇట్లా శ్రమల్ని మిళితం చేసి ఫలితం సాధించడానికి—
ఒక్కడు యింకొక్కడి కాళ్ళమీద, అయింకొక్కడు
మరొక్కడి కాళ్ళమీద
ఆధారపడినపుడే అడుగు ముందుకు పడుతున్నది.
ఈ పరస్పరాధారము పుసుగడకు పూలబాటై వొప్పు
తున్నది.

అనుస్యూతమైన ప్రశస్త సూత్రమిది!-ఆగని యాత్రయిది!!
ఇదే సహజీవనం !-ఈ అందరి కలయికే సమాజం !!

అందుకే—

"వ్యక్తి కొరకే సమాజం. సమాజం కొరకే వ్యక్తి.
వ్యక్తి లేకపోతే సమాజం లేదు. సమాజం లేకపోతే
వ్యక్తిలేదు."- అన్నారు.

ఈ సమాజంలో ఎవరైనా ఎపుడైనా
తన కాళ్ళమీద తాను నిలబడ్డానంటే-వాడొక వెఱ్ఱివాడు.
ప్రగతి పథ సోపానంలో ఒక 'మొఱ్ఱి' వాడు !



# కథకుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రికి కవి దేవులపల్లి కృష్ణశాస్త్రికి మధ్య నడిచిన లేఖలు

(పరిచయము

కథక చక్రవర్తి స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారి చిన్న కథలపై నేను పిహెచ్. డి.కై పరిశోధన సాగించేటప్పుడు శాస్త్రిగారి కథలతో పాటు వారి సర్వ రచనలను అధ్యయనం చేశాను. శ్రీపాద వారి రచనల విశిష్టతను అంచనా కట్టి, వారి వ్యక్తిత్వాన్ని గ్రహించి, నిరూపించడంలో వారి "కరస్పాండెన్స్ ఫైల్సు" నాకెంతో తోడ్పడ్డాయి. కవులూ, రచయితలూ తమకు వ్రాసిన ఉత్తరాలతోపాటు, శ్రీపాద వారు తాము ఇతరులకు వ్రాసిన ఉత్తరాల కాపీలనుకూడ చాలావరకూ తమ ఫైళ్ళలో భద్రపరచడంవల్ల ఆసక్తికరమైన ఎన్నో సంగతులు నేటి వారికి తెలిసే అవకాశం కలుగుతోంది. ఆధునికాంధ్ర సాహిత్యం అభిమాన విషయంగా అధ్యయనంచేసే సాహిత్య విద్యార్థులకీ, పరిశోధకులకే కాక, ఈ లేఖలు-సారస్వత ప్రియులైన ఎందరో పాఠకులకు ఎంతో ఆసక్తి కలిగించగలవనే విశ్వాసంతో వీటిని ప్రకటిస్తున్నాను. నా పరిశోధన సమయంలో ఈ లేఖలున్న 'ఫైళ్ళ'ను నాకిచ్చి, ఈ విధంగా ప్రకటించే అవకాశం కలిగించిన శ్రీపాద వారి అల్లుడు శ్రీ వై. వి. సుబ్బారావు గారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ లేఖల్లో శ్రీపాద వారూ, కృష్ణశాస్త్రిగారూ ఒకరినొకరు "అన్నగారూ" అని సంబోధించుకున్నారు. ఇలా పిలుచుకోవడం ఆనాటి సాహితీ సమితి, నవ్య సాహిత్య పరిషత్తులలో నడిచిన ఒక ఆచారము మాత్రమే. శ్రీపాదవారు కృష్ణశాస్త్రిగారి కంటె వయసులో ఆరేళ్ళు పెద్ద. శ్రీపాద జననం 1891, కృష్ణశాస్త్రి జననం 1897. చింతా దీక్షితులు గారొక్కరే శ్రీ పాదవారికి సమవయస్కులు. విశ్వనాథ, చలం ప్రభృతులందరూ శ్రీపాద వారి కంటె చిన్నవారే. సాహితీ సమితి సభ్యులతోనూ, నవ్యసాహిత్య పరిషత్సభ్యులతోనూ శ్రీ పాదవారికి స్నేహం ఉండేదే కాని ఆయన ఆరెండిటిలోనూ సభ్యులుకాదు. శ్రీపాదకు మరే సాహిత్య సంఘాలతోనూ సంబంధం ఉండేది కాదు. వారే ఒక సంస్థ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ఉరఫ్ 'కళాభివర్ధనీ పరిషత్'.

శ్రీపాదవారు 1961 ఫిబ్రవరి 25న దివంగతులైతే, కృష్ణశాస్త్రిగారు 1980 ఫిబ్రవరి 24 రాత్రి కన్నుమూశారు.

రచయిత)

(కందుకూరి వీరేశలింగం పంతులుగారి శతవార్షికోత్సవాలు 1948లో రాజమండ్రిలో జరిపే ప్రయత్నాల సందర్భంలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వ్రాసిన లేఖయిది.)

రాజమండ్రి
13-4-48

బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు
7, లక్ష్మణ శెట్టివీధి-త్యాగరాయనగరం-మద్రాసు.

అన్నగారూ, వందనాలు-

ఇక్కడ క్షేమం. అక్కడి మీ అందరి క్షేమమూ తరుచు తెలియచేస్తూ వుండకోరినాను. నేను మార్చి 31వ తేదీని మీ దర్శనానికి వచ్చాను. మీరు కామేశ్వరరావు గారితో కలిసి యీ ప్రాంతాలకు వచ్చినట్టు చిరంజీవి బుజ్జాయి చెప్పాడు. మీ దర్శనం చేసుకోలేక పోయాను. ఇక్కడకు వచ్చాక శ్రీ కామేశ్వరరావుగారు మీతో జరిగిన సంభాషణ చెప్పారు.

ఇక్కడి-వీరేశలింగం శతవార్షికోత్సవ సంఘ కార్యదర్శి నా విషయమూ శ్రీ కామేశ్వరరావుగారి విషయమూ మీకు జవాబు కోరుతూ తంతి కొట్టానంటాడు. ఇక్కడి ఉత్సవాలు నీరసంగా వుంటాయి. సెక్రటరీలకు కవులెవ్వరూ బదులు రాయలేదుట. నన్నూ కామేశ్వరరావు గారినీ పట్టుకుని "మీరు రాసి వారిని తెప్పించండి" అనికోరారు. నేను "మేమెవరం ?" అనడిగాను. దాని మీద వారే ఏవో ప్రయత్నాలు చేస్తున్నారుట. 17వ తేదీ సారస్వత దినసభకు, గతిలేక శ్రీ కామేశ్వరరావు గారిని వెంట బెట్టుకుని ధవళేశ్వరం వెళ్ళి శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిని అధ్యక్షులుగా ఒప్పించుకున్నారు. వేదుల, ఇంద్రకంటుల నిమిత్తం

మనుషుల్ని పంపాడు. జాషువా గారికిన్నీ రాశారుట. ఈ ముగ్గురి తోటీ ఊళ్ళోవాళ్ళని కలిపి పాలు పుచ్చుకోవన్నారు. నా పేరు ప్రకటించవద్దన్నాను. సందర్భాను సారంగా, అవసరం అయితే మాట్లాడతానని యిప్పటికి తప్పించుకున్నాను.

నేటి ఆంధ్రప్రభలో మద్రాసు కార్యక్రమం ప్రకటించ బడ్డది. సెక్రటరీయా, సన్మాన సంఘాధ్యక్షులూ వుండగా అధ్యక్షులు హరిసర్వోత్తమరావుగారు అది ప్రకటించడం యేమిటో నాకు అర్థం కాలేదు. పైగా, ఆయన తన కూతురు పేరు రెండు మాట్లు రాసుకున్నారు. రెండోనాడు "5_30 గంటలకు కవి సమ్మేళనం" అని కవులనందరినీ కలిపి కొట్టారు. ఆ కవులలో మీరున్నారా ? ఈ హరిసర్వోత్తమ రావుగారు, వీరేశలింగం పంతులుగారి ఉద్య మాలలో దేనిలో చేరతారు ? ఆయనకు కవుల విలువ తెలుసునా ? మీరందరూ వారి శాసనాలు శిరసావహించ బోతున్నారా ? పంతులు గారి స్మరణకు ఆయన ప్రభుత్వం యేమిటని మాత్రమే నా సందేహం.

21వ తేదీ పంతులుగారు పుట్టిన తిథట. సారస్వత సభ, నాటికి మార్చుమని నేనూ కామేశ్వరరావుగారూ చెప్పాము. మిమ్మల్నీ, విశ్వనాథవారినీ, మరి కొందరినీ తీసుకువస్తాం అని చెప్పాము. కాని, నాడు ఆ స్తికుల కిచ్చేశారుట. అది తప్పదుట.

అక్కడి వివరాలు రాయండి, అన్యథా భావించవద్దు—

చిత్తగించండి

ఇట్లు తమ్ముడు

సుబ్రహ్మణ్యశాస్త్రి

(చిరంజీవి బజ్జాయి కృష్ణశాస్త్రిగారబ్బాయి. ఆర్టిస్టు, కార్టూనిస్టు. కామేశ్వరరావు గారంటే హాస్య బ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావుగారు. హరి సర్వోత్తమ రావుగారంటే గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారు. వేదుల-అంటే వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు. ఇంద్రకంటి అంటే ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు.)

## 2

(శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 13_4_48న కృష్ణశాస్త్రి గారికి వ్రాసిన జాబుకి కృష్ణశాస్త్రిగారు శ్రీపాద వారికి సమాధానం వ్రాశారు. కాని ఆ జాబు లభించలేదు. దానికి శ్రీపాద వారు తిరిగి కృష్ణశాస్త్రిగారికి వ్రాసిన లేఖ యిది.)

రాజమండ్రి
19_4_48

బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సన్నిధి,
మద్రాసు

అన్నగారూ వందనాలు—

మీ జాబు చేరి సంగతులు తెలిశాయి. ఇక్కడి సభలు చాలా నీరసంగా జరిగాయి. మొదటినాడు ఆహ్వానం లేక నేను వెళ్ళ లేదు. రెండోనాడు ఒక సెక్రటరీవచ్చి బతిమాలాడు. వెళ్లాను. పొద్దుటి కార్యక్రమం ఏమీ జరగలేదు. మధ్యాహ్నం బ్ర. శ్రీ. మ. సూర్యనారాయణ శాస్త్రిగారి అధ్యక్షత చక్కగా వుంది. కాని ఉపన్యాసకులు పాడిందే పాడారు. చివర జాషువాగారి చేత గబ్బిలం పద్యాలు చదివించుకుని చాలా సేపు సభ్యులానందించారు. నేనేమీ మాట్లాడలేదు. సభలో నన్నెవరూ కోరలేదు. అవసరమూ లేక పోయింది. తక్కిన వక్తలే 16 గురున్నారు. కాని సభ సారస్వత సభగా లేదు.

నిన్న స్త్రీల సభకి నేను వెళ్ళలేదు.

అక్కడి సభల సంగతి పత్రికలలో చూస్తున్నాను. హరి సర్వోత్తమ రావుగారి ఉపన్యాసం పత్రికలో చాలా క్లుప్తంగా పడింది. అసలు, అది అంతే అయివుండేది బాగుండి పోయేదును.

రిపోర్టులనుబట్టి, ఇక్కడి సభల కంటే అక్కడి సభలు బాగా జరిగినట్టు కనపడుతుంది. కాని, ప్రారంభంలో శుభం పలకరా మంకెన్నా అన్నట్టు గాంధీగారి కోసం మౌన దుఃఖం అభినయించిందిగదా సభ, అది యెందుకూ ? స్వాతంత్ర్యం వచ్చినా భావ దాస్యం. రకం మారిందేగాని, రాశిమారలేదు- పోనివ్వండి.

రిపోర్టుల దగ్గిర నుంచీ, సంపాదకీయాల దగ్గిరనుంచీ, ప్రత్యేక రచనల దగ్గిర నుంచీ ఆంధ్రపత్రిక కంటే ఆంధ్రప్రభ బాగుంది, చిత్రం.

నేను మీ జూలై సభ కోసం నిరీక్షిస్తున్నాను. రాయల్ సైజున 100 లేక డెమ్మీ సైజున 150_లేక **D. C.** సైజున 200 పేజీల వీరేశలింగ స్మారక సంచిక ముఖ్యుల రచనలతో ప్రకటిస్తే బాగుంటుంది. ఆలోచించండి.

మీరు మళ్ళీ రాస్తామన్నారు. ఎదురు చూస్తున్నాను.

శ్రీ శివశంకర స్వాములకు నా నమస్కారాలు మనవి చెయ్యండి. వారి సెలవుకి బద్ధుణ్ణయి వుంటానని మనవి చెయ్యండి.

అక్కడ, ఒంగోలులో సాహితీ సమితి సభ జరుగుతోంది, ఇక్కడ నేను, మద్రాసు నుంచి బయలుదేరి ఏలూరు రాజమండ్రీల మధ్య వున్నాను. అంచేత అప్పట్లో ఆహ్వానానికి జవాబయినా యివ్వకో లేకపోయాను. ఇదిన్నీ వారికి నివేదించండి.

ఇక్కడ క్షేమం. అక్కడి అందరి క్షేమమూ తరుచు రాస్తూ వుండకోరినాను.

సభ 10 నిమిషాలకు జరుగుతుందనగా శ్రీ కామేశ్వరరావుగారు చెప్పి తొందర పెడితేగాని పక్తలకు దండలయినా లేకపోయాయి.

చిత్తగించండి!
తమ్ముడు
సుబ్రహ్మణ్యశాస్త్రి.

3

(శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రాజమండ్రిలో కళాభివర్ధనీ పరిషత్తు పేరుతో తమ పుస్తకాలను అచ్చువేసుకోవడమే కాక, విశిష్టమయిన పద్ధతిలో సాహిత్య, సంగీత సభలు జేగీయమానంగా జరిపిస్తూ వుండేవారు. వారొకప్పుడు జరిపించిన నన్నయ, శ్రీనాథ జయంతులు చూసినవారు నేటికీ రాజమండ్రిలో గొప్పగా చెప్పుకుంటూంటారు. శ్రీపాద వారూ ఈమని పాటి, కామేశ్వరరావుగారూ కలిసి ఆలోచించి నన్నయ జయంతి సభ జరిపించాలనీ, కృష్ణశాస్త్రిగారిని ప్రధాన వక్తగా పిలిచి వారికి నూట పదహార్లివ్వాలనీ సంకల్పించారు. కృష్ణశాస్త్రిగారిని ఆహ్వానిస్తూ శ్రీపాద వారు వ్రాసిన ఉత్తరం ఇది.)

29-10-48

బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సన్నిధి
7, లక్ష్మణశెట్టి వీధి, టి. నగరం.

అన్నయ్యగారూ, వందనాలు—

ఇదివరలో మీచేత అవునపించి, ఇంతవరకూ పిరేశలింగం పంతులుగారి వార్షికోత్సవం జరిగించలేక పోయాము. అందుకు ఖిన్నుడనై వున్నాను. అది మళ్ళీ మే నెలదాకా జరగదు. మన్నించండి.

ఇప్పుడు నన్నయ జయంతి జరిగించ బూనుకున్నాము. ఇది సంకల్పించిన వారూ నెరవేరుస్తున్నవారూ మన కామేశ్వరరావుగారు. నన్నయ పేరుగా, నెల్లూరిలో తిక్కన పేరుగా లాగ, ఏటా ఒక పండిత వక్తకు నూటపదహార్లివ్వాలని మా సంకల్పం. అది మొదటి సంవత్సరం మీకు సమర్పించు కుందామని నిశ్చయించుకున్నాము.

మీ శక్తియుక్తుల యెదట మా ద్రవ్యం ముఖ్యంకాదు, మా ఆదర గౌరవాలే మీరు తహస్వేలు వేసుకోవాలి.

నన్నయ జనన మరణకాలాలు ఎవరూ చెప్పలేకపోతున్నారు. మన కామేశ్వరరావుగారు ఒక పక్కాని కాలనిర్ణయం చేశారు.

నన్నయ తుది పద్యం మనకి దొరికినంతవరకూ "శారద రాత్రులు" అన్నది కదా? కనక, కార్తిక పున్నమినాడు నన్నయ జయంతి జరిగించడం మంచిదని వారు నిర్ణయించారు. ఇది మీరున్నూ అంగీకరిస్తారని మా నమ్మకం.

తొలినాడే మీరిక్కడికి రావాలి. మీ అంగీకారం మాకు చేరగానే ఖర్చులు పంపుతుంటున్నాం. ఇదీపని. సత్యనారాయణగారు, నన్నయ కథనశక్తి, ఒక ఘట్టం చదువుతూ వివరించి చెప్తారు. అలాగే, నన్నయ రచన, పాత్ర చిత్రణం, సంప్రదాయ నిర్వచనం, —ఇత్యాదులలో మీ యిష్టమైన విషయం తీసుకోవచ్చు. నాడు, మా అధ్యక్షులు లక్ష్మణస్వామి నాయుడుగారు క్లుప్తంగా మాట్లాడతారు. నేను విషయ వివరణమూ పరిచయమూ చేస్తాను. చివర కామేశ్వరరావుగారు ధన్యవాదాలు పలుకుతారు. ప్రధానోపన్యాసకులు మీరు. మరెవరూ మాట్లాడరు. మేము మాట్లాడించం. గంటకుపైగా, రెండు గంటలయినా మీరు మాట్లాడవచ్చు. మాట్లాడాలిన్నీ.

ఇలాగ నాలుగు సంవత్సరాల కొకమాటు నలుగురు వక్తల ఉపన్యాస సారమూ గ్రంథ రూపంగా ప్రకటించాలని కామేశ్వరరావుగారి నిశ్చయం. అంచేత, మీరుతీసుకునే విషయం ముందుగానే రచనచేసి పంపవలసిందని వారి, నా కోరికలు.

సౌమ్యూ, ప్రయత్నమూ పూర్తి అయినాయి. మీ అనుమతి అందడమే తరవాయి. మేమింకా మరికొన్ని పనులు చేసుకోవాలి. వెంటనే మీ అనుమతి తెలియపరచండి. మరోవిధంగా చెప్పరని నమ్ముతూ ఎదురు చూస్తున్నాను.

చిత్తగించండి,
ఇట్లు,
శ్రీ సు. శాస్త్రి

3

## 4

(కృష్ణశాస్త్రిగారికి శ్రీపాదవారు తాము 29-10-48న వ్రాసిన ఉత్తరం అందిందో లేదో అని, కృష్ణశాస్త్రిగారు నూజివీడులో ఉన్నారని తెలిసి (నూజివీడు) మరో ఉత్తరం వ్రాశారు. అదే ఇది.)

2-11-48

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు
మకాం : నూజివీడు
(కేర్ చండూరి సోమయాజులుగారు, కోనేటిపేట)

అన్నయ్యగారూ, వందనాలు

మీపేర మదరాసుకి, మొన్నటి 29వతేదీన ఒకజాబురాశాను. నేనూ కామేశ్వరరావుగారూ కార్తికపౌర్ణమినాడు నన్నయజయంతి జరిగిస్తున్నాము. ఏటా, ఆవేళ, ఉత్తరం నూటపదహార్లు ఇవ్వడం మా నిర్ణయం. మొదటి సంవత్సరం మీరీ సత్కారం స్వీకరించాలని మా ప్రార్థన. మీ అనుమతి చేరగానే ఖర్చులు పంపుతాము. ఇదీ ఆ జాబు సారాంశం.

నన్నయ జనన మరణకాలాలు తెలియవు. "శారదరాత్రులు" అనే పద్యం అతని చివరిది కనక, అందు శరదృతువు వర్ణించబడ్డది కనక, శరద్రాత్రులలో కార్తిక పౌర్ణమి కమనీయమేకాక పర్వదివం కూడా కనక, జయంతి ఆవేళ జరిగించడం మంచిదని కామేశ్వరరావుగారి నిర్ధారణ.

నన్నయ రచనలో ఏదో ఒక విషయం విస్తరించి మీరుపన్యసించాలి. ఉపన్యాససారం మాకు దయచేయిస్తే నాలుగేళ్ళకోమాటు, అది గ్రంథరూపంగా ప్రకటిద్దామని ఉద్దేశం. నన్నయ రచనకు సర్వతోముఖ సమీక్షకిదిదారి అని మానమ్మకం.

వ్యవధిలేదు. మీరు నూజివీడు ప్రాంతాన వున్నట్టు నిన్ననే నాకు 'సంపత్తు' గారు చెప్పారు. అందుచేత యిది మీ హోస్టుగారి ద్వారా పంపాను. వెంటనే మీ అనుమతిని తెలుప కోరినాను. అన్యథా చెప్పరని మేము నమ్మివున్నాము. సకలమూ సిద్ధమయి వుంది. ముందు జవాబు రాయండి.

విషయమూ, వక్తనూ నేను ముందు పరిచయం చేస్తాను. తరువాత మా అధ్యక్షులు లక్ష్మణస్వామి నాయడుగారు క్లుప్తంగా మాట్లాడతారు. చివర, కామేశ్వరరావుగారు ధన్యవాదాలు పలుకుతారు. మీరు గంట-రెండు గంటలు మాట్లాడవచ్చు. మరెవరూ మాట్లాడరు. ఆహ్వానాలు మేము వ్యవధి ఉండగానే పంపుకోవాలి. వెంటనే జవాబు దయచెయ్యండి. తొందరగా రాశాను. తప్పులుండవచ్చు. మన్నించండి.

చిత్తగించండి.
ఇట్లు.
శ్రీ సు. శాస్త్రి

['సంపత్తు' గారంటే సంపత్ రాఘవాచారిగారు (శంఖవరం రాఘవాచారిగారు) అప్పట్లో వారు రాజమండ్రి ట్రైనింగ్ కాలేజీలో తెలుగు లెక్చరర్]

## 5

[శ్రీపాద వారు 2-11-48న నూజివీడు వ్రాసిన ఉత్తరంకాక 29-10-48న మద్రాసు వ్రాసిన ఉత్తరం అందుకుని కృష్ణశాస్త్రిగారు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి (రాజమండ్రి) వ్రాసిన జవాబిది]

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన శ్రీ అన్నయ్యగారి సన్నిధికి :
అనేక నమస్కారములు చేసి చేయంగల విన్నపము.
ఉభయ కుశలోపరి

మీ ఉత్తరం అందింది.

మన రాజమహేంద్రవరంలో నన్నయ జయంతిని జరిపించడం, ఆ కార్యం మీరూ మన కామేశ్వరరావుగారూ పూనుకొని నిర్వహించడం, పట్టరానిదెంత సంతోషం కలిగించాయనుకున్నారు! ఇదివరకే ఈ ఉత్సవం జరగక పోవడం అన్యాయం ; ఈ అన్యాయాన్ని మీరిద్దరూ తొలగించడమే నాకు బాగుంది.

మొదటి జయంతికే నన్ను పిలవడం వల్ల చాలా గర్వపడ్డానని ఒప్పుకుంటాను. నిజం చెపితే పోతుంది. మీ ఆజ్ఞ శిరసా వహిస్తున్నాను.

కాని నాలో నిజంగా అప్పాతాశక్తీ లేదే, ఉన్నట్టు అనుకుంటుంటారు. మీ అభిమానము అనురాగంవల్ల ; నాకేం ? అయినా వస్తాను. నన్నయ్య మీ మా భక్తీ, మీ యిద్దరి ఆశీర్వచనమూ ఆలంబమూ నాకెప్పుడూ ఉన్నాయి. వచ్చి తీరతాను.

ఒకటి, మీరిద్దరూ రమ్మని అజ్ఞాపించారు. రెండు, నన్నయ్యగారిమీద మాట్లాడడానికి, మూడు, గోదావరిని చూడవచ్చు. (మధ్య మధ్య గోదావరినీ, మన పొలాన్నీ చూస్తేగాని చచ్చిపోతాను). నాలుగు, మనం కలిసి కొద్ది కాలం అయినా ఉండవచ్చు. రాజమహేంద్రవరం రావడానికి, నా ప్రాణానికి ఇవి చాలా గట్టి కారణాలు. వస్తున్నా.

విషయం రెండు మూడు రోజుల్లో తెలియపరుస్తాను. వ్రాసి కూడా పట్టుకొని వస్తాను. శ్రీ కామేశ్వరరావుగారికి నమస్కారములు. మళ్ళీ వ్రాస్తాను.

7, లక్ష్మణచెట్టి వీధి,
త్యాగరాయనగరం
1-11-48

చిత్తగించవలెను.
తమ్ముడు,
దేవులపల్లి కృష్ణశాస్త్రి.

**6**

8-11-48

బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సన్నిధి,—
7, లక్ష్మణచెట్టి వీధి, టి. నగరం, మద్రాసు.

అన్నయ్యగారూ, వందనాలు.

మీ జవాబు అప్పుడే చేరింది. చాలా సంతోషం అయింది. కామేశ్వరరావుగారునూ మిక్కిలి సంతోషించారు. జయంతికి మీరు వస్తున్నారని మే మిక్కడ సగర్వంగా చెప్పుకుంటున్నాము. మాకిలాంటి అవకాశం కలిగించినందుకు మిక్కిలి కృతజ్ఞులం.

ఇవాళ మీరిక్కడికి రావడానికి ఖర్చుల నిమిత్తం 25-00 ఎమ్. వో. చేశాను. స్వీకరించండి. ఇది యిక్కడికి రావడానికి మాత్రమే. మద్రాస్ వెళ్ళేటప్పుడు మళ్ళీ యిచ్చుకుంటాము.

అన్యథా భావించవద్దు.

రచన చేసి వస్తారని భావిస్తున్నాము. అది చాలా అగత్యం. కార్తీక పౌర్ణమి ఈ నెల 16వ తేదీని అయింది. మళ్ళీరాస్తాను.

చిత్తగించండి
ఇట్లు
శ్రీ. సు. శాస్త్రి

**7**

9-11-48

బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సన్నిధి—
7. లక్ష్మణచెట్టి వీధి, టి. నగరం. మద్రాసు

అన్నయ్యగారూ, వందనాలు—

మీదగ్గిర నుంచి మళ్ళీ జాబులేదు. ఎం. ఓ. అంది వుంటుంది. దానితోపాటు రాసిన జాబున్నూ చేరి వుంటుంది. ఇక్కడ, ఏర్పాట్లు చురుగ్గా జరుగుతున్నాయి. సభ ఈ నెల 16వ తేదీని.

ఇక్కడ మరికొందరు, మీ ఉపన్యాసాల కోసం ఏర్పాటు చేసుకుంటున్నట్టు తెలిసింది. మా మనవి ఏమిటంటే జయంతిలో ఉపన్యసించకగాని మీరు ఈ వూళ్లో మరెక్కడా ఉపన్యసించడం ధర్మంగా వుండదు. తరవాత మీ యిష్టం. ఇది మీకు తెలియదని కాదు. కొంతమంది, ముందే మీ ఉపన్యాసం కోసం ప్రయత్నిస్తున్నట్టు తెలిసింది. దానివల్ల కలిగిన ఆదుర్దావల్ల మాత్రమే యిది రాశాను.

రచన చేస్తున్నారని నేనూ కామేశ్వరరావుగారూ అనుకుంటున్నాము. అది చాలా ముఖ్యం. శ్రద్ధ చెయ్యండి. మళ్ళీ జాబు రాస్తాను.

చిత్తగించండి,
ఇట్లు
శ్రీ. సు. శాస్త్రి

**8**

12-11-48

కృష్ణశాస్త్రిగారికి—

అన్నయ్యగారూ, వందనాలు—

మీ దగ్గిర నుంచి మళ్ళీ జవాబులేదు. మీరు సెకండుక్లాసులో బయలు దేరరండి. ఇక్కడికి వచ్చాక మాట్లాడుకోవచ్చు.

'సంపత్తు'గారితో నిన్న మాట్లాడాను. వారు తమ కాలేజీలో 15వ తేదీని మీ ఉపన్యాసం ఏర్పాటు చేసుకున్నట్టు చెప్పారు. "జయంతి విలువ తగ్గిపోదా? ఊరేగింపు అనవసరం అయిపోదా?" అని నేనడగ్గా, వారు, సంగతి గుర్తించి 17వ తేదీకి ఏర్పాటు చేసుకుంటామని చెప్పి వెళ్ళారు. మీకు ఈ సంగతి రాస్తామనన్నీ చెప్పి వెళ్ళారు. మరొకరు ప్రయత్నించినా మీరు జయంతికి పూర్వం యీ వూళ్లో మాట్లాడడానికి అంగీకరించవద్దు. ఈ సంగతి, మీకు, కామేశ్వరరావుగారుకూడా మరీ మరీ రాయమని చెప్పారు.

మీరు 14వ తేదీని బయలుదేరి రావడం మంచిది. ఒక రోజు యిక్కడ విశ్రమించవచ్చు. రాతకోతలు సావకాశంగా చేసుకోవచ్చు. మీ రాక తెలియపరిస్తే మేము స్టేషనుకి వస్తున్నాము. జవాబు దయచెయ్యండి. రచన జరుగురు. నిన్న ప్రోగ్రాం పంపాను. అంది వుంటుంది. ఇవాళ, ఒక పాకట్టు పంపాను. మాకు అడ్రస్సులు తెలియని మిత్రులు కలుసుకుంటే అంద చెయ్యవచ్చు.

జవాబు జరుగురు.
సకలమూ సిద్ధము అయింది.
ఇది తొందరగా రాశాను.

చిత్తగించండి.
ఇట్లు
శ్రీ. సు. శాస్త్రి

9

(శ్రీకృష్ణశాస్త్రిగారు రాజమండ్రిలో నన్నయ జయంతి సభలో ప్రసంగించి మద్రాసు చేరాక శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి ఉత్తరం వ్రాశారు. నన్నయపై కృష్ణశాస్త్రిగారి ప్రసంగ వ్యాసం లభించలేదు. అది ఎక్కడైనా అచ్చయిందేమో కూడా తెలియదు.)

బ్రహ్మశ్రీ
శ్రీ అన్నయ్యగారి సన్నిధిని
అనేక నమస్కారములు చేసి
చేయంగల విన్నపము :
ఉభయకుశలోపరి.

॥

కాకినాడ వెళ్ళిన మర్నాడు బయలుదేరి, పిఠాపురం వెళ్ళి, అక్కడ నుంచి అరోజే మద్రాసు వచ్చేశాను. వచ్చాక, రెండు రోజులు వంట్లో ఏమీ బాగుండక, మీకు ఉత్తరం వ్రాయలేక పోయాను. కాని, ఎంతో, ఏవేవో, నా మనస్సులో నిండి ఉన్న దంతా తెలియపరుద్దామనుకున్నాను-మీకూ మన కామేశ్వరరావు గారికిన్నీ ।

మీలో ఏ తీయదనం ఉందో కాని, నెమ్మది నెమ్మదిగా నా గుండెల్లోపలికి చొచ్చుకొని పోయి, అక్కడ స్థిరంగా పీఠం వేసుకుని కూర్చున్నారు, తెలుసునా । ఆ మధ్య మీరు మద్రాసు వచ్చినప్పుడు, మన యింటి వద్ద కూర్చున్నప్పుడు, ఇంద్రగంటి విశ్వపతి శాస్త్రి గారివీ, లేటు గంగాధరరావుగారివీ కొన్ని గాథలు చెప్తుంటే, మీ కళ్ళు ఒకటి రెండుసారులు చెమ్మగిల్లడం కనిపెట్టాను. అప్పుడే మీరు నాకు పూర్తిగా దొరికిపోయారు. మీదీ, మన కామేశ్వరరావు గారిదీ కటుకుతనం పైకి ఒక్కొక్కప్పుడు దుర్నిరీక్ష్యంగా కనపడినా, అది న్యాయంకోసం సత్యంకోసం ఉన్న పట్టుదల వల్ల వచ్చిందికాని, లోపల 'నిండు మనంబు' వఠి వెన్న అని తెలుసుకున్నాను.

ఇదంతా నాస్వంత గొడవకేమికాని -

మీరిద్దరూ సాహిత్యలోకానికి ఎటువంటి ఉపకారం చేస్తున్నారో మీకే తెలియదనుకుంటాను.

(౧) నేను కూడా పాతికేళ్ళపైనుంచి ఆంధ్రసాహితీపరుల్లో ఎందర్నో చనవుగా ఎరుగుదును. హమేషాగా రాత్రీపగలూ వాళ్ళతో తిరుగుతూ । ఏవో ఎప్పటికప్పుడే, ఈర్ష్యలూ, అన్యోన్యంగా దూషిస్తూ విలువలు తగ్గించుకోవడమూ - మొత్తం మీద ఇలాంటివి కనపడ్డి, మనస్సులు కుళ్ళయి, సాహిత్య వేత్తలకు నిజంగా కావలసిన నిష్కల్మషబుద్ధీ, అనురాగమూ దూరమైపోయినట్టుండేది. మీ ఇద్దరితో మొన్న రెండు రోజులూ ఉన్నప్పుడు, ఆరోగ్య ప్రదమూ, అనురాగభరమూ అయిన ప్రభావం ఏదో నన్నావహించింది; ఎంతో హాయిగా ఉన్నాను. ఇలాగ, మీరిద్దరూ ఒక్కొక్కళ్ళే పిలిచి, తరుచు అందరితో సాన్నిహిత్యం ఏర్పరుచుకొంటే, మన 'సాహిత్య వాతావరణం' కూడా నా మనస్సులాగే శుభ్రమూ సుందరమూ అయి తీరుతుంది.

(౨) ఇంతవరకూ దేశంలో కవిని ఆశ్రితుడుగా, ఆట వస్తువుగా, సోమరిపోతుగా, శుద్ధ 'త్వాష్ట్రిం'గా చూడడం రివాజుగా ఉంది. ఈ దురవస్థకి కొంత వరకు కవీ, కారణమే? ఇప్పుడు మీ ఉద్యమంవల్ల వచ్చే గొప్ప ఫలితం ఏమిటంటే, కవిని సమాజానికి నాయకుడుగా చేశారు; దేశానికంతకీ గురుదేవుణ్ణి చేస్తున్నారు వాణ్ణి । ఇదివరకు మీ 'రాజరాజు' లోనే అపని చేశారు. ఇప్పుడు సభలూ సమావేశాలూ మొదలైన చోట్ల కూడా అపని చేస్తున్నారు. నిజానికి, దేశంలో ప్రజలకి సంబంధించిన ప్రతీ ఉద్యమం మనకి సంబంధించినదికూడా । దాని మీద మన అభిప్రాయాలు గట్టిగా తెలియపరుస్తూ ఉండాలి మనం. అందరికన్నా చురుకుగానూ చూడగలడు, దూరంగానూ చూడగలడు సాహితీ పరుడు. ఇప్పుడు ప్రజ అంతా కలిసి 'రాజరాజు'; పోనీ, మనం అందరమూ కలిసి అయినా 'నన్నయ్యో, భీమకవో' కాలేమా అనే ఆశ మీరు ఎంతబలంగా నాకు కలిగించారనుకున్నారు । వచ్చే నవ్యసాహిత్య పరిషత్సభ మీరూ మన కామేశ్వరరావుగారూ అన్ని విధాలా నడిపిస్తే ఎంత బాగుండును, దానికి తెలుగు నాడులో ఉన్న సాహితీ పరుల్ని అందర్నీ పిలిచి ।

అన్నయ్యగారూ, నా మనస్సులో నిండి ఉన్న ఆశలూ ఆలోచనలూ అన్నీ పైకి బాగా పడెయ్య లేకపోతున్నాను.

మళ్ళీ వ్రాస్తాను. ఈ సారి మన కామేశ్వరరావుగారి పేర వ్రాస్తాను. ఈ ఉత్తరం వారికీ చూపించండి.

అక్కడ వారి యింటా మీ యింటా అంతా క్షేమంగదా । ఇక్కడ చి॥ బుజ్జాయీ, చి॥ బుల్లి సీతా అమ్మా అందరూ క్షేమం.

'రాజరాజు' నాటకాన్ని ప్రదర్శనానికి అనుకూలంగా మన కామేశ్వరరావుగారు తయారు చేశారా? చేస్తే పంపుమనండి.

చిత్తగించండి,
మీ తమ్ముడు,
దే. వేం. కృష్ణశాస్త్రి,

28-11-48
7, లక్ష్మణ చెట్టి వీధి.
త్యాగరాయనగరం, మదరాసు.

తా. క :- ఏమి వ్రాశానో ఊరికే అలాగ ఈ ఉత్తరంలో ।

## 10

(కృష్ణశాస్త్రిగారు 26-11-48న శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి వ్రాసిన లేఖకి శ్రీపాద వారు కృష్ణశాస్త్రిగారికి వ్రాసిన జవాబది)

బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సన్నిధి, రాజమండ్రి
7, లక్ష్మణశెట్టివీధి, టి. నగరం, మద్రాసు 4-12-48

అన్నయ్యగారూ, వందనాలు

మీరు 26-11-48 తేదీన రాసిన జాబు అప్పుడే చేరింది. కాని, ఏకకాలంలో నాలుగు పుస్తకాలు అచ్చువేయిస్తున్నాను. వాటి ప్రూఫుల తొందర. ఇందులోనే ఇక్కడికి చిత్తూరి నాగయ్యగారు రావడం. వారి నిమిత్తం పరిషత్తు పక్షంగా సభ చేయించడం. దాని తొందర. నిన్నటిదాకా బడలిక. అంచేత, మీకు ఇవాళ జవాబు రాసు కుంటున్నాను. ఆలస్యానికి మన్నించండి.

మీరు రాసిన జాబు శ్రీ కామేశ్వరరావుగారికి చూపించాను. మిత్రులు జమదగ్నిశర్మ ప్రభృతులున్నూ చూశారు. అందరూ మీ స్నేహార్ద్రతకు చాలా సంతోషించారు.

కాని, మీరు నన్ను చాలా పెద్ద మాటలతో ప్రశంసించారు. అది నాకు చాలా భారంగావుంది.

దీనికిసాయం, మీరు నా యెడల కనపరుస్తున్నదయను నేనే విధంగానూ వర్ణించ లేకుండా వున్నాను. అది అనుభవించడంతో నేను నిరుత్తరుడనయి పోతున్నాను. ఈ విధంగా కూడా, మీయెడల నా ఋణం ఎక్కువయి పోతోంది.

అన్నయ్యగారూ, నిజంగా, ఆంధ్రసాహితీ పరుల్లో మీ రొక్కరే పరిస్థితులు బాగా గమనించినవారు. కామేశ్వరరావుగారూ, నేనూ మిమ్మల్ని ఆహ్వానించడాని కదే కారణం. మన వారిలో, మైత్రి కనపరిస్తే ప్రభుత్వం చెలాయించే వారే చాలామంది. మీలాగ, యింతటి సౌహార్ద్రత చూపగలవారు చాలా తక్కువ. అభ్యుదయ రచయితల సభ సందర్భంలో మీరు మమ్మల్నిద్దరినీ బాగా దగ్గరికి తీసుకున్నారు. దానికి కారణం, మీలో వున్న విశిష్టతే గాని, మా దగ్గిర యేదో వుండికాదు. మీ ఆజ్ఞ తిరస్కరించలేక పోయాము, వచ్చాము. నిజంగా, అభ్యుదయ రచయితలకూ, మాకూ మధ్య చాలా దూరం వుంది. అప్పుడు మీరు కలగచేసుకుని వుండక పోతే మేము వచ్చి వుండము. వచ్చాక, అక్కడ మా యిద్దరి యెడలా మీరు కనపరిచిన ప్రత్యేకాదర గౌరవాలు మేము మరిచి పోగలమా ?

అంత చేస్తూ వుండిన్నీ యిప్పుడిలాగ నన్ను అనడం ధర్మమేనా ? ఏమయినా, గతం గతం, రచయితల, కవుల ఆధిక్యం మనం కనపరచవలసిన సమయం యిది. కవి ప్రాజాపత్యం లోక శ్రేయస్కరం. ఈ నిశ్చయంతోనే నేనిప్పుడేది చూసినా, ఏది చేసి నాను. ఇది మనం అందరమూ కలిసి చేస్తే యింకా చాలా పని జరుగుతుంది. సులభంగానూ, త్వరగానూ, జరుగుతుంది. ఫలిత మున్నూ అపారం అవుతుంది.

ప్రత్యేక రాష్ట్రం ఏర్పడేంతవరకూ ఇందుకు తగ్గ స్థలం మనకు మద్రాసు. ఇటీవలి రంగాగారి రాజకీయసభలాకాక, పామే దాగా మన మెంతయినా చెయ్యవలసి వుంది. మదరాసు ఆంధ్ర యువజనులు ఇప్పుడు మీ గుప్పిట్లో వున్నారు. ఇది కామేశ్వరరావు గారికీ, నాకూ గల దృఢవిశ్వాసం. పెద్దల దబ్బు మాత్రమే మన కుపయోగిస్తుంది. యువకుల జీవితాలన్నీ మనకు విడిచిపోతే. వాటిని, ముందు మన రక్షణం చేసుకోడమూ, మంచిదారిలో పెట్టడమూ - ఇది మనపనులు. మీరు పూనుకుంటే అంతా గొప్పగా నెరవేసు తుంది. ఆ హిందీ ప్రచారకుని స్పర్శ మీరట్టి నిచ్చుకోగూడదు. ఇదొక్కటే మీరు బాగా శ్రద్ధ పెట్టవలసింది.

మిత్రులు వెంకటరత్నంగారు చాలా కష్టపడుతున్నారు; కాని వారు సత్యం బాగా గుర్తించినట్టులేదు. నవ్య సాహిత్య పరిషత్తు ఆ స్థితిలో వుండడానికి బాధ్యత అంతా వారిది. అది మీరు మద్రాసులో ఎందుకు నడపరాదూ ? వార్షికోత్సవం మీచేతి మీదుగా ఎందుకు సాగించగూడదూ ? మీరు విశ్వరూపం చూపించాలంటే అంతకంటె అవ్వైనదేముంది?

అన్నయ్యగారూ, ఆగ్రహం వద్దు. మీరీపాటికి వచనంలో ప్రవేశించాలి. మీరలాచేస్తేనే మద్రాసు మొదలుబరంపురం అవతలి దాకా వూగిపోడం. అప్పుడే, జాతి, కవులసత్తా గ్రహించ గలగడం. మీ జాబు చూసినప్పుడల్లా నాకీ భావం కలుగుతూనే వుంది.

కాని, పెద్దలు. మీ యెదట యీ విషయం ప్రస్తావించడం ఎందుకని నేనూరుకుంటున్నాను. ఇక కాలం యిలా వెళ్ళనివ్వడానికి వల్లకాదు. మళ్ళించాలి. అప్పుడూ "పోనీ, మనం అందరమూ కలిసి అయినా నన్నయ్యో తిక్కనవో కాలేమా అన్న ఆశ" ఫలిం చడం. మీశక్తి మీరు తెలుసుకోలేక పోతున్నారనను. శుష్కరాజ కీయ ప్రచారకులు జాతిని నిర్వీర్యం చేస్తున్నారు. మనం పూను కోవాలి. మీరు నడుముకట్టాలి.

కామేశ్వరరావుగారి తోడ్పాటు నాకిక్కడ చాలా బలం కలిగి స్తోంది. విశ్వనాథ సత్యనారాయణగారూ, మీరూ, దానికి దోహదం కలిగించారు. ఇక్కడ నా కార్యక్రమం సులభంగా సాగుతోంది, కాని, యీ చిన్నిరాజమహేంద్రవరం కంటే మనకు తగిన కార్య క్షేత్రం మద్రాసు. అంతా మీ చేతిలోవుంది.

మీరు పూనుకుంటే మన ఆశయాలు జనంలో ప్రవేశిస్తాయి. మీరు పూనుకుంటే జనం మన పరిధిలోకి వస్తుంది. మద్రాసులో మనం ప్రయత్నిస్తే జాతి మీద కవుల ప్రాబాల్యం ప్రారంభ మౌతుంది. అప్పుడే నవీనాంధ్ర సంస్కృతికి రూపసిద్ధి.

ఉన్న సంగతి యిది. ఉన్న సత్యం యిది.
చెయ్యవలసిన ప్రయత్నం యిది.
సాధించవలసినదిన్నీ యిదీ.
ఇదంతా మీ భుజస్కంధాలమీద వుంది.
కవులే యుగకర్తలన్న సత్యం ప్రత్యక్షం చెయ్యడానికి మీరు పూనుకోవాలి.
తమ్ముని అవినయం మన్నించాలిన్నీ.

చిత్తగించండి
ఇట్లు
శ్రీ. సు. శాస్త్రి

(వెంకటరత్నం గారంటే తెలికిచర్ల వెంకట రత్నంగారు)

## 11

(శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రాజమండ్రిలో తమకళాభి వర్ధనీ పరిషత్తు పక్షాన ప్రతి సంవత్సరం సాహిత్య సభలూ, సంగీత సభలూ ఘనంగా జరిపేవారు. 1949 ఫిబ్రవరిలో శాస్త్రిగారు కృష్ణా పత్రిక సంపాదకులుగావున్న కాటూరి వేంకటేశ్వరరావు గారిని వచ్చి ఉపన్యాసం ఇమ్మని ఆహ్వానించారు. శాస్త్రిగారు వ్రాసిన ఆ ఉత్తరం అప్పుడు కాకినాడలో ఉన్న వేంకటేశ్వరరావు గారు అందుకుని ఫిబ్రవరి 26, 27 తేదీలలో అయితేనే తమకు రాజమండ్రి రావడానికి వీలవుతుందని జవాబు వ్రాశారు. అప్పుడు కృష్ణశాస్త్రిగారు కూడా కాకినాడలోనే వున్నారు. వేంకటేశ్వరరావు గారికి తిరిగి సమాధానం వ్రాస్తూ అ లేఖలోనే, కృష్ణశాస్త్రిగారికి 23-2-49 తేదీన పిఠాపురంలోని మొక్కపాటి నరసింహశాస్త్రిగారి కేరాఫ్‌లో సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిన ఉత్తరం, ఇది-)

కృష్ణశాస్త్రిగారికి,

అన్నయ్యగారూ, నమస్కారాలు.

మీరిక్కడికి దయచేస్తామంటే అవకాశం ఉపయోగించు కోలేక పోతున్నాను. చాలా విచారకరమైన విషయం యిది.

శ్రీ వేంకటేశ్వరరావుగారు మా సభలకు దయచేసేటట్టు మీరు చెయ్యాలి. పోస్టువేళ అవుతోంది. సెలవ్.

చిత్తగించండి.
ఇట్లు
శ్రీ. సు. శాస్త్రి.

## 12

(1955 జూన్‌లో, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ 'అనుభవాలూ-జ్ఞాపకాలూను' (మొదటి సంపుటం) అచ్చుకాగానే కృష్ణశాస్త్రి గారికి, మద్రాసు ఒక కాపీ పంపారు. అది చదివి కృష్ణ శాస్త్రిగారు సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి వ్రాసిన లేఖ యిది).

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన

శ్రీ అన్నగారి సన్నిధికి అనేక నమస్కారములు చేసి ;-

పుస్తకం అందింది. వెంటనే చదివాను: ఒక్క ఊపున ! మళ్ళీ చదివాను. శ్రీ పాలగుమ్మి పద్మరాజు చదువుతానంటే ఇవ్వక, నేనే ఆయనకు చదివి వినిపించాను.

తెనుగులో అయిదారు స్వీయ చరిత్రలు ఇంతవరకూ వచ్చాయేమో ; వాటిలో వీరేశలింగం పంతులుగారిది గొప్పది, అన్నివిధాలా-అని నా నమ్మకం. అయితే ఒక దృష్టితో చూస్తే, మీ "అనుభవాలూ-జ్ఞాపకాలున్నూ"-ఫస్టు !

ఇంగ్లీషులో గొప్పవాళ్ళ వెందరివో ఎన్నో స్వీయచరిత్రలు ఉన్నాయి. ఈ సాహిత్య రూపం ఆంగ్లంలో మహా గొప్పగా వికసించింది. ఆ ధోరణులతో ఏమీ పరిచయం లేకుండా మీరింత గొప్పగా వ్రాయగలిగారు; ఎందుకు వ్రాయలేరు, మీవంటి ప్రతిభా వంతులు !

నన్ను కదిపినవీ, కరగించినవీ ఘట్టాలేవో మళ్ళీ వ్రాస్తాను.

సిమ్లా హవుస్,
హబీబుల్లారోడ్,
టి. నగర్, మద్రాసు,
20-6-55

చిత్తగించండి,
మీ తమ్ముడు,
దే. వేం. కృష్ణశాస్త్రి.

## 13

[ఈ లేఖ శ్రీపాద వారు కృష్ణశాస్త్రిగారికి వ్రాసినది]

30-8-55

బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి అన్నగారు-మద్రాసు.
మహాశయా, వందనాలు—

20-8-55 తేదీని జాబు రాస్తూ "నన్ను కదిపినవీ కరిగించినవీ ఘట్టాలేవో మళ్ళీ వ్రాస్తాను" అన్నారు మీరు. ఎదురు చూస్తున్నాను-మరిన్నీ-అనుభవాలకు చాలా డబ్బు పెట్టాను. రెండో సంపుటం అచ్చువేయించాలంటే మొదటి సంపుటం అచ్చు బిల్లు తీరాలి. అందుకోసం చేతనైనన్ని విధాలా ప్రకటన చెయ్యాలని ప్రయత్నం. ఆంధ్రపత్రికలో ప్రకటన ఇచ్చాను.

"చదివిన వారన్నమాటలు" అన్న శీర్షికతో కరపత్రమునూ ప్రకటించదలిచాను. అందులో మీ మాటలు చాలా ముఖ్యం. ఇదివరలో మీరు రాసిన మాటలు వెనక పేజీని రాశాను. సవరణయుంటే చూడండి.

ఎదురు చూస్తున్నాను.
ఇవాళ 'కలంపోటు' అన్న పుస్తకం పంపాను.
తరవాత అదిన్నీ చిత్తగించండి.

ఇట్లు
శ్రీ. సు. శాస్త్రి

## 14

(కథక చక్రవర్తి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవం 23-4-1951 తేదీన రాజమండ్రిలో జరిపేందుకు షష్టిపూర్తి సమ్మాన సంఘం ఏర్పడి పత్రికల్లో ప్రకటించింది. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి కూడ ఆ సంఘంవారు తెలియజేశారు. అది అందుకుని కృష్ణశాస్త్రిగారు ఆ సంఘం వారికి వ్రాసిన లేఖలో కొంతభాగం ఇది- "మనోజనులకు విన్నపాలు" అనే పేరుతో "రచయితల అభిప్రాయములు" అనే శీర్షికతో ప్రముఖుల లేఖలను ఆ కమిటీ ప్రకటించింది. శ్రీపాదవారి షష్టిపూర్తికి విచ్చేసి కృష్ణశాస్త్రిగారు మహోపన్యాసం చేశారు.)

మొన్ననేకాబోలు 'అన్నయ్య' గారి షష్టిపూర్తి మహోత్సవం జరుగుతుందని పత్రికలో చదివాను. చదివిన వెంటనే మీకెవరికయినా నేనే ఉత్తరం వ్రాద్దామనుకుంటున్నాను. మహోత్సవం ఎలాగ జరగాలో, కార్యక్రమణాళిక ఏ ధోరణిలో ఏర్పరచాలో, ఉత్సవమంటపం ఎలాగ అలంకరించాలో-ఇలాంటి విషయాలన్నిటిలో ఈ దీనుడి సలహా కూడా కొంచెం కనుక్కుంటూండవలసినదని మనవి. ఎంత మహోత్సవము చేసినా, ఆ ఆంధ్రవీరుని అర్హతకు తగినట్లు చేయలేం. ఈ ఉత్సవం మన ప్రశస్తి ఉత్సాహమూ బయటపడేందుకు కుందుకే. అయితే, ఆయన ఘనతకూ గౌరవానికీ ప్రతిభకూ సమర్పించుకునే కానుక ఎలాగుండాలి? చాలా అందంగా చెయ్యాలి ఈ ఉత్సవం. చాలా ఆంధ్రంగా చెయ్యాలి ఈ ఉత్సవం. నాకు వివరాలన్నీ తెలియజేయండి. నేను మళ్ళా వ్రాస్తాను.

దే. వేం. కృష్ణశాస్త్రి.

## 15

(శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి షష్టిపూర్తి సందర్భంగా రాజమండ్రి సమ్మాన సంఘం పక్షాన కార్యదర్శితో పాటు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మదరాసు సెక్రటేరియట్ ఆంధ్ర సంఘం వారికి వ్రాసిన లేఖ ఇది.)

రాజమండ్రి
30-3-1951

శ్రీమదరాసు సెక్రటేరియట్టు
ఆంధ్ర సంఘం వారికి :

సుప్రసిద్ధ విద్వాంసులూ, కథక చక్రవర్తులూ, మహానాటక కర్తలూ, పూజ్యులూ అయిన శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిల వారి షష్టిపూర్తి మహోత్సవం ఈ ఏప్రిల్ నెల 20, 23 తేదీలలో జరుగుతుంది. ఈ సందర్భములో శ్రీ శాస్త్రిగారి రచనలలో ముఖ్యమైనవి ఆరు గ్రంథాలైనా పేరి, అచ్చువేయించవలెనని వారి అభిమానుల ఆశయము. ఆ ఉత్సవం జేగీయమానంగా జరిగే ప్రయత్నాలు రాజమహేంద్రవరంవారే ఉత్సాహంగా చేస్తున్నారు. ఈ ముద్రణ విషయమై ఇతర స్థలాలలో, ముఖ్యంగా, మద్రాసులో, ప్రయత్నించి కొంతవరకయినా ధనం సేకరించే కృషి జరుగుతోంది. శ్రీ శాస్త్రిలవారు ఆంధ్రప్రముఖులలో పీరులు. వారిని మీవంటి ఆంధ్రాభిమానులు గౌరవించడమే ఉచితం కదా! కావున మీ సంఘం తరపున శ్రీ శాస్త్రిలవారి గ్రంథములలో ఒకదానికయే ఖర్చు మీరిప్పించగలరని మరీ మరీ కోరుతున్నాను.

చిత్తగించవలెను,
ఓగిరాల వెంకటసుబ్బారావు
కార్యదర్శి
దేవులపల్లి కృష్ణశాస్త్రి

[సేకరణ - సమర్పణ: 'కవక్ ప్రవాసి']

# మనిషి కారణజన్ముడు !

ప్రతిరోజూ మృత్యువు కడ్డంగా
దూసుకపోయే సైకిలుపై మనిషి
కాలం-దూరం మధ్య
నిరంతరం జరిగే పోటీలో ఒక పావు,
చావును రోజూ పరిహసించి
బతుకు వాహనం ఎక్కే విజేత.
సెకండుతో పోటీపడి కొట్టుకునే
ఈ గుండె చలనం వెనకాలే
వెంటాడే నీడలు
నిరంతరం దేనికోసం ప్రశ్నించే
భయం ఇంకో చావు !

ప్రతి క్షణంలో బాధైనా సుఖమైనా
జీవనసారాన్ని దోసిలితో పట్టేవ్యక్తి
ఎక్కడో వేళ్ళసందుల్లోంచి
జారిపోతున్న కాలాన్ని అధిగమించలేక
ప్రకృతి పోరాటంలో తలమునకలై
వెనకా ముందు వేగాన్ని
చేస్తూనే వున్నాడు మరింత వేగవంతం.
భయ సందేహాల మొదలను విరిచి
కాలవాహనంపై
దూసుకుపోతున్నాడు కారణ జన్ముడిగా

# ఆరని ఆవేశం !

"సౌందర్యం పట్ల ప్రేమ ప్రస్ఫుటించదేం ?
మన శైలిలో ఎందుకు తొంగిచూడదు మృదుత్వం ?
ఆకలి ఆవేశం నిండిన కథల మూలాలు
ఇది విస్తరించి నిరసిస్తున్న అనాసక్తతకాదా ?"
ఈతరం కవిగా నువ్వు అడిగిన ఈ ప్రశ్న
ఈ జీవితంలోని వెలుగును కూడా——
చూడమనే యవ్వనాభిలాషలోని ఆకాంక్ష
ఇప్పుడు "ఇచ్చిపుచ్చుకునే" వ్యాపార కొలబద్దల మధ్య
చిక్కుకుని విలవిలలాడుతూ పిండుతున్నది గుండెల్ని !

మన నోటి దగ్గరికి వస్తున్న ముద్దలో
ఎందరి ఆకలి చూపుల మెతుకులు,
మన పాలిస్టర్ దుస్తుల మెరుపుల్లో
ఎందరి చిరిగిన దుస్తుల మానాభిమానాలు !
నిర్వచనం లేని వెచ్చని తృష్ణలో
కరిగే సౌందర్యపు టుంచులు
ఏ క్షణానికాక్షణం తాత్కాలికమే
ఆకలి వున్నంత వరకు
మిగిలేది ఆరని ఆవేశమే.

[ మిత్రులు ఎ. యస్. నాగేశ్వర రావు కోసం .... .... .... ]

శ్రీ నిఖిలేశ్వర్



4

# ప్రశ్న

శ్రీ పి. ఆర్. భానుమూర్తి

నడుస్తున్న బాటసారి నయనాల్లో నీలినీడ
ఎండిన ఎడారి గుండెకు ఏ దిక్కున నీటిజాడ
చలనం లేనిది చలనం
మరణం లేనిది మరణం
దిగంతాల కే వైపున కీ పయనం ఈ త్వరణం
ఈ చీకటి శిఖరంపై వెలిగేదే కాంతి కణం

నడిరేయిని అడవిలోన విడివిడి రాలిన పుష్పం
తొలిచేకువ వెలుగులోన తలిరేకులు విచ్చుకుపుష్పం
నదికడలిని అలల కనుల చంద్ర కాంతి కలలు
శిలను తగిలి కలలు చెదిరి ముక్కలైన అలలు

ఏది కాంతి ? ఏది శాంతి ?
బ్రతుకొక నిజమైన భ్రాంతి

బంధనాలు
జీవితాన్ని కాల్చేసే యింధనాలు
స్నేహాలూ సౌఖ్యాలూ కష్టాలూ కన్నీళ్ళూ

దరహాసం
పరిహాసం
పిచ్చివాడి పాట వరస

నడుస్తున్న దే వైపుకు ?

ఏ వెలుగుల నీడలిచటు
ఏ నీడల వెలుగులిచటు

కదలాడే ప్రతి ఆకూ కదిలించేదే గీతిక
ఎండిరాలు పండుటాకు ఎద వెలిగేదే దీపిక
అనంతాన్ని అంతంతో కలిపే ఈ కనురెప్పలు
ఏది చావు ? ఏది పుట్టుక ?
ఈ చీకటి పరిణామాన పుట్టేదే వెలుగు చిలక

పసిపాపల మానసంలో ముసలితనపు ముడతల్లో
రాలిపడే పువ్వుల్లో జాలిపడే కన్నుల్లో
పక్షుల్లో పచ్చగిలిన చెట్లల్లో
మాటల్లో పాటలో
అగాధమౌ సముద్రాన
ఆకాశపు నీలిరంగు అంచువెనక

ఎవరి నవ్వు ఎవరి ఆట
ఎవరి కనుల స్వప్నాలవి
ఎవరి కనుల కన్నీరది

చిక్కుముడులు విడదీస్తే చివరికి మిగిలేదేమిటి ?
అసంపూర్ణ సంపూర్ణ
అన్ని నిండిన శూన్యం.



చాణక్య

# దేశ ప్రజపై న్యాయ వ్యవస్థ దాడి ?

## I

న్యాయవ్యవస్థమీద ప్రజలకు చాలా గౌరవముంది. మనలను పరిపాలిస్తున్న మూడు రంగాలలో, లెజిస్లేటివ్, ఎగ్జిక్యూటివ్, జ్యుడీషియరీలలో-ప్రజలకు ఇంతవరకూ న్యాయవ్యవస్థ మీదే ఎనలేని గౌరవముంది. రాను రాను అధికారరంగం (ఎగ్జిక్యూటివ్) రాజకీయవాదుల చేతి కీలుబొమ్మగా తయారయింది, లేక పోతే రాజకీయరంగం గత్యంతరలేని స్థితిలో కొచ్చింది. కాబట్టే రాజకీయ నాయకులు తమకు కావలసిన పనులన్నిటికీ ఎగ్జిక్యూటివ్‌ను వాడుకుంటున్నారు.

రాజకీయ రంగంను గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. ముఖ్యంగా రాజకీయనాయకులు పూర్తిగా అధికారాంధులు కావటంతో, ప్రజలు దిక్కు తెన్నూలేని దశ ఏర్పడింది. ఇది జనతా హయాంలో పరాకాష్ఠ చేరింది. సాక్షాత్ నాటి హోమ్ మంత్రి శ్రీ చరణ్ సింగ్ సాటిమంత్రి శ్రీ బహుగుణను కె. జి. బి ఏజెంట్ అని వర్ణిస్తూ నాటి ప్రధానమంత్రి శ్రీ మొరార్జీదేశాయ్‌కి వ్రాయగలరు. ఆ నాటి మంత్రి హోంమంత్రిని 'నపుంసక్' అని అనగలరు. ఇటువంటివారు తిరిగి భుజాభుజాలు రాసుకుంటూ మనలను పరిపాలించటానికి తయారవుతారు. ఇది న్యాయశాస్త్ర గ్రంథాలలోకే ఎక్కింది సుమా! దీనినే శ్రీ అరుణ్ షౌరీ అపోజిట్ పెయిర్ అని పిలిచాడు.1

1977 నుంచి నేటివరకు శ్రీ హేమవతీ నందన బహుగుణ 5 సంవత్సరములలో 7 పార్టీలు మార్చి లేదా స్థాపించి రికార్డు సృష్టించాడు. ఆయన ఇప్పుడు ప్రజాస్వామ్య వ్యవస్థను గురించి తెగవాపోతున్నాడు.

కాబట్టే మనవి ఎవరో అన్నట్లు, ఎం. జి. ఆర్ (ఎం. జి. రామచంద్రన్ కాదు)రాజకీయాలు, మెట్టిగో రౌండ్-రంగులరాట్నం లేదా-రంగు"ను"లరాట్నం రాజకీయాలు.-ఈ పరిస్థితులలో, రాజకీయ లేదా ఎగ్జిక్యూటివ్ వ్యవస్థచేత బాధింపబడినవారు, దిక్కు-తెన్నూ లేని అమాయక, మూగ, నిస్సహాయప్రజ న్యాయవ్యవస్థ మీదే ఆశలు పెంచుకున్నారు-లేదా వారికి మనుగడే లేదు.

కాని ఇప్పటి బాధల్లా, అద్దీ మిగ్గతా వ్యవస్థలా అలాగే తయారవుతున్నదనే. న్యాయవ్యవస్థకు ఆధారం ప్రజలకు దాని పట్లగల గౌరవం, అచంచల విశ్వాసం. ఆ విశ్వాసానికే ఘాత ఏర్పడిననాడు, దానికే నెట్టెల్లు తయారయినపుడు, ఆ వ్యవస్థ ఎక్కువకాలం నిలువలేదు సుమా!

న్యాయవ్యవస్థ మీది గౌరవంతోనే, నేడు దానిని విమర్శించక తప్పనిసరి అవుతున్నది. అత్యవసర పరిస్థితి కాలంలో అనేరానేక మందికి పరిప్రసాదితమైన ఆ అనాదిపటం ద్వారా మనకి మనకిగా తయారవుతున్నది. దానికే "అత్యవసర పరిస్థితి" ఏర్పడిందా అనిపిస్తున్నది.

దీనికి కారణం, మన ఉన్నత న్యాయస్థానాలను అధిరోహించిన న్యాయమూర్తులే కావటం మరీ దురదృష్టకరం. మన గుప్పెటను మనమే విప్పవలసిన తరుణం ఆసన్నమయింది. ఈ దోషములను సూచనామాత్రంగా పరామర్శించటమే ఈ వ్యాసం ఉద్దేశ్యం.

## II

"1963 ప్రారంభంలో, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ సిన్హా విషయంలో నేనొక సున్నితమైన సమస్యలో ఇరుక్కున్నాను. ఈ ప్రధాన న్యాయమూర్తికి, బీహార్‌లోని సబార్డినేట్ న్యాయశాఖ ఉద్యోగులలో ఇద్దరు బంధువులున్నారు. అదే కాలంలోని మెరిట్ సీనియార్టీలకన్నా వీరిద్దరికీ ఉన్నత పదవులిచ్చి తద్వారా వారిని పాట్నా హైకోర్టు జడ్జీలుగా తీసుకోదలచుకున్న ధోరణితో సిన్హా పాట్నా ప్రధానన్యాయమూర్తి సహకారాన్ని కోరాడు. అయన ఈ సహకారాన్నిస్తే, అయనను సుప్రీంకోర్టుకు తీసుకోవటమనేది ఒప్పందమని విన్నాను. ఈ ఉన్నత పదవులివ్వటానికి పాట్నా హైకోర్టులో, పరిపాలనా వ్యవహారాలు చూచే న్యాయమూర్తి అంగీకరించకపోతే ఆయనను ఆ బాధ్యత నుంచి తొలగించి, పాట్నా ప్రధానన్యాయమూర్తే స్వయంగా పరిపాలనా వ్యవహారాలను స్వీకరించాడు. అటార్నీ జనరల్‌గానూ, బార్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా అధ్యక్షుడుగానూ నాకున్న రెండు హోదాలరీత్యా కూడా, దీనికి సంబంధించిన అనేక వార్తలు చేరటం మొదలయ్యాయి. ఇదే గనుక నిజమయితే ఇది చాలా ఆందోళకరమైన విషయమే.

## దేశ ప్రజపై న్యాయ వ్యవస్థ దాడి?

ఈ విషయమై నిజానిజాలు స్వయంగా తెలుసుకునేందుకు గానూ పాట్నా హైకోర్టు చీఫ్‌జస్టిస్ చేసి, ప్రస్తుతం సుప్రీంకోర్టు జడ్జిగా ఉన్న శ్రీ ఎస్. కె. దాస్‌ను కలవటం సంభవించింది. ఒక మధ్యాహ్నం ఆయనను కలిసి, ఈ విషయాలు చెప్పి, ఆయన కేమీ అభ్యంతరం లేకపోతే బీహార్లోని నిజానిజాలు చెప్పమన్నాను. ఈ వార్తలు దాదాపుగా నిజమైనవేనని ఆయన బలపరిచాడు.

తరువాత నేనొకసారి పాట్నా పోవడం సంభవించినపుడు, అప్పటి బీహారు గవర్నరు ద్వారా ఏమి జరిగిందో తెలుసుకున్నాను. మామూలుగా ఇటువంటి ఉత్తర్వులు గవర్నరు ద్వారా జారీ అవుతాయి. రాబట్టి శ్రీ సిన్హా గవర్నరును కూడా అర్థించినట్లు ఆరోపించబడింది. కాని అనేకమంది సీనియర్లను కాదని, ఈ ఇద్దరు జూనియర్లను ఉన్నత పదవులలో నియమించటం అన్యాయమని గవర్నరు భావించి, ఈ విషయాన్ని కేంద్ర గృహ మంత్రిత్వశాఖ దృష్టికి తెచ్చారు. ఆ శాఖ దీనిని చీఫ్‌జస్టిస్ సిన్హా దృష్టికి తెచ్చింది. అయితే చీఫ్‌జస్టిస్ గవర్నరుతో 'ఇంటర్‌వ్యూ'నే కోరనట్లు నాకుతెలిసింది. అంటే గవర్నరు కేంద్రహోమ్‌శాఖకు ఒక అబద్ధాన్ని వ్రాసినట్లు ఆరోపించినట్లన్నమాట. గవర్నరు ఈ సందర్భంలో నన్ను కలిసినట్లుగా గూడా గుర్తు.

ఆ రోజులలో న్యాయసంబంధమైన రంగంలో, మిగతా రంగాలలో ఈ వ్యవహారం కొంత సంచలనాన్ని కలుగజేసింది. అయితే, చివరకు బీహార్‌లోని న్యాయశాఖ ఉద్యోగులకు పై ఉద్యోగాలు లభ్యంకాలేదు."

ఇది 1963 నాటి సంగతి. మన ప్రథమ అటార్నీ జనరల్ ఎం. సి. సెటల్వాడ్ తన "ఆత్మకథ"లో వ్రాసిన సంగతి.[2]

ఈ రచయితకు తెలిసినంతవరకూ ఎవ్వరూ మన ప్రథమ అటార్నీజనరల్ శ్రీ సెటల్వాడ్ తన 'ఆత్మకథ'లో చేసిన ఈ ఆరోపణలను తీవ్రంగా ఖండించలేదు. రిటైర్డు సుప్రీంకోర్టు జడ్జి శ్రీ జగన్మోహనరెడ్డి, 1975లో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఇచ్చిన "సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ ఎండోమెంట్ లెక్చర్స్"లో కొంత బాధ వెలిబుచ్చారు.

ఆ పుస్తకంలో శ్రీ సెటల్వాడ్ న్యాయమూర్తులతో తన సంభాషణలంటూ కొన్ని వ్రాశారనీ, వాటిని కాదంటూ ఆ న్యాయమూర్తులు నిరాకరించారనీ— అంతమాత్రమే.[3]

రెండవ సూచిక, 1976 మేలో, అత్యవసర పరిస్థితి సమయంలో మన సుప్రీంకోర్టు ఇచ్చిన చారిత్రాత్మకమైన తీర్పు. రాష్ట్రపతి అత్యవసర పరిస్థితిని విధిస్తే, ఆ ప్రకటనవల్ల న్యాయస్థానాల హక్కులన్నీ తొలగిపోలేదని, రాజ్యాంగంలోని 21వ అనుచ్ఛేదం క్రింద న్యాయస్థానాలకు ఆ హక్కు ఉన్నదంటూ తొమ్మిది ఉన్నత న్యాయస్థానాలు—వివిధ కారణాలతో తీర్పులనిచ్చాయి. వాటికి వ్యతిరేకంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకున్నాయి. దానిమీద ఈ తీర్పువచ్చింది.

నాటి ప్రధానన్యాయమూర్తి రే, తరువాతి ప్రధానన్యాయమూర్తి అయిన బేగ్, నేటి ప్రధానన్యాయమూర్తి చంద్రచూడ్, నేటి సీనియర్ న్యాయమూర్తి భగవతులు తీర్పిచ్చారు. వారిదృష్టిలో అత్యవసరపరిస్థితి ప్రకటించిన తరువాత ఏ పౌరుడికీ 226 అనుచ్ఛేదము క్రిందను హైకోర్టులకే హక్కులేదని, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలకు తమ స్వాతంత్ర్యానికి, ప్రాణాలకూ (లైఫ్ అండ్ లిబర్టీ) గల హక్కు 21వ అనుచ్ఛేదం ద్వారా మాత్రమే లభ్యమవుతుందని, 359వ అనుచ్ఛేదం ద్వారా ఆ హక్కును రాష్ట్రపతి 'సస్పెండ్' చేయటం వలన, ఇంకే విధమైన హక్కూ ప్రజలకు లేవన్నారు.

నలుగురి తీర్పూ ఈ విధంగా ఉంటే, న్యాయమూర్తి ఖన్నా ఒక్కడే వారితో భేదించాడు.

1977 జనవరిలో శ్రీ ఖన్నాను కాదని శ్రీ బేగ్‌ను సుప్రీం కోర్టు ప్రధానన్యాయమూర్తిగా నియమించటంతో శ్రీఖన్నా రాజీనామా ఇచ్చాడు.

ఇదంతా చరిత్ర, కాని శ్రీ బేగ్ ఆనాటి తన తీర్పులో "మేము అర్థం చేసుకున్నంతవరకు డిటెన్యూలను ప్రభుత్వం తల్లిలాగ చూస్తున్నది. తమ పిల్లలు తాముంటున్న ఇంటికి నిప్పంటిస్తామంటే, తల్లిదండ్రులు కూడా తప్పక దానిని నిరోధించేందుకు చర్య తీసుకోవాలి గదా" అని వ్రాశాడంటే, ఏ ఆధారంతో అలా వ్రాశాడా అని సామాన్యప్రజ తల గోక్కోక తప్పలేదు.

* * *

1976 మార్చి 1న కేరళలో ప్రొఫెసర్ వారియర్ కుమారుడు, ఇంజనీరింగ్ కళాశాల విద్యార్థి రాజన్‌ను అరెస్టు చేశారు. మార్చి 2నే అతను కక్కాయం పోలీస్ అధీనంలో, హింసకు గురై మరణించాడని నాటి కేరళ హోంమంత్రి, నేటి కేరళ ముఖ్యమంత్రి శ్రీ కరుణాకరన్ 1977 మే 22న కేరళ హైకోర్టులో అఫిడవిట్ వేశాడు. తరువాత వెలుగులోకి వచ్చిన సంఘటనలివి.

రాజన్ డిపెన్స్యూకాడు. కాని అత్యవసర పరిస్థితి ప్రభావ మలాంటిది, మన న్యాయస్థానాల ధోరణి ఇలాంటిది.

* * *

1977 మేలో ఇంకొక తతంగం జరిగింది.

జనతా ప్రభుత్వం కేంద్రంలో అధికారంలోకి రావటంతోనే, అప్పటి దేశీయాగంశాఖామంత్రి శ్రీ చరణ్‌సింగ్ నాటి రాష్ట్రప్రభుత్వాల రద్దుకు ప్రయత్నాలు చేశాడు. దానిమీద కొన్ని రాష్ట్రప్రభుత్వాలు సుప్రీంకోర్టుకు పోయాయి. దానిమీద సుప్రీంకోర్టు తీర్పు వచ్చింది. ఈ తీర్పును న్యాయమూర్తులు 1977 మే 6న చదివారు.

కాని అందులో ఒక తమాషా జరిగింది. తన తీర్పు చివరి పేరాలో న్యాయమూర్తి శ్రీ గోస్వామి, నాటి తాత్కాలిక అధ్యక్షుడు శ్రీ జట్టిని గురించి ఒక విషయాన్ని బయటపెట్టాడు. "శ్రీ జట్టి ఈ వ్యవహారం సుప్రీంకోర్టులో ఉన్నపుడు, తనను కలిశాడనీ, అప్పుడు ఈ వ్యవహారాన్ని ఎత్తేదని ప్రధానన్యాయమూర్తి శ్రీ బేగ్ చెప్పాడనీ, తానెంత తనను నిగ్రహించుకున్నా ఈ విషయాన్ని వ్రాయకుండా ఉండలేకపోతున్నాననీ, 'రాష్ట్రపతి' పదవి ఇలాంటి వివాదాలకు అతీతంగా ఉండాలని", శ్రీ గోస్వామి వ్రాశారు.

6వ తేదీ రాత్రే ప్రధాన న్యాయమూర్తి శ్రీబేగ్ ఒక పత్రికాప్రకటన చేశాడు. శ్రీ జట్టి తన కుమారుని వివాహసందర్భంగా వ్యక్తిగతంగా ఆహ్వానించటానికి వచ్చాడనీ, ఆ వివాహం సందర్భంగా ఏర్పాటయిన విందుకు పోతే, అప్పటికి కారణాలు చెప్పకపోవటం భావ్యంగా ఉండదుకాబట్టి, కారణాలను తాము ఆ తేదీ నాటికి ఇవ్వాలని మాత్రమే తాను చెప్పాననీ, దానిని శ్రీ గోస్వామి తప్పుగా అర్థం చేసుకున్నాడనీ అంటారు శ్రీ బేగ్.

ఏప్రిల్ 27నే సుప్రీంకోర్టు తన నిర్ణయాన్ని తెలిపింది ఏప్రిల్ 30న రాష్ట్రప్రభుత్వాలను రద్దుచేసే ఆజ్ఞమీద శ్రీ జట్టి సంతకం చేశాడు. మే 2న శ్రీ జట్టి శ్రీ బేగ్‌ను కలిశాడు. మే 6న న్యాయమూర్తులు ఈ తీర్పు చదివారు.

మరి ఈ తికమక ఎక్కడ వచ్చిందో తెలియదు. శ్రీ జట్టి, శ్రీ బేగ్, శ్రీ గోస్వామిలలో ఎవరిని ప్రజలు నమ్మాలి ?

* * *

రానురాను ఈ ధోరణి ఇంకా విచిత్రంగా ద్యోతకమవ సాగింది. ఉదాహరణకు — 1978 జనవరి 11, 19 తేదీలలో షా కమీషన్ ముందు శ్రీమతి ఇందిరాగాంధీ ప్రమాణం చేసేందుకు గాని, సాక్ష్యం చెప్పేందుకుగాని నిరాకరించింది. అందుకని ఆవిడ మీద భారత శిక్షాస్మృతి 178, 179ల క్రింద రెండు నేరాలు రిజిష్టరు చేయబడ్డాయి. దానిమీద ఆ విషయం ఢిల్లీ హైకోర్టులో విచారణకొచ్చి, న్యాయమూర్తి ధావలా తీర్పిచ్చాడు. సుమారు 200 పేజీల పైగా ఉన్నదది.

కాని విచిత్రమల్లా తీర్పుకాదు, దానిని గురించి సమాధానపడ్డా అది ఇవ్వబడ్డ విధమే. 1979 డిసెంబరు చివరివారంలో సుప్రీంకోర్టు సెలవలకు మూయబడుతుంది. సరిగ్గా రెండు రోజులకు ముందు ధావలా ఒక్క రోజుల్లా ఆ తీర్పును చదువుతూవచ్చాన్నాడు. ప్రభుత్వ న్యాయవాదికి కాపీ అందలేదు. కాని ఆ రాత్రే ధావలా ఇంటినుంచి మూడు కాపీలు బయటికిపోయి, మళ్ళీ తిరిగి మరునాటి ఉదయం ఆయన ఇంటికి చేరాయి.

జనతా ప్రభుత్వం పడిపోయి, శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వానికి రాబోతున్నదన్న ధోరణి స్థిరపడుతున్న రోజులవి. అలాగే చివరి చివరి రోజులలో నేటి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ చంద్రచూడ్ సంజయ్‌గాంధీ కేసు విషయంలో తనని బెదిరిస్తున్నారంటూ చేసిన ప్రకటనలూ అంత త్వరలో మరువ గూడని విషయాలే సుమా !

అలాగే నేటి సుప్రీంకోర్టు సీనియర్ న్యాయమూర్తి శ్రీ భగవతీ ప్రవర్తన. శ్రీమతి ఇందిరాగాంధీ అధికారంలోకి రావటంతోనే ఆయన ఆమెను అభినందిస్తూ 1980 జనవరి 10న సుదీర్ఘమయిన ఉత్తరం వ్రాశారు. ఆమె హయాంలో తానెలా 'లీగల్ సర్వీస్ ప్రోగ్రామ్' విషయాల సంఘానికి అధ్యక్షుడుగా నియమింపబడిందీ, తానెలా 1977 అగష్టు 31నే జనతా ప్రభుత్వానికి తన నివేదిక నిచ్చిందీ, ఆ రిపోర్టును జనతా ప్రభుత్వం ముద్రించకుండా గూడా ఉంచిందంటూ వాపోయారు.

అలాగే సుప్రీంకోర్టు తన బరువుతో తనే సమాధి అయ్యే దశ ఏర్పడేటట్లుందని హెచ్చరించాడు. ఆనాటికి 1968–69 సివిల్ అప్పీళ్ళు, 1971 నాటి లేబర్ అప్పీళ్ళు, 1972 నాటి క్రిమినల్ అప్పీళ్ళు, టాక్సు అప్పీళ్లు ఉన్నాయంటూ వ్రాశారు. మొత్తం సుప్రీంకోర్టులో నాటికి 16000 వ్యవహారాలున్నాయనీ, సుప్రీం కోర్టులో దాఖలయ్యేందుకుగాను 19,000ల పిటీషనులు ఎదురు చూస్తున్నాయనీ వ్రాశారు.

నిజానికి ఈ చిత్రణ బాధాకరంగానే కాదు, భయంకరంగా కూడా ఉంది. కాని మలుపు ఒక్క విషయంలో ఉంది. అంతకు ముందు నుంచి కూడా సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా గల శ్రీభగవతీ అంతవరకూ ప్రభుత్వానికీవిషయం గురించి ఎప్పుడైనా వ్రాశారా ? లేదా తన ఉపన్యాసాలలోగాని, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికిగాని ఎప్పుడైనా ఈ విషయం గురించి వ్రాశారా ? జనతా ప్రభుత్వానికి తన నివేదికను ముద్రింపించ వలసిందని ఎప్పుడైనా వ్రాశారా ? అంతకుముందు మొరార్జీదేశాయి ప్రధాన మంత్రి అయినపుడు అభినందిస్తూ వ్రాశారా ?

ఇంతకూ ఈ ఉత్తరం బయటకెలా వచ్చింది ? శ్రీమతి ఇందిరాగాంధీ బయట పెట్టిందా లేక భగవతీయే బయటపెట్టారా ? మార్చి 1980 నాటి దినపత్రికల్లో ఈ ఉత్తరం పూర్తి పాఠం ప్రచురించబడింది. ఈ చర్యను ఇంకొక సుప్రీంకోర్టు జడ్జి శ్రీ తులజాపుర్‌కార్, ఢిల్లీలోని ఇండియన్ లా ఇన్‌స్టిట్యూట్‌లో మార్చి 21న జరిగిన సభలో తీవ్రంగా విమర్శించారు.

ముఖ్యంగా శ్రీభగవతీ ఉత్తరంలోని ఈ క్రింది వాక్యం తీవ్ర విమర్శలకు గురి అయింది. "టుడే ది రెడ్డిష్ గ్లో ఆఫ్ ది రైసింగ్ సన్ ఈజ్ హోల్డింగ్ అవుట్ ది ప్రామిస్ ఆఫ్ ఎ బ్రయిట్ సన్‌షైన్" కొన్ని పత్రికలు నిజానికి అప్పుడు శ్రీభగవతీ వ్రాయదలుచుకుంది "Son" అని, కాని పొరపాటున "Sun" అని పడిందని వ్యాఖ్యానించాయి. (అప్పటికి అదృష్టవశాత్తు సంజయ్ గాంధీ సజీవుడు)

తరువాతి సంఘటన ఈ మధ్య జరిగింది, పూర్తిగా విచారించదగింది అయిన బొంబే హైకోర్టు న్యాయమూర్తుల ప్రవర్తన. పదవీవిరమణ చేసిన శ్రీ అబ్దుల్ రహమాన్ అంతూలే 1981లో ఒక మేధావుల సమావేశాన్ని జరిపారు. అందులో జంషెడ్‌పూర్ కలహాలపై విచారణ సంఘాధ్యక్షుడు, మాజీ న్యాయమూర్తి శ్రీ జితేంద్రనారాయణ్, బొంబే హైకోర్టు న్యాయమూర్తి ఇందిరాగాంధీ ప్రతిభాప్రతిష్ఠాన్ ధర్మకర్త అయిన శ్రీ బి. ఎ. మసోద్‌కర్ వగైరా వగైరా అంతా పాల్గొన్నారు. తరువాత శ్రీ జితేంద్రనారాయణ్ జంషెడ్‌పూర్ నివేదికలో ఆర్. యస్. యస్.ను ఇరికించిన సంగతి అందరికీ తెలుసు. ఆ సమావేశంలో శ్రీమసోద్‌కర్ అంతూలేను, ఇంద్రుడు చంద్రుడని పొగిడేశాడు. వాతావరణమంతా "ఇందిరా ఈజ్ ఇండియా" ధోరణితో నిండి పోయింది. [4]

పదవిలో ఉన్న ఒక న్యాయమూర్తి ఒక ముఖ్యమంత్రిని యిలా పొగడటం ఎంతవరకు సమంజసమనేదే సమస్య అను కుంటుంటే, బొంబే న్యాయమూర్తులు యింకా ఒక ఘనకార్యం చేశారు. 1981 ఆగష్టు 31 తేదీ నుంచి "ఇండియన్ ఎక్స్‌ప్రెస్"లో శ్రీ అరుణ్‌షోరే "ఇందిరాగాంధీ యూజ్ కామర్స్" అనే వ్యాస పరంపరను మొదలు పెట్టాడు. దానితో రాజకీయరంగంలో సంచలనం బయలుదేరి, అంతూలే మీద రిట్‌లు దాఖలయ్యాయి. ఆ రిట్‌లు బొంబే హైకోర్టులో విచారణలో ఉండగానే, కొంత మంది న్యాయమూర్తులు అక్టోబర్‌లో అంతూలే ఇంటికిపోయి, టి. వి. కెమెరాల సమక్షంలో, ఆయన నుంచి గృహనిర్మాణానికి భూమిని స్వీకరించారంటే, మన న్యాయవ్యవస్థను గురించి ఏమి చెప్పుకోవాలి ?

చివరికి ఈ తతంగాన్ని ఇంకో సుప్రీంకోర్టు జడ్జి, బొంబే హైకోర్టు మాజీ చీఫ్‌జస్టిస్ శ్రీ తుల్జాపుర్‌కారే విమర్శించాడు, వీరికి స్థలాలిస్తామనే ఆలోచన వి. పి. నాయక్, శరద్‌పవార్‌ల కాలంనుంచే ఉందనీ, యిప్పటంలో దురుద్దేశ్యం లేదు కాని, కర్తవ్యం చాలా దురదృష్ట కరమయిందని విమర్శించారు.

అయితే ఇందులోనూ ఒక విశేషముంది. మొదట్లో శరద్ పవార్, సెంట్రల్‌బొంబే ప్రాంతంలో యిస్తామన్నాడు. అంతూలే చేతిలో అది అతి ప్రముఖమైన బాక్‌బేరిక్లమేషను ప్రాంతమయింది. ఈ "అలాట్‌మెంట్" కార్యక్రమాన్ని బొంబే వాస్తవ్యులంతా 'దూరదర్శన్'లో సందర్శించగలిగారు. దీనిని గురించి "టైమ్స్ ఆఫ్ ఇండియా," "మహారాష్ట్ర టైమ్స్" పత్రికలు వాపోయాయి. అంతూలే ఇందిరా ప్రతిభా ప్రతిష్ఠాన్ ట్రస్టీయైన జస్టిస్ అగర్వాల్, మసోద్కర్‌లు ప్రమోటరులు కాబట్టి సిమెంటు విషయంలో జడ్జీలకు యిబ్బంది ఉండకపోవచ్చంటూ "మహారాష్ట్ర టైమ్స్" వ్యాఖ్యానించింది. [5]

సబార్డినేట్ న్యాయవ్యవస్థలోని ఒక ఉద్యోగి లేదా ఒక జిల్లా జడ్జీ యిలాంటి పనిచేస్తే, తనముందు వ్యవహారంలో ఇరుక్కున్న ఒక వ్యక్తి ఇంటికిపోతే, బొంబే హైకోర్టు న్యాయమూర్తులు సహించి ఉండేవారా ?

* * * * *

## III

ఈ 'బాక్‌గ్రౌండ్'లో న్యాయమూర్తుల బదిలీలు జరగటం, దానిమీద రేగిన తతంగం అంతా, నేడు మనకు తెలిసిందే. కాని ఇందులో రెండు విషయాలు కలిసి ఉన్నాయి. తాత్కాలిక న్యాయమూర్తులుగా హైకోర్టులలో నియామకం చేయబడ్డవారిని శాశ్వత

న్యాయమూర్తులుగా నియమించకపోవటం, రెండవది న్యాయమూర్తుల బదిలీ సమస్య. దురదృష్టవశాత్తూ సుప్రీంకోర్టు ఈ రెండు సమస్యలనూ కలిపి విచారించి, కలగాపులగం చేసింది. మొదటిది పూర్తిగా రాజకీయాలతో ముడిపడి ఉంది. రెండవది కాదు, కాకపోవచ్చు.

ఉదాహరణకు 1976 జనవరిలో ఢిల్లీ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఆర్. యస్. అగర్వాల్‌ను శాశ్వతం చేయలేదు, ఆయన తిరిగి సెషన్సుజడ్జి అయ్యారు. అలాగే, అప్పుడే బొంబాయిలో యు. ఆర్. లలిత్‌ను శాశ్వత జడ్జి చేయలేదు, ఆయన పదవిని కోల్పోయారు. ఇవి జనతా పూర్వపు ఇందిరాగాంధీ హయాంలోనివి. ఇప్పుడు అలహాబాద్‌కు చెందిన ఆర్. సి. శ్రీవాత్సవ ఆ పదవిని కోల్పోయారు. ఢిల్లీ హైకోర్టు అదనపు న్యాయమూర్తులు, కిస్సాకుర్సీకా కేసులో సంజయ్‌గాంధీకి, విద్యాచరణ్ శుక్లాకు శిక్ష విధించిన ఒ. యస్. వోహ్రా యస్. కుమార్‌లు పదవులు కోల్పోయారు. ఇవన్నీ రాజకీయ కక్షలే. అందులో సందేహం లేదు.

కాని దీనితోనే కలిపి, బదిలీలను కూడా విమర్శించటం సమంజసంకాదు. దీని విషయం కొంచెం లోతుగా పోవటం అవసరం. హైకోర్టులోని న్యాయమూర్తులను యింతవరకు రెండు విధాలుగా నియమిస్తున్నారు. ఒకటి జిల్లా జడ్జీలుగా ఉన్నవారి నుంచి కొంతమంది సీనియర్లనూ, తరువాత హైకోర్టులో న్యాయవాదులుగా పనిచేస్తున్న వారి నుంచి కొంతమందినీ—నియమిస్తున్నారు. ఇందులో జిల్లా జడ్జీలు ప్రాంతంలోని అనేక జిల్లా కేంద్రాలలో పనిచేస్తూ, అనేక బదిలీలు చూచి ఉంటారు. కాని న్యాయవాదులలా కాదు. కొంతమంది ఆ నగరంలోనే జన్మించి, చదివి, న్యాయవాద వృత్తిలో ఉండి, అక్కడే న్యాయమూర్తులయి, అక్కడే పదవీ విరమణ చేస్తున్నారు. కొంతమంది న్యాయవాదులుగా అక్కడ తమ జీవితాన్ని ప్రారంభించి న్యాయమూర్తులయి, పదవీ విరమణ చేస్తున్నారు.

అంటే వీరికి హైకోర్టు ఉన్న నగరంలో సుమారు 30 సంవత్సరాల పరిచయం ఉంటున్నదన్నమాట.

జిల్లా జడ్జీలు, సబార్డినేట్ వ్యవస్థలోని అధికారులను సాధారణంగా మూడు సంవత్సరాల కొకసారి బదిలీ చేస్తుంటారు. దీనివలన స్థానికులతో పరిచయాలను అతిగా పెంపొందించుకోవడానికీ, కొంతమంది న్యాయవాదులకేదో చేస్తున్నాడన్న అపవాదులకూ, ఆస్కారం లేకుండా పోతుంది. పైగా వారి చర్యలలోని లోటుపాట్లను కనిపెట్టేందుకు హైకోర్టులు ఉండనే ఉన్నాయి.

కాని హైకోర్టు వ్యవస్థ అలాలేదు. దానిమీద సుప్రీంకోర్టుకు దాదాపు ఎలాంటి అధికారాలూ లేవు. హైకోర్టు తీర్పుల మీద సుప్రీంకోర్టుకి అప్పీలు చేసుకోవచ్చు, అంతే.

మరి హైకోర్టు జడ్జీలు మిగతా మామూలు వ్యక్తులకంటె అతీతులా? వాళ్ళు మిగతా ప్రలోభాలకు లోనుకారా? వాళ్ళకు పరిచయాలు పెరిగితే అది వాళ్ళకే ప్రమాదకారిగా పరిణమించదా? ఈ ప్రశ్నలకు యింతవరకూ దాదాపుగా అవసరం కనపడలేదు. కాని నేడు న్యాయవ్యవస్థలోని పగుళ్ళు చూచిన తరువాత ఈ ప్రశ్నలు వేసుకోక తప్పటం లేదు.

దీనికి కొంతవరకైనా బదిలీ పరిష్కారమార్గం కాదా? ప్రభుత్వ వ్యతిరేకులే బదిలీ అవుతారనేది అర్థరహితమైన వాదం. ప్రభుత్వ వ్యతిరేకి అయిన న్యాయమూర్తి మద్రాసులోనూ వ్యతిరేకే, ఢిల్లీలోనూ వ్యతిరేకే అవుతారు కదా!

ఐ. ఎ. యస్. ఐ. పి. యస్. అధికారులు దేశంలోని అన్ని ప్రాంతాలకూ పోయి పనిచేయటం లేదా?

హైకోర్టు జడ్జీల ప్రవర్తన, సామాన్య న్యాయాధికారి ప్రవర్తన కంటె భిన్నం కానప్పుడు–వాళ్ళు ఒకేచోట శాశ్వతంగా ఉండాలనటంలో స్వారస్యమేముంది.

ఇదే జడ్జి సుప్రీంకోర్టుకు న్యాయమూర్తిగా ఢిల్లీ పోతాడు. కాని ఢిల్లీ హైకోర్టుకు పోలేడా? ఇది విచిత్రమైన వాదనే.

ముఖ్యంగా మనస్థాయి ఈ విషయంలో ఎంతవరకు దిగజారింది అనేది మరీ హాస్యాస్పదంగా కనపడుతుంది. సుప్రీంకోర్టులో డాక్టరు. యల్. యమ్. సంఘ్వీ బోటి న్యాయవాది, బీహార్ ప్రధాన న్యాయమూర్తి శ్రీసింగ్ తరపున ఒక వాదం చేశాడు, ఆయన పాట్నాలో వృద్ధురాలైన తన తల్లిని కనిపెట్టుకు ఉండాలని. బీహార్‌లోనే ఎంతమంది సబార్డినేట్ న్యాయాధికారులను శ్రీసింగ్ బదిలీచేసి ఉండరు? అందులో ఎంతమందికి వృద్ధులైన తల్లితండ్రులు లేరు?

మారలేకపోవటానికి ఇదా మహత్తర కారణం?

అందుకనే కాబోలు, ఈ మధ్యనే పదవీవిరమణ చేసిన సుప్రీంకోర్టు జడ్జి శ్రీకృష్ణయ్యర్, మద్రాసులో రాజీనామా చేసిన మద్రాసు హైకోర్టు చీఫ్‌జస్టిస్ శ్రీ ఇస్మాయిల్ ఛాయాచిత్రాన్ని ఆవిష్కరిస్తూ ఇలా అన్నారు:

కింది కోర్టు జడ్జీల బదిలీ చేసే అధికారాన్ని గురించి నేను వ్యాఖ్యలు చెయ్యను. అలాగే బదిలీల పద్ధతి, న్యాయమూర్తులు, న్యాయవాదులు — న్యాయవ్యవస్థని పరిపాలనా వ్యవస్థ బారినుంచి సంరక్షించేందుకు కావల్సే కన్నీటిని గురించి వ్యాఖ్యలు చెయ్యను. ఎన్నో రకాల బదిలీలు ఉంటాయి — సమ్మతితో కూడినవి, కన్నీటితో కూడినవి, పయికి తీసుకుపోయేవి, క్రిందికి దించేవి, కొన్ని చెయ్యతగినవి, కొన్ని పగతీర్చుకొనటానికి చేసినవి. ఏది ఏమయినా, ఈ పీలు ఎన్నో దేశాల రాజ్యాంగాలకి ఉన్నది. ప్రస్తుతం పారుతున్న అశ్రువుల వెనుక కపటపు మాటలు వినపడుతున్నాయి. హైకోర్టు వారే చేయించే కింది కోర్టుల వారి బదిలీల విషయాలు చేశంలో ఒక్కరయినా రెప్పపాటు సానుభూతి చూపారా? వీరూ న్యాయవ్యవస్థలో భాగమే కదా? ఉన్నత న్యాయస్థానాల ఎత్తులు కట్టాతీతమయినవి కనుక వాటిలో వీరి బాధలు వినపడవు. చిన్నవారి కష్టాల సంగతి వచ్చేప్పటికి పెద్ద లాయరుల ఆధిక్యం మూగ గుణాలని ప్రదర్శిస్తారు. కింది న్యాయవ్యవస్థ వారి స్వాతంత్ర్యాన్ని నరికించే వారిలో హైకోర్టు జడ్జిలు, స్థానిక భూస్వాములు ఉంటారు. వీరిక్కితోడు వారి ఆర్థిక — వృత్తి సహాయమయిన ఇబ్బందులు ఉంటాయి. సుప్రీంకోర్టులో విసుగు లేకుండా మళ్ళీ మళ్ళీ న్యాయవ్యవస్థ యొక్క స్వాతంత్ర్యాన్ని గురించి మాటలు వినపడుతూ ఉంటాయి. ఈ మాటలు చెప్పేవారు న్యాయవ్యవస్థకీ, పరిపాలనా వ్యవస్థకీ చెందిన అధికారులని సరయిన దృష్టితో చూడరు. ఒక పక్క సిల్కు వస్త్రాలు ధరించేవారూ, మరొక పక్క కంచెరాలు ధరించేవారూ సాహస ప్రదర్శనలతో పోటీలు పడుతూ వుంటే నాకూ న్యాయవ్యవస్థకి సంబంధించిన స్వాతంత్ర్యంపట్ల మనక చూపు వచ్చినదన్న అనుమానం కలుగుతోంది...."

ఏది ఏమైనా ఈ తతంగాన్ని గూర్చిన సంగతులన్నీ, న్యాయమూర్తుల బదిలీ కేసులో సుప్రీంకోర్టు తీర్పు పూర్తిపాఠం బయటికొచ్చిన తరువాతగాని వివరంగా తెలియవు, అప్పటికే ప్రముఖ పత్రికారచయిత శ్రీ అరుణ్ షోరే ఈ సందర్భంలో ప్రశంసనీయమైన కృషిచేస్తున్నాడు సుమా !

ఇక మన ప్రాంతంలో పరిస్థితి ఎలా ఉంది ?

ఎంతమంది ఉన్నతాధికారులు ముఖ్యంగా న్యాయశాఖకు సంబంధించినవారు ఉద్యోగాలలో చేరిన తరువాత, చాలా రోజులకు తమ తమ జనన తేదీలను ఏదో ఒక విధంగా మార్చుకునేందుకు తంటాలు పడుతున్నారు ?

ఎంతమంది హైకోర్టు న్యాయమూర్తులు స్వగృహాలను కలిగి ఉన్నారు ? న్యాయవాదిగా ఈ నగరంలో వృత్తిలో ఉండి, స్వగృహాన్ని నిర్మించుకున్న వ్యక్తి, పదవి లభించటంతోనే ప్రభుత్వ గృహంలోకి మారాలా ? అదీ తమ తమ గృహాలను చక్కటి అద్దెలకు అద్దెకిచ్చి మరీ ప్రభుత్వగృహాలలోకి మారటమా ? ఇది విచిత్రంగా లేదా ?

ఈనాడు ప్రభుత్వం తలపెట్టిన భూసంస్కరణల అంతిమ స్వరూపమేమిటి ? ఎన్ని ఎకరాలను ప్రభుత్వం పంచగలిగింది ? అందులో న్యాయస్థానాల పాత్ర ఎంత ?

## IV

మన న్యాయవ్యవస్థను గురించి విమర్శించుకోవటం చాలా బాధాకరమైన విషయమే. కాని గత్యంతరం లేనప్పుడు మౌనం వహించటం ఆత్మద్రోహం చేసుకోవడమే అవుతుంది. గుడ్డిగా కనపడుతున్న వాటిని చూస్తూ కూడా కళ్ళు మూసుకోవడం దేశానికే ద్రోహం చేసినట్లవుతుంది. ఆ ఉద్దేశ్యంతోనే ఈ విషయాలను ఇక్కడ ప్రస్తావించటం జరిగింది.

రెండవ కారణం — మనం న్యాయవ్యవస్థను గౌరవిస్తున్నాం. న్యాయవ్యవస్థలో భాగస్వాములుగా న్యాయమూర్తులను గౌరవిస్తున్నాం. న్యాయవ్యవస్థ కంటె భిన్నంగా, న్యాయమూర్తులు ప్రతీకలే. న్యాయమూర్తులను వ్యక్తులుగా విమర్శించినా, ఆ విమర్శ, ఆ వ్యవస్థమీద గౌరవంతోనే జరుగుతుంది. కాపాడవలసింది వ్యవస్థ, వ్యక్తులు కాదు సుమా !

మూడవ కారణం అమెరికన్ లిఖితరాజ్యాంగం మనకు అనేక విషయాల్లో మార్గదర్శకంగా తయారయింది. దాని వరవడిని మనం గౌరవిస్తున్నాం.

అక్కడ సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జీవితాంతం న్యాయమూర్తులే. కాబట్టే అక్కడ సుప్రీంకోర్టు అతి ప్రముఖ వ్యవస్థ. అది వారి జీవితాలను ప్రభావితం చేసినట్లుగా, ఏ వ్యవస్థా ప్రభావితం చేయదు. అంతా మారతారు, కాని సుప్రీంకోర్టు న్యాయమూర్తులు మారరు, శాశ్వతంగా ఉంటారు.

ఇరువురు పత్రికా విలేఖరులు నిక్సన్ కాలంలో నియమితుడైన సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తి వారెన్ ఇ బర్గర్ పదవీకాలంలో, 1969 నుంచి 1976 సంవత్సరాల చరిత్రను గురించి "ది బ్రదరెన్" అనే గ్రంథం వ్రాసారు. దానిని గురించి ఒక పత్రిక, సుప్రీంకోర్టును గురించి ఉన్న "కాన్‌స్పిరసీ ఆఫ్

"సైలెన్స్" ను ఆ గ్రంథం పగలకొట్టిందన్నది. మనం కూడా అలాంటి చర్య తీసుకోవలసిన తరుణం ఆసన్నమయిందనిపిస్తుంది.

ఇంతకూ నిక్సన్ చేత నియమింపబడ్డ ఆ బర్గరే నిక్సన్ టేప్సును బయటపెట్టాలని ఆదేశించాడు సుమా!

ఈ ధోరణులను చూచే శ్రీకృష్ణయ్యర్ ఇలా అంటాడు:

"రాజకీయ వాదుల సంగతీ, సీనియారిటీ నిరూపించుకోవాలని చూసేవారి సంగతీ వేరు. నేటి విమర్శకులతోసహా అందరూ—వీరిలో ప్రధాన న్యాయమూర్తులూ ఎందరో వున్నారు – ఈ వృత్తిని పట్టుబడకుండా అనుసరించిన వారే! పాపం చెయ్యనివాడు మొదటిరాయి వేస్తాడు గాక! జరిగినది మరిచిపోయి, తిరిగి ఇప్పుడు మొదలు పెడదాము."

కాబట్టి మన న్యాయవ్యవస్థను మనమే విమర్శించుకోవలసిన తరుణం ఆసన్నమయింది, తప్పదు సుమా!

## అధోజ్ఞాపికలు

(1) దేశాయి ప్రభుత్వంలో శ్రీ చరణ్‌సింగ్, శ్రీ బహుగుణ దేశీయాంగ మంత్రి, పెట్రోలియం—రసాయనాల శాఖల మంత్రులుగా పనిచేశారు. జనతాపార్టీని ఏర్పరిచిన భాగాలకి వారు నాయకులు. శ్రీ చరణ్‌సింగ్ తమ మంత్రివర్గాన్ని నిర్మించుకున్నప్పుడు శ్రీ బహుగుణని ఆర్థికమంత్రి చేశారు. అయితే, దేశీయాంగ మంత్రిగా శ్రీ చరణసింగ్ ప్రధానమంత్రికి రాసిన ఉత్తరం, శ్రీ బహుగుణ దానికి రాసిన సమాధానం చదివితే బాధ కలుగుతుంది. శ్రీ బహుగుణ కార్యకలాపాలు "ప్రభుత్వానికి చెడు పేరు తీసుకువచ్చి జనతాపార్టీ నాశనం కాగ"లదని శ్రీ చరణసింగ్ 2-4-1978 తేదీ కల ఉత్తరంలో ప్రధానమంత్రికి రాశారు. లక్నోలో జనతాపార్టీ అభ్యర్థి అపజయానికి శ్రీ బహుగుణ కారణం అని ఆయన ఆరోపించారు. శ్రీ బహుగుణ ఒక కమ్యూనిస్టు అని ఆయన అన్నారు. కొందరు ఆయనని కె. జి. బి. ఏజెంటు అంటున్నారని కూడా శ్రీ చరణసింగ్ అన్నారు. శ్రీ బహుగుణ మీద అవినీతి ఆరోపణలు చేసి ఒక పారిశ్రామిక వేత్తకి (ఆయనపేరుని చెప్పి) ప్రత్యేకంగా అనుగ్రహం చూపబడిన దన్నారు. ఈ ఆరోపణలకి సమాధానం యిస్తూ జూలై 10 నాడు శ్రీ బహుగుణ ప్రధానమంత్రికి ఒక ఉత్తరం రాశారు. శ్రీ చరణసింగ్ ఉత్తరం నిరాధారంగా దూషించటంలో, ఆత్మాభిమానం ప్రదర్శనలో సాటిలేనిదని శ్రీ బహుగుణ అన్నారు. శ్రీ చరణసింగ్ ఆరోపణలు "అసత్యమయినవి, దురుద్దేశం కలవి, బాధ్యతారహితమయినవి" అని శ్రీ బహుగుణ అన్నారు. శ్రీ చరణసింగ్‌కి తానంటే తనకే వ్యామోహం ఎక్కువ అని ఆయన అన్నారు. దేశీయాంగ మంత్రిశాఖ యిటువంటి వ్యక్తికి వప్పచెప్పటం సమంజసమేనా అని ఆయన అడిగారు. [2-8-1979 ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో "ఫాసిజమ్‌ని ఎదిరించే కొత్త నేస్తాలు" అన్న శీర్షిక కల వార్త చూడాలి. అందులో ఉత్తర ప్రత్యుత్తరాల పూర్తి పాఠాలు ఉన్నాయి.] ఒకరిని గురించి ఒకరు ఈ విధంగా అనుకుని, అన్న ఇద్దరూ ఒక మంత్రి వర్గంలో ప్రధానమంత్రి, పెట్రోలియమ్—రసాయనాల శాఖమంత్రిగా ఉండటం రాజకీయాలలో విలువలు లేవనే వాదాన్ని బలపరిచే వారి నడవడికి ఎంతదూరం పోగలదో తెలిపే ఉదాహరణలు.

"కాన్‌స్టిట్యూషనల్ లా అఫ్ ఇండియా" రెండవ కూర్పు, సంపుటం III—హెచ్. ఎమ్. సీరావి (త్రిపాఠీ పబ్లికేషన్స్, బొంబాయి, 1979.)

(2) ఎమ్. సి. సెటల్వాడ్—"మై లయిఫ్—లా ఎండ్ అదర్ థింగ్స్" 1971, జనవరి పునర్ముద్రణ, పుటలు 500, 501 (త్రిపాఠీ పబ్లికేషన్స్.)

"31 జనవరి 1964 నాడు బి. పి. సిన్హా చీఫ్ జస్టిస్‌గా రిటయిరయ్యారు. ఆయన ముందు ఎవరూ అంతకాలం ఆ ఉద్యోగంలో లేరు. అయినా సుప్రీమ్‌కోర్టు చీఫ్ జస్టిస్‌లలో ఆయనకి లభించినంత తక్కువ గౌరవం యింకెవరికీ లభించలేదు. రిటయిరయిన తరువాత ఆయన కార్యకలాపాలు—ఒక ప్రయివేటు వాణిజ్య సంస్థలో ఉద్యోగం తీసుకోవటం మరీను—చాలా వ్యతిరేక విమర్శకి దారితీశాయి. న్యాయవ్యవస్థ కీర్తిని తగ్గించాయి."

(3) "సాంఘిక న్యాయం—రాజ్యాంగం" సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ ఎండోమెంట్ లెక్చరస్, ఆంధ్రా యూనివర్శిటీ, 1975, శ్రీ పి. జగన్‌మోహనరెడ్డి, రిటయిర్డ్ జడ్జీ, సుప్రీమ్ కోర్టు అఫ్ ఇండియా (ఆంధ్రా యూనివర్శిటీ ప్రెస్—సెప్టెంబరు 1976, పుటలు 24, 25.)

"కీ. శే. మోతీలాల్ సెటల్వాడ్ (రిటయిర్డ్ అటార్నీ జనరల్ అఫ్ ఇండియా)కి వాస్తవిక దృష్టి కలవారన్న పేరు ఉండేది. తమ వృత్తి చివరి రోజులలో ఆయన ఈ దృష్టిని వదులుకున్నట్లు కనిపిస్తుంది...."

"ఎన్నో వ్యవహారాలనీ, తమకీ ఇతర జడ్జీలకీ మధ్య జరిగినట్లు చెప్పబడే సంభాషణలనీ ఈ పుస్తకం పేర్కొంటుంది.

జడ్జిలు యివి జరగలేదంటున్నారు. కొందరికీ, కొన్ని సిద్ధాంతాలని అనుసరించే కొన్ని రాజకీయపక్షాలకీ న్యాయ వ్యవస్థ యొక్క స్వాతంత్ర్యం అంటే నమ్మకం లేదు. మన ప్రజాస్వామ్యం నశించి పోవటానికీ, అయోమయం ఏర్పడటానికీ పీరు జడ్జీలనీ, న్యాయవ్యవస్థనీ దూషిస్తున్న తరుణంలో ఈ పుస్తకం వెలువడింది. అందువలన చాలా నష్టం కలిగింది."

(4) ఈ సభలో బారిస్టర్ ఏ. ఆర్. అంతూలే ఉండటం దాని అదృష్టం. ఈ చారిత్రిక రాష్ట్రానికి ఆయన ముఖ్యమంత్రిగా ఉంటున్నారు, ఈ దేశంలో ఎప్పుడూ ఐకమత్యం, దేశభక్తి, జాతీయ భావాన్ని పెంచే శక్తి ఒకటి వుంది. అది చైతన్యం కలది. ఉద్దీపనం కలది. ఆ శక్తికి ఆయన ప్రతినిధి. ఆయన ఆవిష్కరించటం ఆ మంచి శక్తులు మన వయిపు ఉండటంతో సమానం. మన ప్రియ సోదరుడు బారిస్టర్ అంతూలే మూర్తీభవించిన దీక్ష, చైతన్యం కలవారు. వికాసం చెందిన ఈ జాతీయ భ్రాతృ మండలికి నీకు స్వాగతం....అందులో మీకూ సభ్యత్వం ఉంది....ఈ గొప్ప రాష్ట్రం యొక్క ప్రజల ప్రతినిధి మీరు. ఈ దేశం యొక్క గొప్ప నాయకత్వానికి ప్రతినిధి మీరు."

(5) "కొన్ని ప్రమాణాల పట్ల ఉండదగిన గౌరవాన్ని కొన్ని రకాల నడవడి పట్ల ఉండదగిన గౌరవం నుంచి వేరు చెయ్యటానికి వీలులేదు. ఈ జడ్జీలు తమ నడవడిలో ఈ గౌరవాన్ని చూపించలేకపోయారు" టయిమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక.

"ఈ గృహాల నిర్మాణానికి సిమెంటు సరఫరా ఒక పెద్ద సమస్య కాదని ఆశించాలి. ఎందుకంటే, జస్టిస్ అగర్వాల్, జస్టిస్ మనోహరర్‌లు ప్రమోటరులుగా నియమింపబడ్డారు. ఇద్దరూ అంతూలే యొక్క ఇందిరా ప్రతిభా ప్రతిష్ఠాన్‌లో ధర్మకర్తలే.

"ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా కేసులు ఒక హైకోర్టులో నిలిచి ఉన్నప్పుడు ఆ హైకోర్టు న్యాయమూర్తులు తమకి గృహనిర్మాణానికి చవుకగా స్థలాలు కావాలని ముఖ్యమంత్రినే అడగటం సముచితంగా లేదని కొందరు సందేహించవచ్చు కాని ఈ రోజులలో ఏది సముచితమో, ఏది కాదో అనుకునే వారెవరు!" మహారాష్ట్ర టయిమ్స్ పత్రిక.

******

# ఉగాది

## ఇసుకపల్లి సుజాత

ముబ్బుల మధ్య మెరిసిన మెఱుపల్లే
చీకట్లో వెలిగిన వెలుగుల రవ్వల్లే
ఆకుల సందుల్లో తళ్ళుక్కుమనే తెల్లని మల్లె పువ్వల్లే
గాలి విసురుల్లో వినబడే సన్నని పాటల్లే

నిరాశల మధ్య విరిసిన ఆశల్లే
మళ్ళీ వచ్చింది ఉగాది పండుగ
తూర్పు కొండ చాటునుండి తొంగి చూచాడు సూర్యుడు
మొదలయ్యింది నిరాశల మధ్య ఆశల వెతుకులాట!

శ్రీ వసంతరావు వేంకటరావు

# సైకోట్రానిక్స్

విశ్వంలో ప్రవర్తిస్తున్న శక్తులు, బలాలు భౌతిక విజ్ఞానానికి తెలిసినవి చాలా ఉన్నాయి: విద్యుత్తు, అయస్కాంతత్వం, విద్యుదయస్కాంతత్వం, గురుత్వాకర్షణ, ఉష్ణం, ధ్వని, తేజస్సు, ఘర్షణ మొదలైనవి. వాటి ధర్మాలను అధ్యయనం చేసి మానవోపయోగానికి అవసరమైన యంత్రాలు, పరికరాలు నిర్మించి ఉపయోగిస్తున్నారు. మానవుని మనస్సు ఒక మహత్తర శక్తి అనడానికి ప్రాచ్యదేశాలు ఏనాడో గుర్తించినప్పటికీ, మనశ్శక్తి, [illegible] ప్రవేశించలేదు. మనశ్శాస్త్రం ఒక శాఖగా అధ్యయనం చేయబడుతున్నప్పటికీ, ప్రయోగాత్మకంగా పాశ్చాత్య దేశాలలో కొంత ప్రగతి సాధిస్తుంది కాని, శాస్త్రంగా పూర్ణత్వం పొందలేదు.

సైకాలజీ అంటే మనశ్శాస్త్రం. దానికి అర్థాలు: మనశ్శాస్త్రం లేదా మనస్థితుల, ప్రక్రియల శాస్త్రం; మానవ ప్రవర్తన శాస్త్రం. "సైకీ" అనే పదానికి అర్థాలు: ఈరాస్ ప్రేమించిన అందమైన అమ్మాయిగా వ్యక్తీకరింపబడిన ఆత్మ; మానవుని ఆత్మ, ఆధ్యాత్మిక శక్తి లేదా మనస్సు; ప్రక్రియోన్ముఖుని చేసే మానవుని మానసిక నిర్మాణం. "సైకిక్" అనే పదానికి అర్థాలు: మానవుని ఆత్మకు లేదా మనస్సుకు సంబంధించిన; మానసిక (భౌతికానికి విరుద్ధంగా); సామాన్య శారీరక ప్రక్రియలను మించి కాని, వాటికి స్వతంత్రంగా కాని ఉత్పన్నమైన మానసిక దృగ్విషయాలకు సంబంధించిన; ప్రకృతి జ్ఞానానికి కాని శాస్త్రజ్ఞానానికి కాని వెలపల ఉండేది; అభౌతికమై అసాధారణమైన బలానికి కాని, కర్తకు కాని సంబంధించిన, వాటివల్ల కలిగిన; అట్టి బలాల ప్రభావానికి ముఖ్యంగా మొగ్గేది.

సైకాలజీలో మనస్సు గురించి మాత్రమే ప్రస్తావన ఉంటే, సైకీ, సైకిక్ పదాలలో ఆత్మగురించి, మనః ప్రక్రియలను అధిగమించే ప్రక్రియల గురించి ప్రస్తావన ఉంది. అంటే, కేవల మనశ్శక్తిని మించిన శక్తి మానవునిలో ఉందనీ, అది కొన్ని కార్యాలు సాధించగలదనీ అంగీకరింపబడింది. అటువంటి శక్తులకు సంబంధించిన శాస్త్రభాగాన్ని "పేరా సైకాలజీ" అన్నారు. దాని అర్థం: మనశ్శాస్త్రంలో ఒక భాగం; క్లెయిర్ వోయన్స్, టెలిపతి, అతీంద్రియ శక్తివంటి అభౌతిక దృగ్విషయాలను పరిశోధించే విభాగం.

కాబట్టి, పేరా సైకాలజీలో జరిగే పరిశోధనలు మనశ్శక్తి సంబంధించిన విషయాల పైన కానే కాదని స్పష్టమవుతుంది. సైకాలజీ కేవలం మనస్సుకు సంబంధించిన శాస్త్రం. అందుచేత, మనస్సుకు అతీతమైన విషయాలకు సంబంధించిన శాస్త్ర విభాగాన్ని పేరా సైకాలజీ అనడం సముచితంగా లేదన్న భావంతో, చెకోస్లోవేకియాలో ఒక శాస్త్రజ్ఞుల బృందం "సైకోట్రానిక్స్" అనే విస్తృతార్థం గల పదాన్ని సృష్టించింది. ఇందులో మనస్సు పాత్ర స్వల్పం; అదొక పరికరంగా మాత్రమే పనిచేస్తుంది. కాగా అంతఃస్ఫూర్తి (ఇన్‌ట్యూషన్) ప్రాధాన్యం వహిస్తుంది. ఆ పదంతో బాటు దాని పరిధిని కూడా బృందం సూచించింది.

వైజ్ఞానిక పరిధిలోనికి రాని ఇంద్రియాతీతశక్తులు ప్రదర్శిస్తున్న సంఘటనలను చూచిన విజ్ఞానులలో కొందరు వాటిని ఉపేక్షించేరు; కొందరు వాటిని మోసమన్నారు; కొందరు ఇంద్రజాలమన్నారు. మరి కొందరు వైజ్ఞానికంగా పరిశోధింపతగిన సంఘటనలు అన్నారు. తుది అభిప్రాయాన్ని ఆమోదించిన విజ్ఞానుల బృందం పేరా సైకాలజీ అనే పదం పరిశోధనకు ప్రోత్సహించక పోవడమే కాక అంతరాయం కలిగిస్తూందన్న భావంతో "సైకోట్రానిక్స్" అనే పదాన్ని కల్పించింది.

ఆ బృందం ఇంకా ఇట్లా అంది:

పేరా సైకాలజీ అనే పదం వైజ్ఞానిక పరిశోధనకు సరైనదిగా కాని అర్థవంతంగా కాని లేదు. పరిశోధన విషయం ఆత్మకు, నాడీ మండలానికి సంబంధించినదన్న భావాన్నీ, తనకుగా తను నిలుపగల ఒక శక్తికి సంబంధించిన విషయమనీ సైకో

ట్రానిక్స్ అనే పదం సూచిస్తుంది. కొన్ని భౌతిక దృగ్విషయాలను కాని జీవసంబంధమైన దృగ్విషయాలను కాని మనకు తెలిసిన శక్తుల పరంగాను బలాల పరంగాను విశదీకరించలేని సందర్భాలలో ఈ శక్తి రూపాన్నే ప్రస్తావిస్తున్నామని గమనించాలి. ఈ శక్తి విద్యుదయస్కాంత శక్తి కంటె చాలా సూక్ష్మమైనది. సర్వదా అది ఆత్మలోని అంశకు, ఆత్మ ప్రచోదనకు సంబంధించినది. మనకు తెలిసిన రకరకాల శక్తులుగా రూపాంతరం పొందడానికి కాని, మారడానికి కాని ఈ శక్తికి అవకాశం లేదు అనలేము. ఇతర రకాల శక్తుల కంటె ఇది సూక్ష్మస్థితిలో నుంది. కాబట్టి మనకు తెలిసిన రూపాంతరణ నియమాలను అనుసరించి దీనిని గుర్తించగల శక్తి రూపాలలోనికి మార్చగలమని ఆశించవచ్చు. ఉదాహరణకు, సూక్ష్మమైన విద్యుదయస్కాంత శక్తి గామా కిరణ రూపంలో బలమైన న్యూక్లియర్ క్షేత్రంలో ప్రయాణించినప్పుడు, అది స్థూలమైన ఎలెక్ట్రాను పాజిట్రానుల జంటగా రూపాంతరం పొందుతుందని ప్రయోగాలు ధ్రువ పరిచేయి. అటువంటి రూపాంతరణం ఈ శక్తితోనూ సాధించవచ్చు.

"సైకోట్రానిక్స్"ను క్రింది విధంగా నిర్వచించవచ్చు. ఇది ముఖ్యంగా మానవుని జీవశాస్త్రానికి సంబంధించినది. మానవుని సైకీ యొక్క అసాధారణ ఆవిర్భావాల వల్ల సంపాదించిన సైకిక్, భౌతిక, జీవ సంబంధ జ్ఞానాలతో జడ జీవప్రపంచాలకు అనువర్తించే నియమాలను పూర్తి చేయడం దాని ధ్యేయం. దానికి ఇంకో ధ్యేయం [illegible] ఉంది. మనిషి శరీరంలో వినియోగించే శక్తి మనకు తెలిసిన విద్యుత్తు గురుత్వాకర్షణాది శక్తుల వంటి శక్తి కాదని నిర్ధారణ చేసుకొన్న తరువాత మనిషి ద్వారానో యంత్రం ద్వారానో ఈ శక్తిని సంగ్రహించడానికి కృషి చేయడం. దీనిని "సైకోట్రానిక్ శక్తి" అనవచ్చు. దీని ఉనికిని ప్రయోగాలు గుర్తించిన తరవాత క్రొత్త రూపంలో నున్న ఈ శక్తి యొక్క ధర్మాలను అధ్యయనం చేయడం మరో లక్ష్యం.

సైకోట్రానిక్స్ నిర్వచించిన విజ్ఞానుల బృందానికి మరో అభిప్రాయముంది. సైకోట్రానిక్ శక్తిని గుర్తించి నిర్వచించడం ద్వారా నిరంతర గమనంలో నున్న జడ జీవ ప్రపంచాలకు వర్తించే నియమాలకు సమగ్రరూపం ఇచ్చే అవకాశముంది. కనిష్ఠ ఋణావేశంగల ఎలెక్ట్రాన్ (క్వార్క్ ఇంకా గుర్తింపబడలేదు)కు కణధర్మం, తరంగధర్మం కూడా ఉన్నాయని ప్రయోగాలు నిరూపించేయి. అంటే ఎలెక్ట్రాన్ ద్వంద్వ స్వభావం నిజమని అంగీకరించేరు. దీనికి సైకోట్రానిక్ శక్తిని చేర్చినప్పుడు త్రికము ఏర్పడుతుంది. అప్పుడీ త్రయీభావమే ప్రకృతి యొక్క అత్యుత్తమ నియమంగా అంగీకరించే అవకాశముంటుంది.

ఆత్మానాత్మ విచారణకు అవసరం లేని కమ్యూనిస్టు దేశాల విజ్ఞానులు ఆత్మశక్తిని గుర్తించడానికి విశ్వాసపూర్వకంగా కృషి చేస్తున్నారన్నది గొప్ప విషయం.

సంప్రతింపు గ్రంథం : సైకిక్ డిస్కవరీస్ బిహయిండ్ ది అయరన్ కర్టెన్, రచన : షీలా ఆస్ట్రాండర్, లిన్ ష్రోడర్.



# ఉగాది గీతి

శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి

రమ్మోయి పికరాజ! రమణీయ సంగీత
దివిజ తరంగిణి దింపవయ్య!
రావోయి మాధవా! లలితపల్లవజాల
మల్లల్ల నెల్లెడఁ జల్లవయ్య!
కాలుమోపువసంత! కమనీయ కల్యాణ
ప్రసవసౌందర్యాలు పంచవయ్య!
రారమ్ము శృంగార రసరాజమా! కళా
సుషమా విలాసమ్ము చూపవమ్మ!

చంచలచ్చంచరీక సమంచితమ్ము
పుష్ప బాణమ్ము వలరాజ పూనవయ్య!
వనము బృందావనమ్ము కావలయు నేడు
జీవనము 'రాసలీలగాఁ జెలగవలయు.

జారినకాలమున్మరచి స్వాంతముగంతులు వేయ నవ్యశృం
గార తరంగ రంగముల కమ్మగ ప్రొద్దులుపుచ్చుడోయి- చే
జారిన వచ్చునా సుఖరసమ్ము వరమ్ము - కళా పిపాసికిన్
సారము రా ఉగాది - సరసాలకు సాల కళా విశారదా!

బెల్లము వన్నెలాడి - అదెవేప జలేజ దళాక్షి - తింత్రిణీ
హల్లకపాణి - మామిడియెయారి- ఒయారము లుల్లసిల్లగా
చల్లగ పంచసాగిరి ప్రసాదములన్ ప్రతియింట రండు-సం
ఫుల్ల ముఖార విందముల పుట్టుక ధన్యము గాగ సర్వథా.

మమత సమతాను రాగాలు మానసముల
నూడు పూలాఋ కాయలై పొదలుగాత
గుండెలో స్నేహ దీపాలు కుదురు కొలిపి
కరుణఁ జూడుము తల్లి! ఉగాది లక్ష్మి!



డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# ప్లాటినస్

**నేపథ్యం:** గత నాల్గు సంవత్సరాలనుంచి ఈవ్యాసకర్త భాషా తత్త్వ సిద్ధాంతాలపైన ఆ. ప. డి. సం. (1978, 79, 80, 81) లో వ్యాసాలు రాశాడు. 'వ్యంజన సూత్రం' అనే సిద్ధాంత వ్యాసాన్ని రచించి గ్రంథంగా ముద్రించాడు కూడా (1981). ఆ వ్యాసాల్లో, సిద్ధాంత గ్రంథంలో ఒక్క విషయాన్ని గురించి చెప్పడంలో మాత్రం తగినంత పరిశ్రమ చెయ్యలేకపోయాడు. అదృష్టవశంగా ఇతరులు గుర్తించి తెలుపక పూర్వమే తన పరిశీలనలోని అనుగ్రహ ఉన్న ఆ ఒక్క విషయాన్ని గుర్తించగలిగాడు. అందుకే ఈ వ్యాసం రచింపబడుతోంది. 'ప్లాటినస్' తత్త్వ దృష్ట్యా పూర్వం రచింపబడ్డ వ్యాసాల్లోని విషయాల్ని పునస్సమీక్షించడం కూడా జరుగుతుంది. పాఠకులు కూడా ఈ మార్గంలో తన రచనల్ని అనుశీలిస్తే ప్రయోజనవంతంగా వుంటుందనీ విన్నవించుకొంటున్నాడు.

**పునస్సమీక్ష :** 'భారతదేశంలో భాషాశాస్త్రం' అనే వ్యాసం (1978) లో అనేక విషయాల ప్రసక్తి వున్నా స్పష్టంగా 'వెస్టర్న్ పారలల్స్' ఉన్నచోట్లు కూడా నిర్లక్ష్యం చేయబడ్డాయి. ఆ దృష్ట్యా 'వాక్కు-భాష' (1980) నయం. 'ఆలంకారికుల వాక్తత్త్వ దర్శనం (198 )లో కూడా ఈ పాశ్చాత్యదృష్టి సమన్వయం కనిపించడంలేదు. 'వాగర్థాద్వైతం' (1979) కూడా ఈకోవకు చెందిందే. 1981లో ప్రచురించిన 'వ్యంజనసూత్రం' అనేవ్యాసానికి ప్రమాణంగా గ్రహించబడ్డ నోలి పండితుడి ఉపోద్ఘాతం (1968) - బహుశా 1978 ప్రాంతంనుంచి ఈ రచయితలో ధ్వని సిద్ధాంతం - ఒక్క భారతదేశంలో మాత్రమే పెరిగింది ప్రపంచంలో మరెక్కడా ఈదృష్టిలేదన్న అభిప్రాయాన్ని కల్గించి ఉండవచ్చు. అది ఈ వ్యాసకర్త లోపంతప్ప నోలిపండితుడు ఊహించింది అది కాదు. నోలివాక్యాలు (పూర్వోదాహృతం, చూ. 1981 (వ్యా. పు 58) పునస్సమీక్షిస్తే ఇలా వ్యాఖ్యానించుకోవాలి.

గ్రీకుల్లో అలెగ్జాండ్రియనుల కాలంనుంచీ భాషా శబ్దానికున్న తాత్త్వకార్థ స్ఫురణకు సంబంధించిన అవగాహనున్నా అది మత గ్రంథాలకు మాత్రం—పరిమితమన్న దృష్టి ఉన్నందువల్ల పాశ్చాత్యుల్లో ఆనంద వర్ధనుడి అభిప్రాయానికి 'పారలల్'గా చెప్పదగ్గ అభిప్రాయం పుట్టలేదని—1

నోలి సెయింట్ తామస్ అక్వినాస్ రాసిన 'సుమ్మాతియొలాజియె' గ్రంథం (1-1-10)ని ఉదాహరించారు. ఈ రచయిత కూడా ఆ సంవత్సరాల్లో (1978-81) బైబిల్ నుంచి వ్యావహారిక—తాత్త్వికార్థాలున్న సందర్భాల్ని కొన్నింటిని సేకరించాడు. కాని ఆనందాభినవులతో సమానంగా గుర్తింపబడదగ్గ పాశ్చాత్య కళాతత్త్వవేత్త మృగ్యమనే ధీమా ఈ రచయితలకున్నట్టు స్పష్టంగా తెలుస్తోంది రచనల్ని బట్టి.

కాని ప్లాటినస్ని గురించి బాగా చదివిన తరువాత కొన్ని సందేహాలు నివృత్తమయ్యాయి. చాలా చోట్ల చదివినా ప్లాటినస్ తత్త్వ దృష్టి కె. సి. పాండే (1972) గారిని చదివేదాకా స్పష్టం కాలేదనే చెప్పాలి. ఇటీవల ఏర్పడ్డ ఈ అవగాహనను కూడా ఆ. ప. డి. సం. పాఠకులతో పంచుకోవాలనే దృష్టి యీ వ్యాసం రాయడానికి కారణం.

## పాశ్చాత్య కళాతత్త్వం – ప్లాటినస్

పాశ్చాత్య కళాతత్త్వ వ్యాఖ్యాతలలో, సోక్రటీసు. ప్లాటో, అరిస్టాటిలులు సూత్రకర్తలు కాగా థియోఫ్రాస్టస్, క్వింటీలియన్, డైయనోసియస్లు ఆ సూత్ర వృత్తికారులు. ఆ వర్గంలోని వాడే ప్లాటినస్ (204—269 క్రీ. శ.) అంతకు ముందటి వాళ్ళు సాహిత్యంలో వాగ్వ్యాపారనిర్వహణను గురించి మాత్రమే చర్చిస్తే ఆయన సాహిత్యానుభవతత్త్వమీమాంస చేశాడు. 'అనుభవం' (ఎక్స్పీరియన్స్) ఈయన సాహితీ సిద్ధాంత కేంద్రం అనుభవాన్ని తాత్త్విక, తార్కిక, మనః పద్ధుల్లో వ్యాఖ్యానించడంలో ప్లాటినస్ అసమాన ప్రతిభను కనపరిచాడు. అరిస్టాటిల్ సూత్ర వ్యాఖ్యానం అనడం కన్నా ప్లాటినస్ సిద్ధాంత ప్రతిపాదనం సర్వథా నూత్నం—అభినవం—అన్నా తప్పులేదు.

అరిస్టాటిల్ ప్రకారం రసానుభవం (ఈస్తటిక్ ఎక్స్పీరియన్స్) నిజ జీవితానుభవంకన్నా స్వభావతః భిన్నమైందికాదు. కాకపోతే సాహిత్యంలో ఆ ఉద్విగ్నత అత్యున్నతదశలో ఉంటుందని ఆయన అభిప్రాయం. త్రాసద (ట్రాజెడీ) సృజనం మాత్రమే, క్షాళన (కెథార్సిస్) సమర్థం కావడంలో పర్యవసిస్తోంది. కళాస్రష్ట ఇక్కడే వేదాంతితో సమానుడౌతున్నాడు. ఇది ప్లాటో అరిస్టాటిలులిద్దరూ అంగీకరించిన అభిప్రాయం. (క్షాళనం-గ్రీకుల మత సంబంధమైన ఒకానొక ఆచారం - మృత శౌచ సంబంధమైంది-తో ముడిపడింది.)

కాని ప్లాటినస్ ప్రకారం 'ఇది' కేవలం అనుభవోద్విగ్నత-మగ్నతకాదు. అనుభవం ఉపర్యుపరి మనోఽంతర భాగాల్ని తాకే లక్షణం కల్గింది. దీనికి భౌతిక మానసిక ఆధ్యాత్మిక దశాంతరాలున్నాయి. ఈ దశాంతరాల్ని దాటి పోవడంలో కళ తన స్వతంత్ర ప్రతిపత్తిని సాధ్యం చేసుకొంటోంది. అంచేత కేవలం నీతి ప్రబోధకం కావడమో కాకపోవడమో కళా ప్రయోజనంకాదు. అది అందించే అనుభవం యోగానుభవసదృశం (మిస్టిక్-అనే పదాన్ని యోగమనే అర్థంలో ఈ వ్యాసకర్త అనువదిస్తున్నాడు.)

## ప్లాటినస్ - అభినవగుప్తపాదులు

అభినవుడు ఆనందవర్ధనుడి ఆలోకానికి లోచనాన్నీ, భరతాచార్యుల నాట్య శాస్త్రానికి అభినవ భారతి వ్రాసినా సర్వదా ఆయన సిద్ధాంతం స్వతంత్రం. ఆనంద వర్ధనుడి ధ్వని సిద్ధాంతానికి కాశ్మీర శైవాద్వైతపు ముఖంగా వ్యాఖ్యానించి నాలుగు ఉద్యోతాలకీ అంతంలో అయన రాసిన ఏక పద్యశ్లోకస్తుతి ఆయన స్వతంత్రతా దృష్టికి నిదర్శనం. రసదృష్టికి తాత్త్విక నేపథ్యం కల్గించడంలో- ఆయన వ్రాసిన 'తంత్రాలోకం' వాటి- అవాచ్యంగా అభినవుల స్వతంత్రతను స్థాపించడానికి. పాండే మహాశయుడు తన పరిశోధనంతా అభినవులకే వినియోగించారు కూడా.

ప్లాటినస్ భావ పరంపర తరువాతి క్రైస్తవ మతానుయాయులకి మింగుడు పడిందికాదు. మళ్ళా రొమాంటిక్ సంప్రదాయం; క్రోచె మొదలైన భావవాదులు వెలుగులోకి వచ్చేదాకా ప్లాటినస్ని గురించి మధ్యలో ఎవరూ తడవలేదు.[2] అంచేత మొత్తం మీద 'ప్లాటినస్' పాశ్చాత్య కళా మీమాంసలో ప్లాటో-అరిస్టాటిల్ల స్థానంతో సమానమైన గౌరవాన్ని పొందినట్టుగా దాఖలాలేదు. 'మిస్టిక్' అనేపదం పాశ్చాత్య దేశాల్లో అన్క్లాసిఫైడ్ సైకీగా గుర్తింపబడ్డంకావచ్చు. ఈ నిరాదరణకు హేతువు.

కాని భారతదేశంలో యోగశాస్త్రం ప్రత్యక్షానుభవమే: యోగం ఏ మతంతోనూ సంబంధం ఉన్నదికాదు. అది మతాతీతమైన శాస్త్రీయసత్యం. అందుకే శైవాగమ-ప్రత్యభిజ్ఞానాస్పంద సిద్ధాంతాలు మాత్రమే కావ్యానుభవాన్ని - అందులోని తర్కాన్ని చెప్పగలిగాయి. తక్కిన ఏ సిద్ధాంతమూ (శ్రీ శంకరుల మాయా ద్వైతం కూడా) ఈ విషయంలో సమర్థం కావు. అంచేత భారతీయాత్మకు-ఆలంకారికమనః ప్రవృత్తికి ప్లాటినస్ చాలా సన్నిహితుడు. అంచేత ఆయన పాశ్చాత్య అభినవగుప్తుడు (ది వెస్టర్న్ అభినవ).

## ప్లాటినస్ విలక్షణత

ప్లాటినస్ చాలామంది పాశ్చాత్య విమర్శక తాత్త్వికుల్లాగా కేవలం విషయాన్ని విషయంగాచూసి 'తాపీ'గా- (అర్మ్‌చేర్ ఫిలాసఫీ) ఒక యూనివర్సిటీ ప్రొఫెసరులాగా- చెప్పినవాడుకాడు. సాహిత్య- రసానుభవానికి సంబంధించిన ఈ యోగికానుభవం ఆయనకి స్వయానా ఉంది.

ఆయన రోమ్ దేశస్థుడు. (క్రోచె పండితుడుకూడా ఇటాలియన్ కావడం ఈ సందర్భంలో మరిచిపోరాదు). ఆయన జీవితంకూడా ఇతరుల లాంటిదే. ఆయన తన జీవితంలో నాల్గుసార్లు ఈ యోగానందానుభవాన్ని పొందాడని అతడి శిష్యుడు 'పోర్ఫిరీ' రికార్డు చేసిపోయాడు. అంచేత ఇంద్రియాతీత దశా వ్యాఖ్యానం ఆయన కల్పించింది కాదు. అది అచ్చమైన ఆయన అనుభవం (ఎంపిరికల్).

ప్లాటో సిద్ధాంతానికి ప్లాటినస్ చేసిన సవరణ సరిగా ఈ అంశంలోనే. ప్లాటో ప్రకారం సత్య సత్యాన్ని పదార్థ జగత్తు సమగ్రంగా ఆవిష్కరించటానికి సమర్థం కాదు. ప్లాటినస్ ఈ విషయంమీదే తన దృష్టిని కేంద్రీకరించాడు. ప్రతివస్తువూ దానంతట నియమితమైన సత్య ప్రతిపాదక సామగ్రిగానే వుంటూ స్రష్ట అపేక్షించక పోయినా- ఉద్దేశించకపోయినా- నిత్య సత్యాన్ని ప్రతిఫలింపచేస్తూ ఉంటుందన్నది ఈయన సిద్ధాంతం.[3]

## సౌందర్య దృష్టి - తత్త్వ భూమిక

అతని సౌందర్యదృష్టి తత్త్వభూమికను కల్గింది. కళా సౌందర్యానుభవం తాత్త్వికానుభవానికి సన్నిహితం. ప్రపంచం సుందరమైంది. జ్ఞానప్రదాన సమర్థం. జీవుడికున్న ఇంద్రియానుభవ పరిగ్రహణశక్తి—ఊహాశాలిత-ప్రత్యభిజ్ఞ—మనన గుణం—ఇత్యాది లక్షణాలు పై ప్రతి పాదనకు ఆధారభూత విషయాలు. ప్లాటో అరిస్టాటిల్లు భావించినట్టుగా 'అనుకరణ' (ఇమిటేషన్) కళాసూత్రమనడాన్ని ప్లాటినస్ తిరస్కరించాడు. వారు నాటకాన్ని లోకానుకరణంగా భావిస్తే ఈయన ప్రతీక (సింబల్)గా గ్రహించాడు. ప్రతీకా కళావస్తువు తీవ్రమననం ద్వారా అభిజ్ఞాత మవుతోందని ఇతని సిద్ధాంతం. సౌందర్యం—'సుస్నిగ్ధ సంధిభావ' (సిమ్మెట్రీ) అని భావించడం కూడా గమనార్హం. మరో అంశం సుందరా సుందర వస్తుమీమాంస. ఆ సుందర వస్తువులో ద్రవ్యాధిక్యత ఉండటం ; సంధిభావం విశ్లథమవటం—కూడా ప్లాటినస్ గుర్తించాడు. తాత్త్విక కళానుభవాలు భిన్నదశల్లో ఒకదాన్ని మరోటి ఎలా స్పృశిస్తాయో ప్లాటినస్ స్పష్టంగా గుర్తించాడు.

**ఆభాస (థియరీ ఆఫ్ ఎమనేషన్)**

ఈ పదార్థ జగత్తు (ఆబ్జెక్టివ్ వరల్డ్) ప్లాటో భావించినట్టు భావప్రతిబింబం మాత్రమే కాదు. లేక అరిస్టాటిలు చెప్పినట్టు రూప నిర్దిష్ట పదార్థ పరిణామము కాదు. అది కేవలం ఏకైక సత్య వస్తువు పొందే ఆభాసం—సూర్యకాంతి ఒకే బింబంనుంచి ప్రపంచాన్నంతా ఆక్రమించినట్టు. ఆవస్తువు (తత్‌పదార్థం — భారతీయ పరిభాష) ప్లాటో చెప్పే భావజగత్తు కాదు : అరిస్టాటిల్ చెప్పే తార్కికరూప పదార్థ పరిణామ వినిశ్చిత భావరూపమూకాదు.

**వస్తు తత్త్వం**

దైవ, చైతన్య, ఆత్మలనే తత్త్వత్రితయం ఈ సత్యవస్తు స్వభావ వ్యంజకాలు. ఈ మూడు పేర్లూ వ్యావహారికార్థం ఉన్నవి కావు. అవి ఆ వస్తుశక్తిత్రయానికి కేవలం లక్ష్యకాలైన సంకేతాలు మాత్రమే. సృజన ప్రక్రియలో వస్తు చైతన్యం పొందే తరుగుదల ఏమీలేదు. చైతన్యంలో బృహత్ చైతన్యం : చిత్త ద్వైవిధం ఏకముఖం మాత్రమే. అది ప్రతిక్రియాముఖ మాత్రం కాదు. యాంత్రిక సూత్రాను విషయమూ కాదు. చిత్తం బృహచ్చైతన్య సహాయాన్ని స్వీయప్రకాశం కోసం అపేక్షిస్తుంది తప్ప బృహత్ చైతన్యం స్వస్పంద సుందరం—స్వతంత్రం, సంపూర్ణం. దానికి సహకారంఅక్కరలేదు. సృజనబృహచ్చైతన్య వ్యాపారాల్లో ఒకటి.

ప్లాటినస్ అభిప్రాయం—సమకాలీన విజ్ఞానుల నిరూపణను ఆధారంగా కల్గిందే. సూర్యుడు ప్రపంచానికి ఇంతకాంతిని ఇస్తున్నా తాను నష్టపోతున్నది ఏమీ లేదని—శాస్త్ర నిరూపణ. ద్రవ్యజగత్తు సూర్యుణ్ణి ఏ విధంగానూ ప్రభావితం చెయ్యడం లేదు. ప్రకాశించడం సూర్యుని స్వభావం. ఈ ద్రవ్యజగత్తంతా ఒక సృజనాత్మక విశ్వశక్తికి వ్యక్తీకృతే తప్పా—ఇదే అది కాదు. ప్రతిబింబనంలో సమగ్రతా సమగ్రతల ప్రసక్తి లేదు. ఆభాస దృష్ట్యా సంపూర్ణ వస్తుపృథకీకరణమే — వాస్తవీకరణమే ఈ ద్రవ్యాశ్రిత జగత్తు. అంచేత సత్యవస్తువు స్థూలీకరణం పొందగా పొందగా మలావృత మౌతుంది (శైవాగమంలో ఈ'మల' త్రితయ చర్చ ఉంది. అక్కడ చదువుకోవచ్చు.)

కడపట గుర్తించదగింది ప్లాటినస్ త్రిక భావన : దివ్య—మానవ తత్త్వపరిధుల్లో మూడుదశల్ని ఆయన గుర్తించాడు :

1. దేహేంద్రియ అనుభుక్త జగద్విషయం : భౌతికానుభవం : అనుదాత్తం. 2. చిత్తాను భుక్తమైన జగద్దేశకాలవిషయం: అనుమతానుభవం: మధ్యమం. 3. చైత్యాను భుక్తమైన ఆధ్యాత్మిక జగదనుభవం–స్ఫురణానుభవం : ఉదాత్తం.

ఆనందవర్ధనుడి వ్యంజన వ్యాపార ప్రత్యేకతను గుర్తిస్తూ లోచనం వక్తృ శ్రోతృప్రతిభా సముత్థిత వాగ్ వ్యాపారంగా గుర్తిస్తూ 'అనుమితి' వాద ఖండనం చేస్తూ 'స్వప్రతిభానానుమీయమానా ; అపితు తదా వేశేన భాసమానేత్యర్థః' అన్వయించటంలో సామంజస్యం ఇదే. అందుకే తత్త్వాలోక; తంత్రాలోక గ్రంథాలు ఆనందాభినవులు రాయాల్సివచ్చింది.

ఈ విశాలజగత్తులో ప్రాచ్యమూలేదు. పాశ్చాత్యమూలేదు. మనం దేశకాల పరిధులకు లోబడ్డ పరిజ్ఞానంతో చేస్తున్న విభజన ఇది. ఇటీవల కృష్ణప్రేమ్ ప్రతిపాదించినట్టు (కఠోపనిషత్ వ్యాఖ్యానంలో) ప్రాచ్య పాశ్చాత్య భేదం మనోఽవస్థా భేదమని గుర్తించడం సముచితమని పండితులు గుర్తిస్తున్నారు : (చూ. వ్యంజన సూత్రం పీఠిక — తుమ్మపూడి కోటేశ్వరావుగారిది) : ఈ రచయితకీ ఈ దృష్టివుంది.

అంటే అర్థం ఇది. వస్తువు—భావం : వీటి మధ్య నున్న సంబంధం ఏమిటన్న ప్రశ్నకు సమాధానంగా భావ ప్రతిభాసమే వస్తువనడం ప్రాచ్యం. తద్వ్యతిరేకం పాశ్చాత్యం. అంచేత ఇండియాలోనూ ప్రాశ్చాత్యులున్నారు. వెస్టులోనూ ప్రాచ్యులున్నారు. లెనిన్ 'థియరీ ఆఫ్ రిఫ్లెక్షన్'లో ఈ భిన్నవాదాలకు వైజ్ఞానిక సమన్వయం -గతితార్కిక దృష్ట్యా సాధించబడ్డట్టు తెలుస్తోంది. అది భవిష్యత్తులో పరిశీలనీయం. ప్లాటినస్‌ని ఈ కారణంగా అనివార్యంగా గుర్తించాలి.

**పఠనీయ వాఙ్మయం**


క్రోషె బెనడెట్టో - 'ఈస్థటిక్' లండన్. (1922).

గిల్‌బర్ట్ & కూన్-'ఏ హిస్టరీ ఆఫ్ ఈస్థటిక్స్'న్యూయార్క్-(1939)

ఫుల్లర్ - 'ఏ హిస్టరీ ఆఫ్ ఫిలాసఫీ' న్యూయార్క్ - (1938)

ఇంగె డబ్ల్యు. ఆర్.-'ది ఫిలాసఫీ ఆఫ్ ప్లాటినస్'లాంగ్‌మన్స్(1923)

పాండె. కె. సి. - 'కంపేరిటివ్ ఈస్థటిక్స్' చౌఖాంబా (1959)

,, 'అభినవగుప్త' చౌఖాంబా (1963)

,, 'వెస్టర్న్ ఈస్థటిక్స్' (1972)

వింసట్. డబ్ల్యు. కె. & క్లెన్త్ బ్రూక్స్ } 'లిటరరీక్రిటిసిజం - ఎ షార్ట్ హిస్టరీ' (1957) ఐ. బి. హెచ్. ప్రతి (1974)


**అధోజ్ఞాపికలు**

1. నోలి పండితుడు తన గ్రంథంలో ప్లాటినస్‌ని గురించి చర్చించకపోవడం దీనికంతా కారణం. కె. సి. పాండేగారే (1972) మొదటిసారిగా ప్లాటినస్‌లోని మిస్టిక్ తత్త్వాన్ని ప్రత్యేకంగా రస దృష్ట్యా అధ్యయనంచేశారు. అభినవగుప్త (1963) అనే గ్రంథంలో కూడా 'ఆభాస'వాదాన్నిగురించి చెబుతూ ప్లాటినస్ ప్రసక్తితెచ్చారు.

2. అందుకే కావచ్చు కృష్ణచైతన్య (1965) ధ్వని సిద్ధాంతాన్ని గురించిన అధ్యాయంలో కేవలం ఫ్రెంచి కళావాదుల్ని; రస దృష్టి కలిగిన వారినీ మాత్రమే ఉదాహరించుకున్నాడు (మలార్మే, పాల్‌వెలెరీ, బాదిలేర్, క్రోచె, ప్రెస్‌కాట్, ప్రభృతుల్ని), వీరి నేపథ్యంలో ప్లాటో ఒకవైపు, ప్లాటినస్ మరోవైపు ఉన్నారని లోతుకి వెళ్తేకాని తేలదు.

3. దీన్నే ఆభాసవాదమని-వివర్త వాదంకన్నా ఈదృష్టిలోనే ఇది భిన్నమని పండితులు గుర్తించారు. వివరాలకు చూ. బ్రహ్మానంద 'వ్యంజన సూత్రం' అ. 2. (1981) అభివ్యక్తి, అసంలక్ష్య క్రమవ్యంగ్యం, వర్ణ వ్యంజకత-రసస్ఫురణ-భావం గమ్యమానం కావడం-ఇలాంటి పరిభాషకు సార్థకత ఈ సూత్రంలోనే.



# రాలిన నక్షత్రాలు

శ్రీ కె. దినకర్

మార్ఫియా మత్తులాంటి మసక వెన్నెలరాత్రి
మంచు దుప్పటిని కప్పుకొని పడుకుంది ధాత్రి
అంతరంగ విపంచిపై
ఆలోచనా తంత్రులను మీటుకుంటూ
ఆరుబయట కూర్చున్నా నేకాంతంగా
ఆకాశం వైపు చూస్తూ

అప్పుడు
అంతరిక్ష వృక్షం గలక్సీశాఖ నుంచి రాలినవి
రెండు విచిత్ర పుష్పాలు : వినీల నక్షత్రాలు

ఇప్పుడు
నాలో జ్వాలలను రగిలించే నీ విశాల నేత్రాలు.

------

# బేహారి

'ఉపాధ్యాయ'

కలల బేహారు లొస్తున్నారు
కాస్త చోటివ్వండి బాబూ!
మొయ్యలేని మూటలెన్నో
ఊరవతల దాచిపెట్టి
ఉదయం దాకా ఆగలేక
నిద్రలో నడిచొస్తున్నారు.
అడ్డం పడకండి నాయనా!
అభాసు చెయ్యకండి.

వెలుగూ చీకటీ కానివేళ
వేలం పాట పాడతారట
అందాలు తొడుక్కుని రండబ్బాయిలూ!
ఆనందాలు కొనుక్కుందురు గాని.
దేశం కాలం ఉచ్ఛం నీచం
గావుకేకలు గాండ్రింపుల్లాంటి
అబద్ధపు సరుకు అమ్మడంలేదసలు
అన్నీ అచ్చమైనకలలు
అనుకున్నప్పుడల్లా దొరికేవి కావు
కోరి మీముందు కొచ్చాయి
కొనకపోతే కరిగిపోతాయి.

ముట్టుబోకండి తమ్ముళ్ళూ
మూట విప్పబోకండి.
రెప్పల కప్పులు తీస్తే
తాజాకలలు తొణికిపోతాయి.
చెప్పాచెయ్యక చేరిన కలలు
చెదిరితే చెరిగిపోతాయి.
లోకాలు దాటించి తరలించుకొచ్చాం
మాకూలి డబ్బులు కిట్టనీయండి
అసలూ నకిలీ తేల్చుకోవాలంటే
అద్దంలోంచి అవతలికి చూడండి
రంగూ రూపం రుచీ వాసనా
పంచేంద్రియాలకు పట్టకపోతే
మాయాలాంతరు వెలుగుల్లో
మరోసారి నాడెం చూడండి బాబూ!
కళ్ళుమూసి కొనదగ్గ సరుకు!
కడదాకా వాడుకోదగ్గ సరుకు!

# తెలుగు అకాడెమీ ప్రచురణలు

1. "ఉగ్రవాదులు"—ఎన్. ఇన్నయ్య, 2. "సమాజాభివృద్ధి-పంచాయితీ రాజ్యము"—వై. బి. అబ్బరాయులు, 3. "జాతీయాదాయము— సాంఖిక పరిగణన"— వి. తిరుపతినాయుడు, 4. "స్త్రీ శిశుసంక్షేమ కార్యక్రమములు"—కె. వెంకటేశ్వరావు.

తెలుగును బోధనా భాషగా స్వీకరించిన తర్వాత, కళాశాల స్థాయిలో పాఠ్య గ్రంథాలను వెలువరించడానికి తెలుగు అకాడెమీ పలువిధాలా కృషి చేస్తున్నది. ఫలితంగా ఆంగ్లంలోని అనేక ప్రముఖ గ్రంథాలకు అనువాదాలు, ఆయారంగాలలో నిష్ణాతులైన వారి స్వతంత్ర రచనలు మనకు లభిస్తున్నాయి. మొదటి దశలో చేపట్టిన గ్రంథాల ప్రచురణ కార్యక్రమం తరువాత రెండవ దశలో అనువాదాలు, 'మోనోగ్రాఫు'లు అందించడానికి తలపెట్టింది.

* * *

1. యూరపు, లాటిన్ అమెరికన్ దేశాలలో ప్రభుత్వం వ్యవహరించే తీరుపట్ల, సామాజిక దురన్యాయాలకు పీఠం వేస్తున్న సంస్థలు, వ్యక్తులపట్ల యువతరానికి కలిగిన విద్వేషభావం రగుల్కొల్పిన ఆందోళనలు, ఉద్యమాలనుచిత్రించడానికి శ్రీ ఇన్నయ్య ఒక చిన్న ప్రయత్నం చేశారు. ఇవి కేవలం అన్యాయంపట్ల అసహనంతో చెలరేగినవికావు. సమాజ పరిణామాన్ని గురించి కొంత ఆలోచన, తాము కావాలనుకునే వ్యవస్థా స్వరూపాన్ని గురించి ఒక సైద్ధాంతిక వివరణ, దాని స్థాపన కోసం అవసరం అయిన వ్యూహరచన—వీటన్నింటి ఆధారంతో కృతనిశ్చయులైన వ్యక్తులను, ముఖ్యంగా యువతరంలోని వారిని, సమీకరించి విప్లవాత్మక ఉద్యమాలు నడిపిన వారు అనేకులు. ఫ్రాంజ్‌ఫానన్, జీన్‌పాల్ సార్త్రే, హెర్బర్ట్ మార్క్యూస్, షేగవేరా, రేగిస్‌డెబ్రే, స్టోక్లీ కార్మైకేల్ వంటివారు అణ్వస్త్రనిషేధం- వలసవాదనిర్మూలన జాతి విచక్షణావ్యతిరేకత, ఆర్థిక అసమానతా నిర్మూలన, ఆధునిక సమాజంలో వ్యక్తిస్వేచ్ఛ అనే లక్ష్యాలకోసం విద్యార్థులను యువకులను తమ ఆలోచనలతో ప్రభావితం చేసి కార్యోన్ముఖులను చేశారు. నిరసన ప్రదర్శనలు, భవనాలు సంస్థల ఆక్రమణ, పోలీసులు సైనికుల మీద సాయుధ తిరుగుబాట్లు ఇతర మార్గాలలో యీ ఉద్యమాలు జరిగాయి. ప్రపంచ వ్యాప్తంగా ప్రాచుర్యం పొందాయి. అయితే శాశ్వత ప్రాతిపదిక మీద ఎంతవరకు సఫలమయ్యాయో చెప్పడం కష్టం.

లాటిన్ అమెరికన్ దేశాలు ఖనిజాలమీద ఆధారపడిన ఆర్థిక వ్యవస్థలు. బ్రెజిల్‌వంటి కొన్ని విశాలమైన వ్యావసాయిక వ్యవస్థలు విదేశ ఆర్థిక సంబంధాల మీద ఆధారపడినవి. విదేశీయ పెట్టుబడులు, ఆర్థిక సాంకేతిక శక్తులతోబాటు రాజకీయ ప్రభావం కూడా బలంగా వుండటంతో అసమానతలు పెరిగి అసంతృప్తి పెచ్చరిల్లింది. కొండకోనలలో స్థావరాలేర్పరచుకుని గెరిల్లా పుద్యమాలు, రైతుల తిరుగుబాటు జరిగాయి. కొన్నిచోట్ల ప్రజా ప్రభుత్వాలేర్పడ్డాయి. మరికొన్నిచోట్ల సైనిక నియంతృత్వాలే పడుతూ లేస్తూ మారుతూ వచ్చాయి. రాజకీయ పక్షాలలో అంటే పెద్ద ఉద్యమాలకువ్యతిరేకంగా 'ప్రజాస్వామ్యం'లో వ్యవహరించే పక్షాలలో క్రిస్టియన్ డెమోక్రాట్లు చాలా దేశాలలో బలంగా వున్నారు. ఒక్క క్యూబా కమ్యూనిస్టు రాజ్యంగా రూపొందింది. అయితే కొన్ని సంవత్సరాలుగా పశ్చిమ లాటిన్ అమెరికన్ రాజ్యాలలో జోక్యం చేసుకోకుండా (ప్రతిగా అమెరికా తూర్పు యూరపు వ్యవహారాలలో చెయ్యి పెట్టకుండా) నడిచింది. చాలా దేశాలలో హింసాయుత ఆందోళనలు విదేశ రాయబారులమీద దాడులు యిలాంటివి అణిగిపోయాయి ధరల పెరుగుదలవల్ల ఏర్పడే అసంతృప్తి తొలగించడానికి ప్రభుత్వాలు ఆయా ద్రవ్యవిధానాలలో కొన్ని ఏర్పాట్లు చేశాయి.

ఫ్రాన్సు జపాను దేశాలలో విద్యా వ్యవస్థమీద తీవ్రమైన అసంతృప్తి కలిగింది. 1958, 59 ప్రాంతాలలో, కొన్నిచోట్ల కార్మికులు కూడా విద్యార్థులతో చెయ్యి కలిపారు. సార్‌బోన్, వాసెడా విశ్వవిద్యాలయాలలో జరిగిన అలజడులు చాలామందికి గుర్తుండి వుంటాయి. అమెరికాలో రక్షణ ఒడంబడికలకు వ్యతిరేకంగానూ, ఇరాన్ వంటి దేశాలలోని నియతృంత్వాలకు వ్యతిరేకంగానూ. యుద్ధ ప్రేరక ఆయుధాల వుత్పత్తికి వ్యతిరేకంగానూ మరికొన్నిచోట్ల ప్రజలు ముందుకువచ్చారు. జాతి భేదం లేకుండా సమాన హక్కులు కావాలంటూ అమెరికాలో అనేక సంవత్సరాల నుంచీ శాంతియుతంగానూ హింసాయుతంగానూ ఆందోళనలు జరుగుతున్నాయి.

ఇన్నయ్యగారు ఉద్యమాల చరిత్రను, వాటికి నాయకత్వం వహించిన వ్యక్తుల సిద్ధాంతాలను స్థూలంగా పరామర్శించారు. అయితే ఉద్యమాలకు ఆలవాలమయినదేశాల ఆర్థికసాంఘికవ్యవస్థలను కొంత ప్రదర్శించి వుంటేతృప్తిగా వుండేది తరువాత, ఆయా

మేధావుల సిద్ధాంతాలు ఆలోచనలకన్న ఆందోళనా వ్యూహాలను వివరంగా రచించారు. ముందు నాయకులు, వారి సిద్ధాంతాలు తరువాత ఉద్యమాల చరిత్రలను గురించి రచించి వుంటే బాగుండేది అనడం కేవలం అభిప్రాయభేదం కాకపోవచ్చు. ఆయా అంశాలకిచ్చిన ప్రాముఖ్యం వాటిమీద కలిగే అసక్తినిబట్టి ఆ విధంగా అనుకోవలసి వస్తుంది. ఇండియాలో వ్యవసాయ సంస్కరణల కోసం జరిగిన నక్సలైటు ఉద్యమాలను గురించి (దానిని గురించి చెప్పబోతున్నట్లు మనకుచివరివరకూ తెలియదు)కూడా చర్చించారు. మధ్య ప్రాచ్యంలో జరుగుతున్న హింసాయుత ఆందోళన కారులను గురించి, సిలన్‌లో జరిగిన తిరుగుబాటు, టర్కీలో కొన్ని సంవత్సరాల కిందట విద్యార్థుల ఉద్యమం గురించి కొద్దిగా చేర్చివుంటే సమగ్రంగా వుండేది.

ఈ పుస్తకంలో పేర్కొన్న ఉద్యమాలలో ఎక్కువభాగం 1960-70 దశాబ్దంలో జరిగినవి. ఆఫ్రికా ఖండంలో దేశాలు స్వాతంత్ర్యం పొందుతున్న తరుణం.అది. 1970 తర్వాత చాలా భాగం అణిగిపోయాయి. లేదా మరొక విధమైన పరిష్కారం లభించింది. జిజ్ఞాసువులకు పని కల్పించే వస్తువు. రాజనీతి శాస్త్రం. వర్తమాన రాజకీయాలు, సామాజిక సిద్ధాంతాలను పఠించే విద్యార్థులకు వుపయోగకారి. అమెరికాలో బ్లాక్‌పాంథర్ పార్టీని గురించి చర్చ ఒక మూడు పేజీల మాటరు సుమారు యథాతథంగా రెండు చోట్ల అచ్చు కాకుండా వుంటే రచన మరింత శ్లాఘనీయ ప్రయత్నం అయ్యేది.

* * *

2. ఆర్థిక వ్యవస్థ ప్రగతికి ఒక సూచిక జాతీయాదాయం. ఉత్పాదక సాధనాల సమైక్య కృషి ఫలానికి ఒక కొలమానం. ప్రజా సంక్షేమానికి ఒక ప్రతిఫలనం. వస్తు వైవిధ్యం వలన ధనరూపంలో విలువ లెక్కగడుతుంటాం. అందుచేత వస్తువుల పరిమాణాలు ధరల వివరాలు అవసరం అవుతాయి.

ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా తలసరిసగటు జాతీయాదాయాన్ని వృద్ధి చెయ్యడం ముఖ్యలక్ష్యంగా వుంటున్నది. ఆదాయం యొక్క ఆవిర్భావము లేక ఉత్పాదన వ్యక్తులమధ్య, వ్యవసాయ పారిశ్రామికాది రంగాలలో, ప్రభుత్వ, గృహ క్షేత్రాలలో ఆదాయం యొక్క విభజన, ప్రభుత్వరంగపు ఆదాయవ్యయ వ్యవహారాలు, ప్రైవేటు కార్పొరేటు రంగపు ద్రవ్యసాధన సంపత్తి, వినియయం పొదుపు పెట్టుబడికి సంబంధించిన సమస్యలు ఇవన్నీ జాతీయాదాయానికి సంబంధించిన అంశాలే. అందుచేత జాతీయాదాయాన్ని గురించి పరిజ్ఞానం సమాజంలో విద్యావంతుడైన ప్రతివ్యక్తికీ కొద్దిగానో గొప్పగానో అవసరం అవుతుంటుంది. అందుచేత పలురీతులుగా అధ్యయనం చెయ్యవచ్చు. శ్రీ తిరుపతి నాయుడుగారు ఎన్నుకున్న విధానం ఉన్నతస్థాయిలో అర్థిక శాస్త్రం అధ్యయనం చేసే విద్యార్థులకు అనువుగానే వున్నది. అయితే జాతీయాదాయం యొక్క నిర్వచనము, కొలతలకు సంబంధించిన మొదటి భాగం లోప భూయిష్టంగా వున్నది. అసమగ్రంగా వున్నదన్నికూడా చెప్పాలి.

అసలు, జాతీయాదాయాన్ని ధనరూపంలో ఎందుకు లెక్కించాలి ? ఈ విషయం చర్చించవలసినది. తరువాత వర్తమాన ధరలు స్థిరమైన ధరలతో అంచనాలు ; విపణిధరలు ఉత్పాదకఖర్చులతో అంచనాలు, ఆంతరిక లేక దేశీయ జాతీయ అంచనాలు, స్థూల నికరమైన అంచనాలు వివరించాలి. తరువాత ఆదాయ విభజన సమస్యలు, తరువాత అంతర్జాతీయ తులనాత్మక పరిశీలన, వివరణ అనుషంగిక సమస్యలుగా ప్రణాళికలు, పన్నుల విధానం ఉత్పాదన చర్చించి వుండవలసింది. విషయక్రమం మార్చవలసి వున్నది. ఇవి రలో చరిత్రలోని భారతదేశపు జాతీయ వర్తమానగణాంక వివరాలను ఆయా సమస్యలను చర్చిస్తున్నప్పుడు చేర్చి వుంటే బాగుండేది. లేదా, ముందు నిర్దిష్టంగా శాస్త్రీయ వివేచన చేసి తరువాత చేపట్టవలసినది. డిప్రిషియేషన్ గురించి సరైన సూచనలేదు. 1961లో ప్రచురితమైన ఆదాయ విభజన పరిశీలనా సంఘం గురించిన పరామర్శ చెయ్యలేదు. ఒక్కొక్క సంవత్సరానికి స్వాతంత్ర్య పూర్వం పలువురు ఆర్థిక శాస్త్రవేత్తలు యిచ్చిన అంచనాల పట్టికలు సమగ్రంగా యిచ్చారు గానీ 1900 నుంచీ 1947 వరకూ జాతీయాదాయం అంచనా చేసిన శివసుబ్రహ్మణ్యం, ముఖర్జీల కృతులను గురించి వివరించలేదు. తరువాత, సాంఖిక పరిగణన పద్ధతులను వివరించినప్పుడు 1948—49 సంవత్సరం గాక యిటీవల భారతదేశపు పద్దులను, వినియయం పొదుపుకు చెందిన వివరాలను యిస్తే బాగుండేది.

"మోనోగ్రాపు" యొక్క పరిధిలో యివన్నీ చర్చించడం సాధ్యంకాదని ఎవరైనా అనుకోవచ్చు. అలాగే అనుకుందాం. కానీ విషయ క్రమం తార్కికంగానూ, వివరణ నిర్దుష్టంగానూ వుండాలి. కొంత అనువాదం అనిపిస్తుంటే పాఠకుల లోపంకాదు. తరువాతి ప్రచురణలో నైనా సరి చేయవలసిన అవసరం వున్నదని మనవి.

3. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రణాళికా లక్ష్యాలు నెరవేరాలంటే ప్రజల భాగస్వామ్యం అనివార్యం. అందుకు తగిన సంస్థలు, సంప్రదాయాలు, శాసనాలు వుండాలి. పంచాయితీ రాజ్యవ్యవస్థ అటు రాజకీయంగా అధికార వికేంద్రీకరణకూ యిటు సత్వర ఆర్థిక వృద్ధికీ తోడ్పడాలనే తలపుతో నెలకొల్పబడినది. ఈ వ్యవస్థ కొక పురాతన చరిత్ర వున్నది. శతాబ్దాలనుంచీ పరిపాలకులు, రాజనీతి వేత్తలు గ్రామీణ స్వయం పరిపాలనా వ్యవస్థ పట్ల అనక్తి ప్రదర్శించినట్లు అనేక ఆధారాలు తెలుపుతున్నాయి. "సమాజాభివృద్ధి పంచాయితీ రాజ్యము" అనే మోనోగ్రాపు సమాజాభివృద్ధి కార్యక్రమాలు, పాలనావ్యవస్థ, పంచాయితీ రాజ్యము మొదలైన విషయాలను గురించి వివరాలు పొందుపరిచింది.

మొదటి ప్రకరణంలో చర్చించిన సమాజాభివృద్ధి పథకాల పూర్తివివరాలు యిచ్చి ఉంటే బాగుండేది. ఉదాహరణ మార్తాండం ప్రాజెక్టు ఎక్కడ ఉన్నది అనేది నాకు తెలియలేదు. అలాగే యితరులకు గుర్‌గావ్ ఎక్కడ సేవాగ్రామ్ ఎక్కడ తెలియక పోవచ్చు. విదేశాలలో, ముఖ్యంగా కొన్ని ఆఫ్రికన్ దేశాలలో యీ పద్ధతి ఎలా పని చేస్తున్నదో తెలుసుకోవాలనే కుతూహలం కొంత మంది విద్యార్థులకు కలగవచ్చు. పంచాయితీ రాజ్యవ్యవస్థ అమలు జరుగుతున్న తీరును గురించి సాకల్యముగా చర్చించి వుంటే బాగుండేది. చివరలో వున్న సింహావలోకనము కొంత చదువ తగ్గదే అయినా స్థూలంగా పరామర్శించడం జరిగింది. పంచాయితీలను గురించి అనేక అధ్యయనాలు జరిగాయి. కొన్ని "ప్రసారిత" యింకా యితర పత్రికలలో తెలుగులోనే ప్రచురితమయ్యాయి. వాటిలో కొన్ని సారాంశాలను పొందుపరిస్తే తృప్తికరంగా వుండేది. శైలి బాగున్నది. వాక్యాలు లోటు పాట్లు లేకుండా నిలకడగా నడిచాయి. సామాజిక ప్రగతి పథకాలు, పంచాయితీ వ్యవస్థను గురించి సిద్ధాంతరీత్యా తెలుసుకోడానికి చదవదగిన పుస్తకం.

* * *

4. వర్తమాన కాలంలో ఎదుగుతున్న దేశాలలో శిశువుల సంఖ్య జనాభాలో అధికశాతం వున్నది. సగటున కొంచెం అటూ యిటుగా ప్రతిదేశపు జనాభాలోనూ సగంమంది స్త్రీలు వున్నారు. శిశువులనూ స్త్రీలనూ కలుపుకున్నటే మిగిలిన వారి శాతం చాలా కొద్ది. అయితే ఆర్థిక స్వాతంత్ర్యం దృష్ట్యా, భవిష్యంలో నిర్వహించవలసిన బాధ్యతల దృష్ట్యా, కొన్ని ప్రత్యేక బలహీనతల వలన వీరి సంక్షేమాన్ని ఒక సమస్యగా చేపట్టి కార్యక్రమాలు రూపొందించబడు తున్నాయి. ఇందుకోసం రాజ్యాంగ పరంగానూ, పార్లమెంటు శాసన సభల చట్టాల ద్వారా, ప్రణాళికా కార్యక్రమాల ద్వారా మరొక వైపు అంతర్జాతీయ సంస్థలద్వారా ప్రయత్నాలు జరుగుతున్నాయి.

స్త్రీ శిశువుల ప్రత్యేక సమస్యలను గురించి వారి సంక్షేమం కోసం అమలు జరుగుతున్న కార్యక్రమాలను గురించి వ్రాయబడిన యీ మోనోగ్రాఫు విషయంలోనూ, భాషలోనూ చదువ దగినదిగా వున్నది. జనాభా లెక్కలనుంచీ, వివిధ సమస్యలకు సంబంధించిన పరిశీలనా నివేదికలనుంచీ కొన్ని గణాంక వివరాలను స్థూలంగా జోడించి వుంటే బాగుండేది. తరువాత స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వ సంస్థలు పనిచేస్తున్న తీరులోని లోటుపాట్లు అవశ్యకతలను గురించి ఒకటో అరో పేజీల చరిత్ర వుంటే కొన్ని యితర గ్రంథాలు చూడవలసిన అవసరం వుండేది కాదు. రచయిత పరిజ్ఞానం, పరిణతి, లక్ష్యశుద్ధి ప్రతి పాఠకుడికీ తప్పకుండా గోచరమవుతాయి.

* * *

## అకాడెమీ పాఠ్యగ్రంథాలు

1. ఆధునిక పాశ్చాత్య రాజనీతి తత్వ విచారము—శ్రీ ఎమ్. వి. సుబ్బారావు.

2. ఉద్యోగితా సిద్ధాంతం (అనువాదం)— మూలం: జోని రాబిన్‌సన్, అనువాదం శ్రీమతి చావలి మణి శాస్త్రి:

3. కేంద్ర బ్యాంకింగ్ (అనువాదం)—మూలం: ఎమ్. హెచ్. డికాక్, అనువాదం శ్రీ అన్నాప్రగడ లక్ష్మీనారాయణ

ఇంటర్మీడియేట్, డిగ్రీస్థాయిలలో పాఠ్యగ్రంథాలను తెలుగు మాధ్యమంలో సమకూర్చే ప్రయత్నంలో తెలుగు అకాడెమీ అనేక గ్రంథాలను ప్రయాసతో వెలువరించింది. కొన్ని ప్రామాణిక గ్రంథాలను అంగ్లం నుంచీ అనువాదం చేయించింది. కొన్ని తెలుగులోనే స్వతహాగా రచింపబడిన వాటిని ప్రచురించింది.

తెనుగు భాషా సమితి నిర్వహించిన విజ్ఞాన సర్వస్వ ప్రచురణ కార్యక్రమం కొంత పారిభాషిక పదావళిని రూపొందించింది. కూలంకషంగా పరిశీలించి ప్రామాణికం చేసి రాష్ట్రంలో విద్యాబోధనకు ఉపయుక్తం అయ్యేందుకు అకాడెమీ ప్రయత్నం చేస్తున్నది. ఇటువంటి ప్రయత్నాలు యింకా కొనసాగవలసి ఉన్నది.

ఆంగ్లంలో సంచితమైన విజ్ఞానం అనువాదంలో గానీ యితరత్రా లభించాలంటే కొంతసమయ యాపన జరుగుతుంది. రెండు భాషలలోనూ నిష్ణాతులైన వారు, బోధనానుభవం గల వ్యక్తులు కావాలి. అయితే అటువంటి వ్యక్తులు కొన్ని సంవత్సరాల తర్వాత అరుదుగావచ్చు. కేవలం పాశ్చాత్య భాషలలో ఆవిష్కరింపబడిన విజ్ఞానాన్నే అధ్యయనం చెయ్యాలన్న నిర్బంధం లేదు. కానీ సామాజిక శాస్త్రాలలో ఎప్పుడో భిన్నాభిప్రాయాలను సిద్ధాంతాలను సమీకరించిన భాషలవి, ముఖ్యంగా ఆంగ్లం. అయితే తెలుగులో ఆలోచించే అలవాటు, శక్తి గలవారు అనువాదం చేసినా, స్వతంత్ర రచనలు చేసినా సుబోధకంగానే వుంటాయి. పఠనీయంగానూ వుంటాయి.

తనకున్న పరిమితులలో అకాడెమీ యీ కార్యక్రమాన్ని జయప్రదంగానే కొనసాగిస్తున్నది. అయితే అనువాదాల కన్న ఆయా అంశాలలో స్వతంత్ర రచనలు పాఠ్యప్రణాళికను దృష్టిలో వుంచుకుని రచయితలకు బాధ్యత అప్పగిస్తే బాగుండేది. చదువవలసిన వాఙ్మయం అంతా ఒకటో రెండో పుస్తకాలలో లభిస్తే విద్యార్థులకు సదుపాయంగా వుంటుంది. ఉదాహరణకు కేంద్ర బ్యాంకింగ్ అనే పుస్తకంలోనే భారతీయ వ్యవస్థను అది పనిచేస్తున్న తీరును గూడా జోడించవచ్చు. అంటే కనీసం ప్రథమ డిగ్రీ స్థాయి వరకూ పాఠ్యగ్రంథాలు పాఠ్యప్రణాళికను గురించి సమగ్రంగా వుంటే బాగుంటుంది.

* * *

1. ఆధునిక పాశ్చాత్య రాజనీతి తత్వవిచారము అనే పుస్తకం ఎమ్. ఎ. స్థాయిలో రాజనీతి శాస్త్ర విద్యార్థులకోసం వ్రాయబడినది. హ్యూగో గ్రోషియస్ మొదలుకొని హాబ్స్, లాక్, రూసో, బర్క్, హెగెల్, మార్క్స్, లాస్కీ, గాంధీ, రస్సెల్, ఓక్‌షాట్ వరకూ పాతికమంది ప్రముఖుల సిద్ధాంతాలను, కొద్దిగా జీవిత విశేషాలను వివరిస్తుంది. పదహారవ శతాబ్ది చివరిభాగం నుంచీ యిటీవలి వరకూ పైన పేర్కొన్న తాత్వికుల సిద్ధాంతాలను ఒక్కొక్క ప్రకరణంలో చర్చించారు.

కాలక్రమ విశ్లేషణ కొంతవరకూ తార్కిక పరిణామాన్ని ప్రదర్శిస్తుంది. మరొకప్పుడు స్వతంత్ర లేక నిరపేక్షకమైన భావాల సముదాయాన్ని కూడా చూపిస్తుంది. ఒకే అంశంమీద కాలక్రమాన వెలువడిన సిద్ధాంతాలు విద్యార్థులకు తార్కిక క్రమాన్ని తెలియబరుస్తాయి. అవే వివిధ అంశాలమీదనైతే విచారధార అని చెప్పకుండా కొన్ని భావాలు అని మాత్రమే చెప్పవలసి వుంటుంది.

రచయితల వారీగా వ్రాసిన పుస్తకాలలో కొన్ని యిబ్బందులు వస్తాయి. రాజనైతిక వస్తువులు, సమస్యల కింద విషయాన్ని క్రోడీకరిస్తే భావ పరిణామం విస్పష్టమవుతుందని మరొకసారి చెప్పవచ్చేమో! అయితే రాజనీతి శాస్త్రజ్ఞులను గురించి కానీ వారి సిద్ధాంతాలను గురించిగానీ పాఠ్య ప్రణాళికలో అంశంగా చేర్చి వుంటే రచయిత అనుసరించిన పంథా అత్యంత శ్లాఘనీయమైనది. (ఈ విషయంలో నేను అజ్ఞుడను. పాఠ్య ప్రణాళిక నేను చూడలేదు).

ఏమయినా ఆయా వ్యక్తుల మూల సిద్ధాంతాలను సరళము సహజము అయిన భాషలో స్పష్టంగా ప్రతిపాదించిన విషయం గమనార్హం. అయితే గాంధీ, మావోసేటుంగ్ వంటి వారి భావనలు పాశ్చాత్య రాజనీతి తత్వం కింద జోడించడం సబబు కాకపోవచ్చు. ఒకవేళ, 'రాజ్యము' 'సార్వభౌమత్వము', 'న్యాయము', చట్టము' అనేవి పాశ్చాత్య ప్రాదుర్భావ విశేషములుగా స్వీకరిస్తే నెహ్రూ, ఎమ్. ఎన్. రాయ్‌లను వదలివేయడం సమంజసంగాలేదు. అదే విధంగా క్రోపాట్కిన్, బాకునిన్‌ల సిద్ధాంతాలను కూడా కొంత స్పృశిస్తే సమగ్రంగా వుండేది.

ముఖ్యంగా, రెండవ ప్రపంచయుద్ధానంతరం యూరపు ఖండం పునర్విభజన, తూర్పు యూరపులో మార్క్సిస్టు సిద్ధాంత బద్ధమైన ప్రభుత్వాలు ఏర్పడటం—ఆ పిదప ప్రపంచంలోని అసంఖ్యాక ప్రజానీకం వలసపాలన నుంచీ విముక్తి కావడంతో ఒక నూతన పరిస్థితి నెలకొన్నది. రాజ్యాన్ని గురించిన సిద్ధాంతాలు గానీ, నిర్వహించే తీరులోగానీ అనేక మార్పులు వచ్చాయి. కొద్ది మార్పులు చేర్పులతో 'ప్రణాళిక వ్యవస్థ' అనే దానిని ఆర్థిక ప్రగతికి మార్గంగా ప్రతి దేశంలోనూ అనుసరిస్తున్నారు. తటస్థ విధానం అంతర్జాతీయ వ్యవహారాలలో ప్రముఖ పాత్ర వహిస్తున్నది. ఐక్య రాజ్యసమితి యొక్క పాత్ర నిర్మాణాలను గురించి చెప్పుకోదగిన అభిప్రాయాలున్నాయి. ఇవన్నీ పరామర్శించడానికి నెహ్రూను జోడిస్తే సరిపోయ్యేది.

* * *

శ్రీమతి జోన్ రాబిన్‌సన్ యొక్క గ్రంథం అనేక సంవత్సరాలుగా ఆంగ్ల దేశపుకళాశాలలలోనూ ఆంగ్లమాధ్యమంలో విద్య నభ్యసించే దేశాలలోనూ ప్రాథమిక పాఠ్య గ్రంథంగా వుంటూ వచ్చింది. పెట్టుబడిదారీ వ్యవస్థగల దేశాలలో తరచుగా ఆర్థిక మాంద్యం ఏర్పడటం తన్మూలముగా ఉద్యోగావకాశాలకు కొరత ఏర్పడడమేగాక ఫ్యాక్టరీలు మూతపడి కార్మికులకు పని,వేతనాలు కూడా తరిగిపోడం పరిశీలించిన లార్డ్ కేన్జ్ "వాణిజ్య చక్రభ్రమణాల" మీద అత్యంత ప్రముఖమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. పెట్టుబడులర్థాయి తరిగిపోకుండా చూడటానికి, అవసరమైతే, పన్నులద్వారా ప్రజల పొదుపును సేకరించీ, ద్రవ్యాన్ని ముద్రించి బ్యాంకులు యితర సంస్థలనుంచీ అప్పులద్వారా అదనపు కొనుగోలు శక్తిని రాబట్టుకుని ప్రభుత్వరంగాన్ని విస్తరింపజెయ్యడం అవసరం అని వక్కాణించారు. వడ్డీరేట్లు, భవిష్యంలో ఆదాయ వ్యయ వ్యవహారాలను గురించి ప్రజల ఊహాపోహలు ఆర్థిక స్థితిగతులను నిర్ణయించడంలో ప్రధాన పాత్ర వహిస్తాయని యీయన మతం. ఈ శతాబ్దంలో ఆర్థిక సిద్ధాంత ప్రతిపాదనలలో మహత్తరమైనదిగా యీనాటికిన్నీ భావించబడుతున్నది. వాణిజ్య చక్రాలవలన కలిగే ఒడిదుడుకులు అసంతృప్తివలన విప్లవోద్యమాలు తలెత్తకుండా ప్రభుత్వపు పెట్టుబడి విధానం పనిచేస్తుందని సూచించే యీయన సిద్ధాంతం ఒక విధంగా పశ్చిమదేశాలలో వామ పక్ష రాజకీయవర్గాలు, మార్క్సిస్టు సిద్ధాంతాలు బలపడకుండా అరికట్టిందనికూడా భావించబడుతున్నది.

అనేక వివరణలు వ్యాఖ్యలు వెలువడ్డాయి. కేన్జ్ సూత్రాల మీద జోన్ రాబిన్‌సన్ కేంబ్రిడ్జ్ ఆర్థిక శాస్త్ర సంప్రదాయంలో పేరొందిన విదుషీమణి. అయితే అధ్యాపక ప్రసంగాలను, ఉపన్యాసాలను వూహావిహారణలో వెలువడిన భావాలను సంకలనం చేసి పుస్తకాలరూపంలో ప్రచురణ అయిన కృతులు ఆమె సమగ్ర ఆర్థిక శాస్త్ర వ్యక్తిత్వాన్ని ప్రదర్శించవు. ప్రకృత కృతి అనేక అంశాలను—పొదుపు, పెట్టుబడి, వడ్డీరేటు, సెక్యూరిటీలు, ద్రవ్య సిద్ధాంతాలు, ధరలు, ఆర్థిక జాతీయతాభావం, వాణిజ్యచక్రాలు—స్థూలంగా స్పృశిస్తుంది. శాస్త్రీయ దృష్టితోకాక కొద్దిపాటి పరిచయం కలిగించుకోదల్చినవారికి ఉపకరిస్తుంది. లేదా, శాస్త్రీయ దృష్టితో అధ్యయనం చేసినవారికి చివరికి ఒక రకమైన సంక్షిప్తమైన ముగింపు లేక తుదిపలుకుగా వుపకరిస్తుంది. ప్రామాణిక గ్రంథం అవునా కాదా అనే మీమాంసలోకి జొరపడనవసరం లేదు. వాణిజ్య చక్రాలు, వడ్డీరేట్లకంటె ఋతువులు, వార్షిక వర్షపాత భ్రమణాలు, వ్యవసాయరంగం ఉద్యోగావకాశాల కల్పనలో ప్రముఖపాత్ర వహిస్తున్నాయని మనదేశంలో చాలామందికి తెలుసు.

అనువాదం మాత్రం సరళంగా సాగింది. వాక్యాలు స్పష్టంగానూ సూటిగానూ వున్నాయి. ప్రమాణీకరింపబడిన పదజాలమే వాడటం వలన సుగమంగా వున్నది.

3. ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యవిధానం యొక్క ప్రాముఖ్యం గురించి ఏకాభిప్రాయం లేకున్నా వివిధ ఆర్థిక సిద్ధాంతాలు అన్నీ ద్రవ్యంయొక్క విడుదలను నియంత్రణ విధానాలను శాస్త్రబద్ధంగా అసలు జరుపవలసిన అవసరాన్ని ఉగ్గడిస్తున్నాయి. కేంద్ర బ్యాంకు యొక్క పాత్ర బ్యాంకు ప్రభుత్వ వ్యవస్థల పరస్పర సంబంధం అధికారాలు బాధ్యతలు తదితర అంశాలను గురించి అనేక సంవత్సరాలుగా విద్యార్థులకు ప్రామాణిక గ్రంథంగావున్న "కేంద్ర

బ్యాంకింగ్" అనే ఠీకాక్ రచనకు శ్రీ. వి. లక్ష్మీనారాయణ చేసిన అనువాదాన్ని అకాడెమీవారు ప్రచురించారు.

అనుభవంలో, పాఠ్యాంశ పరిచయంతోనూ చేసిన అనువాదం మెచ్చుకోదగినది. అయితే అకాడెమీ ప్రచురించిన అనువాద వాఙ్మయంలో ఒక అంశం జోడిస్తే బాగుంటుంది అనుకుంటాను. ఆయా గ్రంథాలు మన పాఠ్య ప్రణాళిక ననుసరించి వున్నవిగావు. మన దేశ వ్యవస్థకూ సంస్థలకూ ఎటువంటి సంబంధం లేని రీతిలో రచింపబడినవి. అనువాదం చెయ్యడానికి పూర్వం ఎన్నో సంవత్సరాల ముందు రచింపబడినవి. అందువలన వాటి ప్రయోజనం స్పష్టంగా పరిమితమై వుంటుంది. కేవలం కొద్దిపాటి అంశాలను సేకరించేందుకు, విషయ పరిజ్ఞానం పొందేందుకు విడివిడిగా పుస్తకాలను చదవ వలసి రావడంకూడా విద్యార్థులకు కొంచెంయిబ్బందే. అందుచేత అనువాదంతోబాటు ఒక విపులమైన ఉపోద్ఘాతంలో పుస్తకం యొక్క ప్రయోజనాన్ని, విషయంలో యిటీవల వచ్చిన కొన్ని మార్పులను సిద్ధాంతాలను కేవలం సూచించినట్లయితే పై లోపాలు కొంతవరకూ సవరించుకొనవచ్చు. ప్రయోజనం కూడా నెరవేరుతుంది. కొన్ని కొన్ని చోట్ల ఉపోద్ఘాతాలే పాండితీ గరిమకు, విషయ పరిజ్ఞానానికి పరిణతికీ నిదర్శనాలుగా వుండటం తెలియని విషయం కాదు.

శ్రీ ఐ. శ్రీ రామచంద్ర

---

# అణ్వాస్త్రం !

## శ్రీ దిలావర్

తుప్పుపట్టిన పాత కాలపు
తుపాకీ గొట్టంతో
పిట్టల దొరలా బెదిరిస్తావెందుకు ?

అణ్వాస్త్రాల తయారీ గురించి
నీకాట్టే తెలియకపోతే -
నా మనో కర్మాగారంలోకి
ఒక్కసారి తొంగిచూడు !

# ఆహ్వానం

## "సాంధ్యశ్రీ"

ఈ అడవికి ఆకుల్ని రాల్చటంలో
నిరాశ అనిపించదు
వసంతం కోసం వలస పోవడం
కూడా కనిపించదు
ఋతువుల్ని మచ్చిక చేసుకొని
ఆమని కోసం కోకిల్ని పెంచుకుంటుంది
పూలతో బాటు
పుప్పొడిని పంచుకుంటుంది
నిట్టూర్పుల్ని నెత్తావులు చేసుకొని
తూర్పు వాకిట్లో సూర్యుడ్ని రంగుల్లో ముంచెత్తుతుంది
కలలు పూలుగా
విస్తరించుకున్న ఆకుపచ్చ ఆకాశపుటంచుల్లో
ఒళ్ళు పూల తుఫానుల హరివిల్లై వంగుతుంది ....
మంచు ఆఖరి చినుకుల ఆవిరి తెరలో
ఆమని చిత్రవర్ణపు చీరకుచ్చెళ్ళు సవరిస్తున్నప్పుడు
యౌవ్వనం ఉమర్ ఖయ్యామును ఆహ్వానిస్తుంది....
బడలిక లేని ఆత్మ ప్రయాణానికి
ఈ సుమస్వరాలు పుప్పొడి రేణువుల్తో కలసి
శతాబ్దాలపాటు శబ్దాల్ని శాశిస్తూ దారుల్ని చూపిస్తాయి...
నిటారుగా నుంచోవటం తెలిని మనిషికి
చెట్లు ఆదర్శమై
నిద్ర రాని కళ్ళకు
పూలకలల్ని పంచి త్యాగానికింతఅర్థాన్ని ప్రతిపాదిస్తాయి...

ఈ అడవిలోకి అడుగుపెడ్తే
సురభిళాలు బంజారా నృత్యంతో
జ్ఞాపకాల గుట్టును గుప్పుమనిపిస్తాయి
ఈ అడవిలోకి అడుగుపెడ్తే
ఆశల హరితాల పాంజేవులు
భవిష్యదర్థాన్ని బజాయిస్తాయి....
అడవిలోని
ఈ పర్వతాలు ఆకుపచ్చని పెంచుకుంటున్న ఔదార్యగర్భాలు
ఈ హరిత భరితంలో
ఆకాశానికి శీతల నివేదన మేఘ గర్జనాలు
వెలుతురు జండా సూర్యుడ్ని
శీర్షం మీద ధరించి భరించి మోస్తున్న
ఈ మూగ జీవాలు
జాతికి తమ నీతికి అర్థ ప్రతిపాదకుల్ని అన్వేషిస్తూ
అజస్రంగా అనార్తవ వనభోజనాలు పెడుతున్నాయి
రండర్రా....
ఈ అడవికి
మొక్కలై పూయడానికి-చెట్లై కాయడానికి
అనుక్షణం
రంగుల లోకాన్ని ఆత్మీయంగా ఆవిష్కరిస్తూ
పెంచి ఆత్మీయంగా పంచిబెట్టే ఈ ఆరామానికి
రే....
కవుల వేషంలో మాత్రం రాకండి
నిత్య శిశిరం వదలిపోకండి....!



శ్రీ బండ్లపల్లె ఓబుళ్‌రెడ్డి

# ప్రాచీన తెలుగు కావ్యాలలో బడుగు వర్గాల వర్ణన

ప్రాచీన కావ్యాలలో బడుగు వర్గాల జీవితాన్ని సమగ్రంగా వర్ణించిన కీర్తి పాల్కురికి సోమనాధునికి ఒక్కనికే దక్కింది. అతడు సామాన్య ప్రజలతో నిత్య సంబంధాలు కలిసి, వారి జీవితాన్ని నిత్యపారాయణం చేసినవాడు. బడుగు వర్గాలను మతప్రాతిపదికపై కూడదీయుటానికి అతడు చేసినకృషి చాలావరకు సఫలమే అయినప్పటికీ అగ్రవర్ణాలవారు అతనికి మరింత దూరమైనారు. చాతుర్వర్ణ వ్యవస్థను వ్యతిరేకంగా అతడు సలిపిన మహోద్యమం అగ్ర వర్ణాలకు అక్కుగొట్టు అయింది. వీరశైవ మతంలో విప్లవాత్మకమైన పరివర్తన తెచ్చిన బసవడు తనకు పసుగుపద్దని తండ్రితోనే వాదించినాడు: "జాతి గోత్రాతీతు సద్గురుజాతు- జాతిగోత్రా క్రియాశ్రయు జేసెదెట్టు, ఆ కులస్థుడై యున్న యభవుని భక్తునికి నేకులంబని నిర్ణయించెదవు" అని ముక్కుమీద గుద్దినట్లు అడిగినాడు. "పుట్టినాడ కులము పురులు వోనాడ" అని తండ్రితో ఖరాఖండిగా చెప్పి, దీనిని ఆచరించినాడు. ఈ సిద్ధాంతాన్ని ఆశ్రయించి పాల్కురికి సోమనాధుడు కావ్యరచనకు ఉపక్రమించినాడు. అగ్ర వర్ణాలవారు మాల-మాదిగ మొదలైన బడుగు వర్గాలను "గాడు గాడు" అని సంబోధిస్తూ ఉన్న కాలం అది. "మా దేవ భక్తులు మాలలు నాగగూడునే" (బ.పు. పుట 184) అని సోమనాధుడు అధిక్షేపించినాడు. కులంతో నిమిత్తంలేకుండా శివభక్తులైన వారందరినీ "గారు" అని కావ్యంలో సగౌరవంగా సంబోధించినాడు అతని కావ్యంలో కీర్తింపబడిన భక్తులలో అత్యధిక భాగం బడుగు వర్గాలకు చెందినవారే. అతడు అగ్రవర్ణాలపై కసిగట్టి, ఆ వర్ణాలకు చెందిన వారి నెవ్వరినీ "గారు" అని సంబోధించలేదు. వారినందరినీ ఏకవచనంలోనే- ఉదాహరణకు ఎత్తుగా లైతన, దూడ గడ్డప్పనఅని సంబోధించినాడు. అస్పృశ్యతకు వ్యతిరేకంగా పోరాడిన తొలితెలుగు కవి పాల్కురికి సోమనాధుడే.

సోమనాథుడు భక్తునికి, శివునికి అభేదం పాటించినాడు. శివుని చేత భక్తులకు వెట్టి పనులు చేయించినాడు. భక్తులు శివునికి తలలు కూడ అర్పించినారు అవగింజంత విభూతి అలదుకొంటే, గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టింది. మల్లికార్జునాచార్యుడు సకలేశు మాదిరాజయ్యను పరీక్షింపదలచినాడు. ఈ సందర్భంలో సోమనాథుడు మల్లికార్జునాచార్యుని చేత గొల్లని వేషం వేయించినాడు. గొల్లని మనకన్నులకు కట్టినట్లు వర్ణించినాడు. కవిగొల్లని అంగప్రత్యంగాలను,అతని ఉపకరణాలను,వాటిఉపయోగాన్ని చెప్పినాడు: పఱుప్రేళ్ళు, మొద్దుపాదాలు, గుజ్జ చిరుదొడలు, దొప్ప చెవులు, బరడు ప్రక్కలు, బీఱనరాలు, చిదకముక్కు, ముడి బొమలు, దోనికడుపు, పొక్కిళ్ళు వోయిన చెక్కిళ్ళు, వలుద బొక్కిజొమ్ము, పెద్ద నిక్కిన మెడ, పల్లమీసాలు, ఏర్పడు కాయకన్ను (?) పల్లిగడ్డం, నల్లని మేను, ప్రాకుపట్టినవండ్లు బద్దచేతులు, వీకకాళ్ళు, సడ్డి వీపు, ఇంక గొల్లని వృత్తికి అనుగుణమైన ఉపకరణాలు ; ములుగత్తి- దీని పిడికి మూరెడు కఱ్ఱ తగిలించి ఉంటారు కాబోలు. దీనిని చేతబట్టి తన చిత్తం వచ్చినట్లు, ముండ్లు చేతికి తగులకుండా, చీకు పొదలను వడివడిగా నరుకుతాడు. ఆ కొమ్మలు మేకలకు ఆహారం. ఉచ్చునొకలు ; పిల్లలు వేళ-పాళలేకుండా మేక చన్ను గుడుస్తాయి దీనిని నిరోధించటానికి గొల్లడు వేసిన ఎత్తు ఇది. మేకను(ఉ)చ్చును, రెండు వ్రేళ్ళ వెడల్పుగల ఒక బట్ట పీలికకు పూసి, మేక చంటిపాలనే జిగురుగా ఉపయోగించి, దాని చంటికి అతికిస్తాడు. నుచ్చు

కంపుగొడుతుంది. అందువల్ల పిల్లలు చన్ను గుడువవు. మందలోనుండి మేకలను అడవికి తోలుకొని పోవటానికి ముందే గొల్లడు ఈ పని చేస్తాడు. కొన్ని ఉచ్చుగోకలను తనవద్ద "రిజర్వు" కూడ చేసికొంటాడు. మధ్యలో ఉచ్చు గోక జారిపోతే మరల అతికిస్తారు. ఈ కారణం చేత ఉచ్చు గోకలను, చూడు గొడుపును మొలత్రాటితో భద్రపరచినాడు. చూడు గొడుపు అంటే చూడు నిలవటానికి తినిపించే ఓషధి కాబోలు.

గాలికి గొల్లని దబ్బఱ పెండ్రుకలు ఇటు అటు తూలి ఆడుతున్నాయి. అతడు ఈల(విజిల్స్) వేస్తున్నాడు. ఉఱిమి ఎఱ్ఱగా చూస్తున్నాడు. కోపించినప్పుడు అతని కంటిలో ఎఱుపువన్నె ఉందని అర్థం. మేకలను రొప్పే సమయంలో అతని కన్నులు ఎఱ్ఱగా అయినాయి. ఒక్కొక్కలను తనవెంట రమ్మని తన భాషలో పిలుస్తున్నాడు. ఈలవేస్తు న్నాడు- కొంతసేపు ఒరగాల నిలబడతాడు ; కొంతసేపు ఉరుకులు తీస్తాడు. మేకలు తిరిగి పట్టిగ్గా అతడు తన నడకను మార్చుకొంటున్నాడు. అతడు తన వెంట గొడ్డలి, బరిగమ్మి(?), కూటికుండ, దుడ్డు గోల తీసికొన్నాడు. చెట్టెక్కినప్పుడు గొడ్డలితో చిన్న - పెద్ద కొమ్మలు నరికి క్రిందపడవేస్తాడు, ఆ కొమ్మలలోని ఆకులను మేకలు కడు పారమేస్తాయి. దుడ్డు గోలతో మేకలను అదలిస్తాడు. మేకలకు కుడిప్రక్క విసిరితే, ఎడమ ప్రక్కకు, ఎడమ ప్రక్క విసిరితే కుడిప్రక్కకు, ముందు వైపు విసిరితే వెనుక వైపుకు, వెనుకవైపు విసిరితే ముందువైపుకు అవి కదలుతాయి, అందుచేత "దబ్బరవాట్ల విసరి వ్రేయచును" అని కవి వర్ణించినాడు. గొల్లనివద్ద కూటి కుండ కూడా ఉంది. కొన్ని చోట్ల చిక్కంలో సద్దిమూట వేసికొని పోయే సంప్రదాయం కూడ ఉంది. కూటి కుండలోనే అతడు సద్దిని ఉంచుకొన్నాడు కాబోలు. దానిలోనే బువ్వ తిని, దానితోనే ఏ చెరువులోనో, చెలమలోనో, సరస్సులోనో నీళ్ళు త్రాగుతాడు : దానితో నీళ్ళు నింపుకొని, తన వద్ద ఉంచుకొని, దప్పిక అయినప్పుడెల్లా త్రాగుతాడు. అతని చంకలో కొన్ని మేక పిల్లలు ఉన్నట్లు కవి వర్ణించినాడు. అవి అప్పుడే- దారి మధ్యలో – పుట్టిన పిల్లలో నడువలేని స్థితిలో ఉన్న పిల్లలో అయి ఉంటాయి. తాను మరల మంద చేరుకొనేదాకా అవి అతని చంకలో ఉంటాయి. ఇది వింత భారమైన పని ! అతడు ఈ విధంగా మేకలను రొప్పికొని ఒక తుమ్మ చెట్టు వద్దకు పోయినాడు. అక్కడ తుమ్మకాయలను రాల్చుతాడని, లేదా కొమ్మలు నరికి క్రింద పడవేస్తాడని అర్థం. ప్రత్యక్ష పరిశీలన చేసినవాడు కాబట్టి సోమనాథుడు ఇవన్ని మన దృష్టికి తీసుకొని రాగలిగినాడు.

పాల్కురికి సోమనాథునికి పూర్వుడైన నన్నెచోడుడు. ఈ పరిభాషనే ఆటవికులకు వర్తింపజేసినాడు :

బఱిచుమ్మ దలలును, బఱుదులు, దబ్బర,
  మిడిసిన గ్రుడ్డులు, బడికి చెవులు
గందు బలల్లు, బఱికి గడ్డంబులును, నఱ
  హొఅడులనంటి రూపులును, ముఱుచ
కోఁజేతులును, గిఱికి నోళ్ళును, నొక్కుబ్ర
  క్కలు, బొ(ని?)క్కి, రో(బొ)మ్ములు, కుబ్రదొండి
కడుపులు, మురివి(కి) మోకాళు , బొండెత్తి
  నెఱసిన పండుగులు గుఱువ(లు) గట్టి
ఱ(పా)రట వెత్తియున్న పరుసంపుటాడతులు
నడవిలోన, గలయమెయ (యు?)డుచు రేగి
గడరు (గ్రద్ద)వలచు కంపు కాలిమచ్ఛాయయు
గలుగు నెఱుకు ముసిడి (సుండి?) గనిరి సతులు
కు. సం. 6-37.

ఆదికవి నన్నయ్య ఈపరిభాషనే ఎఱుకురాజు వేషంలో శివుని వెంట వచ్చిన ఎఱుకులకు వర్తింప జేసినాడు. సంస్కృత భాషలో వీటికి సమానమైన శబ్దాలు దొరికినవి కాదేమో. మఱి, ఈ మహా కవులందఱు ఒకే పరిభాషను ఎందుకు వాడవలసి వచ్చింది ? నన్నయ రచించిన పద్యాన్ని పరిశీలించండి ;

కాంచన వర్ణావ(భ)ఘను డై మహోన్నత
  కార్ముక హస్తుడై గాలకంఠు
డెఱుక రాజయ్యె నద్రీంద్ర తనూజయు
  వనచరీ భావంబు వఱల దాల్చె
గుఱుచ చేతులో, మిడిగ్రుడ్లును, గడుకొన్న
  తఱటుల, మఱిచెంచు డలలు నమర
దడ ఎండ్లు చేబట్టి తడయక యెఱుకులై
  మార్చుచు భూతమ్ములు......(అరణ్య 1-300)

పై పద్యంలో "తఱటుల"ను బదులుగా "బఱుదులు" అని, "మఱిచెంచు"కు మాఱుగా "బఱిచుమ్మ" అని ఉండదగును.

"ఉత్తర హరివంశ" కర్తనాచనసోముడు పిశాచుల వర్ణనకు ఈ పరిభాషను వర్తింపజేసినాడు. పాల్కురికి సోమనాథుని గొల్లడు పిశాచులలో ఒకడు అయిపోవటం శోచనీయం.

వికృతాననంబులు వికళ దంతంబులు
నిడుపైన దౌడలు నిక్కుమెడలు
మడివడ్డ బొమలును ముయ్యాలముక్కులు
బల్లవెం(డ్రు)కలును, బడికి తలలు,
బొక్కబొమ్మలు, లోతు బొట్టలు, మిడిగ్రుడ్లు
గూనివీపులు, నిడుగ్రొంకి వ్రేళ్ళు
బూరకాళులు! నీచబోయిన చేతులు
గోలమూపులు, గుది గొన్న తొడలు
నతి భయంకరగతి నూప నట్టహాస
కహకహా రావములతోడ గానసయ్యె
దావ పావక ము.. శిఖా దగ్ధతాల
పాలసంకాశమగు పిశాచద్వయంబు [2-122]

పొన్నికంటి తెలగ నార్యుడు (క్రీ.శ.158') రచించిన "యయాతి చరిత్రము"లో ఎరుకులి వర్ణన వచ్చింది. వీరినే కవి "చెంచులు" అని మఱొక చోట (1-103) పేర్కొన్నాడు.

గురివెంద పట్టెళ్ళకును దోడు సందిళ్ళ
చీలి దండలు గూర్చి చాల దొడిసి
యెడనెడ బికిలి పూవిడిన సంకుల పేర్లు
కోరెందపూపల గూడదాల్చి
గ ఱుతుగా మ్రొయు జేగురుబొట్లు మీద దర్ఫ
గేటి పూబొంగల రాగిల్ల దాల్చి
బరుపైన పాఱులా(టా?)కుల బొట్ట దట్టీల
దిండుగా దీసెల పిండు చుట్టి
కఱుచ చేతులు, మిడిగ్రుడ్లు కఱకుమీస
విరులుగ్రమ్మెడు మేనులు, నిరుకుబోర
లేచమాటలు, జడగొన్న పీచుగురులు
గలుగు నెఱుకులు దగ బొడగనగవచ్చి (1-102)

క్రింది గీతలు గీచిన శబ్దాలు నన్నెచోడ, పాల్కురికి సోమనాథుల నుండి స్వీకరించినవేనని స్పష్టం అవుతుంది. సోమనాథుడు "పండితారాధ్య చరిత్రము"(దీ.ప్ర.పుట 1 6)లో మాదిగెబత్తుని వేషంలో ఉన్న ఈశ్వరుని ఇట్లు వర్ణించినాడు :

"వద్దు(/ల్దు?) మొగంబును, వలుద చేతులును
బ్రద్ద చిఱుదౌడలు, బరడు బ్రక్కలును
గాయగాచిన యఱచేయి, నెందోళ్ళు (?)
గోయదాకిన యసి గోళ డాచేయి (?)
మట్టిపాదంబులు, మలినంపు మేను
మిట్ట నుదురు, ముక్కి మెడయును, బ్రాకు
పట్టిన యరవిరి పండ్లు, బొక్కంపు
బొట్టయు, వెడగుక్కపోయిన వీపు,
బొడ్డి కన్నులు, ముడి బొమలు, వ్రేల్వెవులు,
దొడ్డ ముక్కును, గుజ్జు దౌడలును, బరటి
వ్రేళ్ళును, గమలిన గోళ్ళు, లోవంక
కాళ్లును, గందిన కటములు నమర
దెలుపారు బూదినొసలనిండ మెత్తి"

సమాజంలో అట్టడుగున పడిన పిచ్చుకుంటుల నడకలను సోమనాథుడు "పండితారాధ్య చరిత్రము"(వ.ప్ర.)లో ఇట్లు వర్ణించినాడు అతడు ఎంత సూక్ష్మగ్రాహియో, అంత దయాళువు అని ఈ వర్ణన విశదం చేస్తుంది. ఇతడు వాడిన పరిభాషను సంస్కృతం నుండి వెదకి తెచ్చుకొనటం సాధ్యమేనా ? పండితులు ఆలోచింతురు గాక !

"వ్రేళ్ళునులేనఱకాళ్ళును, బిల్ల
వ్రేళ్ళు, చెక్కను నఱకాళ్ళను, మట్టి
కాళ్ళును, రాట మ్రోకాళ్ళను, దోలు
కాళ్లును, నెండిన కాళ్ళను, మలక
కాళ్ళీ, చబోయిన కాళ్ళను, గుజ్జు
కాళ్ళును నా దొడ్డి కాళ్ళును, మడగు
పిఱుదులు నెండిన పిఱుదులు, నొదురు
పిరుదులు, నొండొంటి పిరుదులు, బొల్ల

చేతులు లోవంక చేతులు, తొమ్ము కొలిదులు, వీపు
బ్బొడులు, విఱిగిన భుజములు, నంటు
మెడలును, బొడుగు బొడపైన సుక్కి
మెడలును, గడుగడు నిడుదమూపులును,
ముడుగు మోములు, మురుమొండె ముల్, బండి(?)
బెడగు రూపంబులు, బెడగులు, నొట్ట
ల, టంగ్రిందు దిప్ప మీదంతయు నొప్పి
పటు రూప సౌందర్య భావాతిశయత
బరసు దేహంబులు వాటిల్లినట్ల
దరుణులు నాప్తులు దమ జూపి బ్రదుక...."

పిచ్చికుంటులు ఇతర బిచ్చగాళ్ళవలెనే సమాజానికి భారం. వారు ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొనక పోవటమే దీనికి కారణం. కాని ఆనాడు సమాజంలో ఇట్టి వర్గానికి కూడ ఆశ్రయం బాగుగా లభించింది. కవికూడ వీరిని మిక్కిలి సానుభూతితో చూచినాడు, "క్రిందుతప్ప మీదంతయు నొప్పి పటుతర సౌందర్య రూపాతిశయత" ఉన్నట్లు వర్ణించి, ఇది విధివిలాసంగా భావించినాడు. పిచ్చుకుంటులు "మాకు వీవంగ జేతులు లేవయ్యా, పోవంగ కాళ్ళును లేవయ్యా, అంధ కులమయ్యా" అని దారి పొడుగునా పాడుతున్నారు. వారు ఎనుబోతుల పైన, గజ్జుటెద్ల (?) పైన కూర్చుండి ప్రయాణం చేస్తున్నారు. వారి భార్యలో, ఆప్తులో వారి వెన్నంటి ఉన్నారు. వీరు శ్రీశైలయాత్ర చేస్తున్నారు.

జోగులు, జోగినులు కూడ ఈ యాత్రలో పాల్గొన్నారు. జోగినుల ఆకృతి, పాల్కురికి సోమనాథుని పరిభాషలో ఇది చుక్కలు బొట్లు, జుక్క పెండ్రుకలు, చక్కని పావటలు, జంగాళాలు, ఇనుపనేవాలు, ఇత్తడి సరిసెలు, పెండ్రుకల దండలు, తగరంబు పిల్లాండ్లు, మట్టెలు; పెక్కు వన్నెలతోలు కుప్పసాలు, నల్లగాజులు. చెవులకు సంకం పూసలు, పూసపేరుల బన్నసరాలు. వారివి కుటిలమైన చూపులు, వారు కొయ్యా' కాటుకలు ధరించినారు; పటికపు ముక్కెఱ్ఱలు వారికే భారంగా ఉన్నాయి. దీనికి తోడు జంతువుల, పక్షుల జంజాటం. వారు తమ వెంట చిలుకలు, దుప్పులు, ఎలుకలు, ఏదుకలు, క్రోతులు, పిచ్చుకలు, గొరవకలు, నక్కలు, ఉడుతలు, నమిళ్ళు, పందికొక్కులు, కోళ్ళు కుక్కకూనలు సింగిరిక్కులు, లేళ్ళు, ముంగిసలు తీసికొని పోతున్నారు ; వారు తమ మగవారి వెనుక నడుస్తున్నారు.

ఇంక జోగుల వేషం ఇది :

"బలువన్నె కోక బొంతల నట్టనడిమి
తోలుల కుప్పసములు దూర్చిన మెడలు,
వినురూపముల జోళ్ళు పెండ్రుకల్, పదద
నెనలి యిట్టుక బొట్టు వనపులు, గన్ను-
గవ కాటుకలు, దరహాసము కప్పెరలు
జెవుల నీకెల్లు మ్యొచెడి బోరముండ్లు,
జోకిట తిత్తులు జక్కముల్, నిడుద
తోక కచ్చడములు వాక బొట్టలును
నొడ్డు తొమ్ములు దొడ్డ యూరులు బిగుపు
నొడ్డాణములు నిప్పయుంగరంబులును,
గడియముల్, మురువులు, గట్టి చేతులును
గొడుగులు, గుదియలు, గోక జల్లెడలు
వద్దు(ల్లు?) మొగంబులు వలిపంబు జముక-
బద్దెల గూర్చిన పచ్చడంబులును
మురిపెంబు నడపులు, మూపు తిత్తులును
విరసంబు మాటలు వికృత వేషములు
బల్ల మీసంబులు బకి గడ్డములు
నల్ల మేనులు గుబ్బ నారసంబులును........
గఱక త్రాళుల పెండ్రుకలు సొంగముగను
బన్నుగొనదము జూచి భవులు భవులన........

ఒడ్డాణము = దట్టీ అని అర్థం. దీనిని పురుషులు ధరించినారు.

ఒక సుందరాంగునో సుందరాంగినో ఎదుట నిలిపి ఈ వ్యక్తిని వర్ణించుమని కోరితే మనం "ఓహోహో ! అంటాం. ఒక వికృత వేషధారినో వికృత వేషధారిణినో ఎదుట నిలిపి ఈ వ్యక్తిని వర్ణించుమని కోరితే "ఛీఛీఛీ" అంటాం కాని పాల్కురికి సోమనాథునికి ఇట్టి చీదరింపు

క్కడా కలుగ లేదు. వస్తువునుగాని వ్యక్తినిగాని యథాతథంగా చిత్రీకరించి మన ముందు నిలిపినాడు. అతని కావ్యం యావత్తు ఒక చిత్ర జగత్తు అంటే అతిశయోక్తి కాదు. "పర్వత ప్రకరణం" లోనే శ్రీశైలయాత్రికుల వర్ణనలు అనేకం ఉన్నాయి. అభ్యాసయోగులు "మలకలవ్రాలు దా మడమలనుత్తి, తెలిగాలి బాస వాతెల్ల పూరించి ........ చులకనై దేహముల్ సొక్కాకులట్టు లొక్కింత యిల మోచి యును మోవకునికి" నడుస్తున్నారట. సొక్కాకు జొన్న చేలలో రాలిపడి ఉంటుంది. అది ఏ కొద్ది గాలి వీచినా పైకో, ప్రక్కకో కొట్టుకొని పోతుంది. అభ్యాసయోగులకు శరీర దారుఢ్యం అంతంత మాత్రమేనని కవి చెప్పినాడు.

పుణ్యాంగనలు "అలసియునలయని యట్ల నాథులను బిలిబిలి లావుల బిగువు సూపుచును, గొమరుదలిర్ప నెన్నుకళ్ళ దిగ్గుళ్ళ దమతమ పతుల హస్తములూదికొనుచు, గర మొప్పె తిలు నలికంబుల చెమటనరతలాంగుళముల గలించిపైచుచును........ బింబాధరంబుల బీటలడంగ దాంబూల సారామృతముల దద్దుచును ... .... కరతలంబులు దొండ్లకు గదియించుకొనుచు, బిగిసి పెందొడలు వొంపిరి రాయుకు(ం)డ, నాగరాజహంసలట్లొయ్యన జనుచు"న్నారట. పుణ్యాంగనలు నొసటిమీద అలముకొన్న చెమటను అప్పుడప్పుడు చేతి వ్రేళ్ళతో "గమిచిపైచి"నారట. ఇది కవి సూక్ష్మ దృష్టిని తెలియజేస్తుంది. ఇటువంటి వర్ణనను పాఠకులు ఎక్కడైనా చదివినారా ? లేదనే సమాధానం చెప్పవలసివస్తుంది.

శీలవంతులను కూడ పాల్కురికి వర్ణించినాడు. వారు ఎంతటినాజూకు అయినవారో ! ఎంతపాప భీతికలవారో ఎంత సదాచార పరాయణలో ! ఎంత గొప్ప పతివ్రతలో "ముసుగిడి వస్త్రంబు, ముందల జనుల కెసగను ద్రోవ కెంతయు దొలగి, భావించి, ముందల భక్తులుసనన, దా పెన్కపాదములు సూచుచు" గంట్లపుటెడ్లు తమ వెంట రాగా నడుస్తున్నారు. వారికి అవసరమైన ఉపకరణాలలో "పాదముల గ్రోళ్ళను వుప్పించుకొను గోరుగొండ్లు తెరగట్టు చీరలుకూడ ఉన్నాయి శ్రీశైలక్షేత్రానికి పోయిన తర్వాత, అక్కడ తెరగట్టుకొని స్నానం చేస్తారు కాబోలు.

మిండ జంగాలు తమ వెంట వచ్చే పణ్యాంగలను క్రేగంటజూస్తూ, గేలి చేస్తున్నారు. సరసానికై వారి మీద పూలు విసరుతున్నారు. వారు నడుస్తూ ఉంటే, "కస్తూరి మృగములు" నడిచినట్లు జనులకు "దేహవాసనలు"ఇస్తున్నారట. మిండ జంగాల మనోవృత్తిని, వారి ఔదార్యాన్ని కవి ఇట్లు చిత్రించినాడు :

> "నెటి భక్తులకు మాటు వలువ కుండుటలు
> బగుతుల చేత దావగ నిచ్చినట్లు
> దగిలి ధట్టించి యర్థములు దెచ్చుటలు
> "రారోరిబగుత ! తేరా లంజ"నుచు
> నారంగ్రపయిముసి కడిగి తెచ్చుటలు
> "బసవన్న కరుణరా, బగుత ! నీక"నుచు
> సన మిచ్చుచును ధనంబడిగి తెచ్చుటలు,
> 'గలియుగ బసవండనిలనీవ'యనుచు
> నలరించి భక్తులనడిగి తెచ్చుటలు"

దారి ఖర్చులకు పెద్ద ఇబ్బంది పడకుండానే ధనం దొరికింది. ఇచ్చినవాడు "కలియుగ బసవడు" అయినాడు. దాచిపెట్టుమని ధనం ఇస్తే తాను దాచినట్లు, ఇప్పుడు దానిని, మరల ఇప్పించుకొన్నట్లు ఉంది అతడు అడిగిన తీరు ! కాని వాస్తవంలో ఇది చేబదులు.

చెంచు ధర్మాత్ములు నిజంగానే ధర్మాతులు. వారు "తనువులే భువి మానదండంబు"లుగా భావించి, నేలపడి సాష్టాంగదండ ప్రమాణానం చేస్తున్నారు. తమ గ్రామాలు విడిచింది మొదలు శ్రీశైలంలో మల్లికార్జునస్వామి ఆలయం చేరేవరకు ఇట్లే చేస్తున్నారు. వీరు తమ వెంట ఎన్నో ఉపకరణాలు తీసికొనిపోతున్నారు. ఉత్పత్తి రంగంలో పాల్గొంటున్నవారు కావటంచేత వీరు స్వయంగా చేసిన వస్తువులు ఇవి. వీటిని అమ్మటానికి తీసికొని పోతున్నట్లు అనపడదు. ఈ వస్తు సముదాయంలో గొడుగులు, చెప్పులు,

నేత కప్పడాలు, గద్దె కంబళ్ళు, కప్పెడు కంబళ్ళు, దండెలు, కరతిత్తులు (మేకపిల్ల లేక గొఱ్ఱె పిల్ల చర్మంతో తయారైన తోలసంచి. దీనిలో నీళ్ళునింపి ఉంచితే చల్లగా ఉంటాయి. గొల్లలు వీటిని ఎక్కువగా ఉపయోగిస్తారు), అడపతిత్తులు, నూనె సిద్దెలు, ఆరతి పళ్లెరలు, అలపట్టాలు, సానలు, ముగ్గు బుఱ్ఱలు, దీప సంభాలు, విభూతి పూసలు, విసన కఱ్ఱలు, గంధం చిప్పలు, గంధం చెక్కలు మొదలైనవి ఉన్నాయి. వీటిని సెట్టికల కావళ్ళలో తీసికొనిపోతున్నారు. విశేషం ఏమిటి అంటే అడిగిన చోటనే అడిగినవారికి, అడిగిన వస్తువులు, ఇచ్చివేస్తున్నారు. వలసిన చోటనే వలసిన వారికి వలసిన పదార్థాలు అందిస్తున్నారు. వలసిన చోటనే అన్న పానాదులను ఇస్తున్నారు. అలసినవారికి అప్పటికి అస్తున్నారు. చలి పందిరులు, సత్రశాలలు, గుండ్లు, చెలములు అప్పటి కప్పుడు నిర్మిస్తున్నారు. అప్పటికప్పుడే పందిర్లు, మఱుగులు (స్త్రీల స్నానం నిమిత్తం, కాల్యకృత్యాల నిమిత్తం), విడిదలలు అనువుగా చేస్తున్నారు. ఈ విధంగా జంగమారాధనలు చేస్తున్నారు. మఱి కొందరు ఇట్టి ధర్మాత్ములే చేస్తున్న సేవలు ఇవి :

"ఉదకంబు లుదకంబు లుదకంబులనుచు
నుదకముల్ వోయుచు నొగి వచ్చువారు ;
బుప్పముల్ బుప్పముల్ పుష్పంబులనుచు
బుప్పంబు లిచ్చుచు బొరివచ్చువారు
గజ్జెముల్ గజ్జెముల్ గజ్జెంబులనుచు
గజ్జెంబు లిచ్చుచు గమనించు (నడచు) వారు,
విడియముల్ విడియముల్ విడియంబు లనుచు
విడియంబు లిచ్చుచు వెస వచ్చువారు;
నడవజాలని వారి నడిపించుకొనుచు
నెడనెడ నల్లన యేతెంచువారు"

శ్రీశైలక్షేత్రానికి తండతండాలుగా యాత్రలుచేస్తున్న వారిలో వృద్ధతపోధనులుగూడ ఉన్నారు. వయస్సు ఎక్కిన వారు అనటానికి "వయసు వెక్కిళ్ళు" అని, జనం తక్కువైన వారు అనటానికి "జవముల తక్కిళ్ళు" అని కవి వాడినాడు. వీరి వర్ణనలో సోమనాథుడు తన పరి భాషను వేరు విధంగా మలచినాడు. వృద్ధతపోధనులను మన ముందు సాక్షాత్కరింప జేసినాడు :

చనలేక కాళ్ళీడ్వ సగమట్టలు విడి
సిన పాత్రలను గూడ చెప్పటట్టలును,
గుట్టిన గుడ్డల గోవ్రడంబులును,
గట్టిన యుడి పాత కచ్చడంబులును
జంపి గొంగుగులు, గుస్సిన కరిణములు
జంపి జన్నిదములు, త్రెళ్ళలును, బోల
పంగిన వీపులు, వడభేదు తలలు,
భంగురంబున బొటుకట్టిన పండ్లు,
సడలంగ వీపులనంటుకొన్నట్టి
కడుపులు, బెడతలుడిగిన కన్నులును,
జిల్లగా సరసిన యెముల్లి గిడ్డములు
గుల్లు గుల్లున దుక్కిళ్ళు దగ్గులు,
నుక్కిళ్ళు గొన్నట్టి పుక్కిళ్ళు, వయసు
వెక్కిళ్ళు, జవముల తక్కిళ్ళు, పుర్వ
జలముల జెమురు పూతలు గట్టినట్టు
లలదిన తొంటి సర్వాంగ ధూతులును,
నలరు తద్భూతిపై నన్నిగంధపుల
బొలుపారు బారు త్రిపుండ్ర రేఖలును,
ముడిలేక సందుల ముడిచిపై చుడును
దొడి దొడి జేతుల యెడ వ్రేలు జడలు,
భూతి పాత్రంబులు, భుజనాగపతులు,
ఖ్యాతిమై నొప్పెడు కామసజ్జలును,
నూతంత యన గాళ్ళు కొడళులు దూల
నూతలుగా నిడ్డ యూత,గోలలును........
సరసర దీర్ఘముల్ సరియించునట్లు
వారివారి వృద్ధ తపోధనుల్నడువ

(ప.ప్ర.పుటలు 315, 316)

ఇట్లు "చేదుకో! మల్లయ్య ! చేమకొమ్మ"ని యాత్రికులు అందఱు నడచినారు. సిరిగిరి "నరగిరి" అయిపోయినట్లు సోమనాథుడు వర్ణించినాడు. అతడు చేసిన వర్ణనలను చదివి ఆనందించగలమే తప్ప, వీటిపై వ్యాఖ్య చేయటానికి ఉపక్రమించటం సాహసమే కాగలదు. బడుగు వర్గాలకు అతడు చేసిన సేవ ఆచంద్రతారార్కం నిలుస్తుంది. బడుగు వర్గాలను అభిమానించే కవులందఱికి అతని కవిత్వం మార్గదర్శిగా ఉంటుంది. పాల్కురికి సోమనాథుడు అచ్చమైన ప్రజాకవి, అచ్చమైన తెలుగుబిడ్డ.



# మళ్ళీ బ్రతుకులోకి

శ్రీ జి. వెంకటేశ్వర్లు

పోతున్నాను
వెళ్ళిపోతున్నాను
ఎక్కడికో వెళ్ళిపోతున్నాను.
బ్రతుకు నుంచీ
బాధ్యతల నుంచీ
ముడుల నుంచీ
ముళ్ళ నుంచీ
దేవుళ్ళ నుంచీ
దయ్యాల నుంచీ
తలపుల నుంచీ
పిలుపుల నుంచీ
వేదనల నుంచీ
రోదనల నుంచీ
శోధనల నుంచీ
సాధనల నుంచీ
గడబిడల నుంచీ
గజిబిజిల నుంచీ
రణగొణల నుంచీ
అన్నిట నుంచీ
పోతున్నాను
వెళ్ళి పోతున్నాను.
నాకు కావాలి ఏకాంతం
నాకు కావాలి ప్రశాంతం
కావాలి కావాలి విశ్రాంతి
కావాలి కావాలి మనశ్శాంతి
ఎక్కడ ఎక్కడ
ఆ చోటు ఎక్కడ?
అంతర్ముఖుడనయ్యాను
అంతటా గాలించాను
అంతా అస్పష్టత.
బహిర్ముఖుడనయ్యాను
బాగుగా విలోకించాను
ఏదో మసక మసక.
తల వేడెక్కి పోతుంది
మనసు పిచ్చెక్కి పోతుంది
కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి
ఒళ్ళు తూలి పోతుంది.
అయ్యో! అయ్యో!
ఎక్కడ వున్నాను?
ఎందుకిలా అవుతున్నాను?
ఏదో మంట
ఏదో బాధ
నాలుక పిడుచ కట్టి పోతుంది
పలుకు రావటంలేదు
కళ్ళు పొడుచుకున్నా ఏదీ
కనిపించటం లేదు.
వెనక్కి చూస్తే
అస్పష్టత
ముందుకు చూస్తే
మసక మసక.
ఈ స్థితి భరించలేను
ఈ చోటులో నిలువలేను
ఎవరూ లేరు
ఏదీ లేదు
ఏ శబ్దం లేదు
అంతా

నిశ్శబ్దంకాని నిశ్శబ్దం.
ఇక్కడ క్షణం ఉండలేను
ఒక్క క్షణం బ్రతుకలేను.
పోతున్నాను
వెళ్ళి పోతున్నాను
అక్కడికే వెళ్ళిపోతున్నాను
బ్రతుకులోకి
బాధ్యతల్లోకి
మనుషుల్లోకి
మమతల్లోకి
తప్పించుక పోవాలనుకున్న
తప్పుటభిప్రాయాల్లోకి
ధైర్యంతో పోతున్నాను
లక్ష్యంతో పోతున్నాను
ఏది వచ్చినా
ఎదుర్కొంటాను
ఏది నిలిచినా
తొలగించుకుంటాను
ఈ బ్రతుకు కొవ్వొత్తిని
వెలిగిస్తుంటాను.



# అహం

పూర్ణ

ఈ శక్తి
దేనికి ప్రతిరూపమోగాని
దేశాల వారిగ వేరుపడ్డ
మానవ కోటిలో
పేచీలు, పోటీలు పుట్టించి
మారణహోమ గుండాల చెంతకు
మతిభ్రమచే నడిపించి
దైవసృష్టికే ప్రతిసృష్టి చేసే
మానవ మేధస్సునకు
మెరుగులు దిద్ది
మృత్యు దేవత పంట్లో నెత్తురై
స్వార్థానికి ప్రతిరూపంలా
పాతుకు పోయుంది మనందరిలో.



శ్రీ టి. ఎల్. కాంతారావు

# అభ్యుదయోద్యమం - వచన కవిత

సాహిత్యంలో ఉద్యమం భావసంబంధి. రూపం ప్రక్రియా సంబంధి. పాత వ్యవస్థను నిర్మూలించాలనే తపనతో, కొత్త వ్యవస్థను నిర్మించాలనే ఆకాంక్షతో, పాత విశ్వాసాల పట్ల ద్వేషాన్ని, కొత్త విశ్వాసాలపట్ల మక్కువను పెంచుకుంటూ ఒకానొక వినూత్న జీవన దృక్పథాన్ని సమాజంలో ప్రచారం చేసేటప్పుడు ఆ దృక్పథం ఒక ఉద్యమంగా విస్తరిస్తుంది. ఉద్యమ ప్రచార సాధనాల్లో కళా రూపాలు ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తాయి. అట్లా ఒక ప్రత్యేక సిద్ధాంతిక దృక్పథంతో, అంత దాకా ఉన్న సామాజిక విలువలను, కవితా విలువలను ధిక్కరిస్తూ తెలుగు నేలమీద కాలూనిన మహా ఉద్యమం అభ్యుదయ కవితోద్యమం.

అభ్యుదయ కవులు గతాన్ని నిరశించారు; ఆ గతానికి స్వాగతం పలికారు. "గతకాలము మేలువచ్చు కాలంబు కంటెన్" అనే దృక్పథాన్ని నిరశించిన అభ్యుదయ కవులకు "మంచి యన్నది గతమున కొంచమేనోయ్" అన్న గురజాడ నీతి రీతి అయింది. సమాజ వ్యవస్థ పట్ల మార్క్స్ దృక్పథం; కావ్య వ్యవస్థ పట్ల గిడుగు లక్షణం, గురజాడ లక్ష్యం ఆరాధ్యమైనది అభ్యుదయ కవితోద్యమానికి. అభ్యుదయ రచన అంటే ఏమిటో కృష్ణ శాస్త్రి గారు ఇట్లా చెప్పారు. "పీడింపబడే వాళ్ళు పీడించేవాళ్లూ ఉన్న యీ వర్గ సమాజం ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుట ధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటింప జూచేవారు ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనిక సమాజం పోవాలనుకోవటమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన." కృష్ణశాస్త్రిగారు చేసిన ఈ నిర్ణయంలో స్పష్టంగా మార్క్సిస్టు దృక్పథమే కనబడుతున్నది. కృష్ణశాస్త్రిగారు మార్క్సిస్టుఅని కాదు నేననేది. ఆయన అభ్యుదయ కవితోద్యమాన్ని, దాని జీవ లక్షణాన్ని సరిగ్గా అంచనా కట్టారని మాత్రమే. "వీరు తెచ్చినవి ప్లవం రసావిష్కరణకు, రసాస్వాదానికి సంబంధించినది. సాహిత్యం ఒక భోగవస్తువుగా పరిగణించే దృక్పథ బాధ వీరు తిరగబడుతున్నారు. నేటి రచయితలకు ప్రజలే ప్రమాణము. కొన్ని కారణాలవల్ల సాహిత్యానికి దూరమైపోయిన ప్రజల జీవితాలను మళ్ళీ సారస్వతోన్ముఖంగా తిప్పటానికి నేటి రచయితలు పాటుపడుతున్నారు" అంటాడు శ్రీశ్రీ అభ్యుదయ రచయిత-విప్లవ దృష్టి అనే వ్యాసంలో. ఈ నిర్వచనంలో కూడా నిగూఢమైన భావం మార్క్సిస్టు సిద్ధాంతమే. గురజాడ ప్రదర్శించిన హేతువాద దృష్టి, సంఘ సంస్కరణ, మానవతావాదం మార్క్సిజంలో సూచింపబడ్డ సామ్యవాద వ్యవస్థా నిర్మాణం అభ్యుదయ కవిత్వానికి ప్రాణభూతమైన లక్షణాలయ్యాయి. గణబద్ధ ఛందస్సుల నుంచి మాత్రాచ్ఛందస్సులకు, గ్రాంథిక భాష నుండి వ్యవహారిక భాషకు కవితా న్యాయాన్ని అభ్యుదయ కవులు పరివర్తింపచేశారు. మానవ జాతి చరిత మీద వారి కున్న దృక్పథం కమ్యూనిస్టు మానిఫెస్టోలో ఉన్న దృక్పథమే. 'The History of all hitherto existing Society is the history of class struggles' అన్న భావం అభ్యుదయ కవుల నరనరాన జీర్ణించుకున్నది.

చాలమంది ఈనాటికీ అంగీకరించని సత్యం ఒకటుంది. విషయం మారుతున్నప్పుడల్లా ప్రక్రియకూడా మారుతుంది. ఆధునికమైన భావాన్ని వ్యక్తీకరించడానికి వృత్తి ఛందస్సులు సమర్థవంతమైనవి కాగా కవులు వాటిని విసర్జించి మాత్రా ఛందస్సుల్లోకి, అక్కణ్నుంచి వచనగేయంలోకి ప్రస్థావించారని, ఇట్లా ప్రస్థావించడానికి వారి అసమ

ర్థతే కారణమనే ఒక భావం సంప్రదాయకుల్లోనూ, వారిని విశ్వసించిన వాళ్ళల్లోనూ పాతుకుపోయింది. ఈ అభిప్రాయం యథార్థం కాదని అభ్యుదయ కవిత్వాన్ని సానుభూతితో అధ్యయనం చేసిన ఎవరికైనా తెలుస్తుంది. "The form must correspond to the content as closely as possible, giving it maximum expressiveness and assuring the strongest possible impact on the reaaers for whom the work is intended" అంటాడు లూనీ చార్స్కీ. భావం రూపాన్ని అన్వేషిస్తుంది అనే యాథార్థ్యాన్ని సాహిత్య పాఠకులు తప్పనిసరిగా అంగీకరించాలి. సమస్త భావాల అభివ్యక్తీకరణకు ఏదో ఒకానొక రూపం మాత్రమే సమర్థవంతమైనదని భావించడం శుద్ధ అవివేకం.

అభ్యుదయ కవులు సత్వర సామాజిక పరిణామాన్ని కాంక్షించారు. ప్రజల్లో నూతన చైతన్యాన్ని కలిగించారు. అందుకు అనుగుణమైన మాత్రా ఛందస్సుని, వ్యవహారిక భాషని వారు ఆశ్రయించారు. వారు చెప్పదల్చుకున్న తీవ్ర భావానికి, తీవ్రమార్గమే శరణ్యం కావడంలో దోషం లేదు కదా!

"కావున- లోకపుటన్యాయాలూ
కాల్చే ఆకలి, కూల్చే వేదన
దారిద్ర్యాలు, దౌర్జన్యాలూ
పరిష్కరించే, బహిష్కరించే
బాటలు తీస్తూ
పాటలు వ్రాస్తూ
నాలో కదిలే నవ్య కవిత్వం
కార్మికలోకపు కల్యాణానికి
శ్రామిక లోకపు సౌభాగ్యానికి
సమర్పణంగా
సమర్చనంగా—
త్రిలోకాలలో
త్రికాలాలలో
శ్రమైక జీవన సౌందర్యానికి
సమానమైనది లేనేలేదని
కష్టజీవులకు, కర్మవీరులకు
స్వస్తి వాక్యములు సంధానిస్తూ
స్వర్ణవాద్యములు సంరాలిస్తూ—
వ్యథార్త జీవిత యథార్థ దృశ్యం
పునాదిగా ఇక జనించబోయే
భావి వేదముల జీవనాదములు
జగత్తుకంతా చవులిస్తానోయ్"

ఈ గేయాన్ని వృత్త ఛందస్సులో రాస్తే ఎంత బీభత్సమవుతుందో కవితానుశీలురకు చెప్పవలసిన అవసరం లేదు. పైగా ఈగేయంలో శ్రీశ్రీ అభ్యుదయ కవితా వస్తువును, అభ్యుదయ కవి దృక్పథాన్ని స్పష్టంగా నిర్దేశించాడు. వీరి దాపుగా అభ్యుదయ కవిత్వం అంతా మాత్రా ఛందస్సులలోనే సాగింది. వృత్త ఛందస్సుల నుంచి, స్వేచ్ఛను సాధించినఅభ్యుదయ కవులు, వృత్తి ఛందస్సుల నుంచి కూడా స్వేచ్ఛను కాంక్షించారు. ఫలితమే వచన కవిత.

వచన కవితకు ఆద్యుడు ఎవరు? అన్నది తేలని ప్రశ్న. వచన కవితా ప్రక్రియ ప్రారంభాన్ని గురించి ఆరుద్ర చెప్పిన విషయం సమంజసంగా కనబడుతుంది. "శిష్ట్లా సంపుటాలు కేవలం వచన గీతాల సంకలనాలని చెప్పడానికి వీల్లేదు. ఉత్తరోత్తరా రాబోయే వచన యుగంలోని ఘంటాపథం కోసం అడవినికొట్టి, ముళ్ళకంపలను నరికి, దారి చేసుకోడానికి వీలుగా ఎవరూ నడవని నట్టడివిలో. కొంతమేరను సుగమం చేయడం అందులో కనబడుతుంది. శిష్ట్లాది గొప్ప విప్లవారంభం" అంటాడు ఆరుద్ర, శిష్ట్లా తరువాత పట్టాభిని చెప్పుకోవలసిందే.

"నా ఈ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో
పద్యాల నడుమున్ విరుగదంతాను
చిన్నయ సూరి బాల వ్యాకరణాన్ని
చాల దండిస్తాను
ఇంగ్లీషు భాషాబండారంలో నుండి
బందిపోటుంచేసి కావాల్సిన
మాటల్ని దోస్తాను
నా యిష్టం వచ్చినట్లు చేస్తాను."

అంటాడు పట్టాభి. పట్టాభి వచన కవిత్వాన్నయితే రాశాడు కాని అభ్యుదయ కవి మాత్రం కాలేకపోయాడు, వర్తమాన సామాజిక వ్యవస్థ మీద తనకుగల విహ్వాభావాన్ని ప్రదర్శితం చేశాడు కాని రాబోయే సామాజిక వ్యవస్థయొక్క స్థూలరేఖల్ని కూడా దర్శించలేక పోయాడు. 1937లో శ్రీశ్రీ రాసిన "రాడు" శుద్ధ వచన గేయం అభ్యుదయ కవితా లక్షణాన్ని నిరూపిస్తుంది.

"అందరం కలిసి చేసిన ఈ
అందమైన వస్తు సముదాయం అంతా
ఎక్కడో ఒక్కడే వచ్చి
ఎత్తుకుపోతూ ఉంటే చూచి
"అన్యాయం, అన్యాయం !" అని మేమంటే—
"అనుభవించాలి మీ ఖర్మం" అంటాడు.
పొద్దు పొడిచి పొద్దు గడిచేదాకా
ఎద్దుల్లాగు పని చేసే మనుషుల్ని
మొద్దుల్నీ మొరటుల్నీ చేసి
ముద్దకికూడా దూరం చేశాడు
"ఘోరం ఇది దారుణం ఇ"దంటే
"ఆచారం అడుగు దాటరా"దంటాడు
భరించడం కష్టమైపోయి
పనిముట్లు మేము క్రిందను పడవైచి—
"చెయ్యలేం, చస్తున్నాం మేము
జీవనానికి ఆసరా చూపించ" మంటే....
నోరుమూసి, జోడు తీసి కొట్టి
"దౌర్జన్యానికి దౌర్జన్యం మం"దంటాడు"

ఈ వచన గేయంలో శ్రీశ్రీ పీడించేవాళ్ళ, పీడింపబడే వాళ్ళ మనస్తత్వాలను చక్కగా చూపించాడు. అభ్యుదయ యుగకవితా ప్రారంభకాలంలో వచ్చిన మంచి వచన గేయ మిది. మార్పుని ప్రతిఘటించడమే లక్ష్యంగా కలవాళ్ళు కొంతమందుంటారు. వాళ్ళు ఈ తిరుగుబాటు దనంమీద, ప్రాచీన కవితావిలువల విధ్వంసం పట్లా అమితమైనకోపాన్ని ప్రదర్శిస్తారు. నూతనంగా ఉద్భవించే భావ జాలాన్ని అణగద్రొక్కడానికి ప్రయత్నం చేస్తారు. ఇటువంటివాళ్ళను గురించే ముద్దుకృష్ణ "ప్రపంచమంతా ఒక యిల్లుగా, మానవజాతి అంతా ఒక కుటుంబంగా మారిపోయే రోజులు వస్తున్నవి. ఏ మూలనో ఉన్న ఒక దేశం సాహసించి చేసిన యత్నంలో, అనాది నుంచీ మానవజాతి విశ్వసించిన నీతి, ధర్మం, సత్యం,విలువలు తారుమారు అవుతూఉన్నవి. మనం కూపస్థంగా ఉండటం వల్లనో, పురాతన మృగత చేతనో, రక్తంలో నీరసం చేతనో నూతన తేజస్సుకు గుడ్ల గూబల మవుతున్నాము. ఇది పనికిరాదు" అని రాసింది. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారి అశ్వాసాంతం అనే గేయం అస్తమించిన సంప్రదాయానికి, ఉదయించిన మరో సంప్రదాయానికి ప్రతీక.

"లలాటాన కుంకుమాగ్ని, భుజంమీద మబ్బుదుబ్బు
కాళ్ళ క్రింద కిర్రు చెప్పు అగోస్త్రం పొడుంకాయ
వ్యవధి లేని అవధానం వెళిపోయిందెళిపోయింది
షడ్డాదీ పానుగంటి, బాలలీలు, బ్రహ్మసమాజ్
చెళ్ళపిళ్ళ పద్యావళి, చిలకమర్తి గయుడి కథ
తాటికాయ నీటి కాడ, పుల్లు మూనుటాటాలు
ప్రచారిణీ చింతామణి వెళ్ళిపోయాయ్యొళి పోయాయి
............
ఎడిత సిట్వెల్,ఎజ్రాపౌండ్, జేమ్సుజాయిస్, జీన్ కాక్టో
పఠాభి కవిఫిడేల్ డజన్, పిఠాపురం యువరాజా
శ్రీనారాయణబాబూ, అశాంతిలో ఇంద్రకాంతి
పూరీలో పురి పండా, బెంగుళూరు హరీస్ ఛటో
............
అతి విస్మృత అతి రాజిత
అతి పూజిత అతికామిత అతి వాస్తవికాకారం
ఆహార్యం, ఆచారం వొచ్చేశా యొచ్చేశాయి" అని
పాడాడు.

అభ్యుదయ కవితా యుగంలో వచన కవిత్వంమేరకు శిష్టా, నారాయణబాబు, పఠాభి, శ్రీశ్రీల తరువాత ఆరుద్ర, కుందుర్తి, బైరాగి, తిలక్, నారాయణరెడ్డి మొదలుగా గల వారు. ఆరుద్ర'త్వమేవాహం' కావ్యం తెలంగాణా విప్లవ పోరాటానికి సంబంధించినది. తెలంగాణా ఇతివృత్తం భూమికగా సామ్యవాద వ్యవస్థా నిర్మాణం ఆశయంగా సాగిన కావ్యమిది.

"చిన్న చిన్న చీమలు వగైరా
అడుగు భుజం అనుకోండి
బలవంతమైన సర్పం
గట్రా ఎట్సెట్రా
అడుగు భుజం ఉత్పత్తి చేసే
ఆహారం మీద ఆధారపడ్డంవల్ల
లంబం అవదామరి ?
ఈ భుజాల పరస్పర సంఘర్షణల ఫలితం
ఈ భుజాల కర్ణంమీది చతురస్రం
అవునా ? సరి.
ఈ చతురస్ర వైశాల్యం
ఇజీక్వల్టూ
రెండు విభిన్న భుజాలపై
గల చతురస్రాలలోని తమిస్రం.
థిసీస్ యాంటి థీసిస్‌ల మిశ్రం
రెండు భిన్న పక్ష సంజ్ఞల పోరాటం
అనగా ఒక నూతన అవస్థ
ఒక పునీత వ్యవస్థ
అది ఉపపాద్యం
వామపక్ష నినాదాల పఠరించి
వామపక్ష విధానాల చరించి
నిర్మాణక్రమాన్ని చెయ్యండి"

ఈ గేయంలో ఆరుద్ర ఉపయోగించిన ప్రతీకలు మాథమాటికల్ సింబల్సు. పైథాగరస్ సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని వర్గ సంఘర్షణను, తద్వారా సామ్యవాద వ్యవస్థ నిర్మాణాన్ని చెప్పాడు. తెలంగాణా ఉద్యమాన్ని ఆధారంగా జేసుకొని వచ్చిన సంపూర్ణ వచన గేయ కావ్యం కుందుర్తి తెలంగాణ. కుందుర్తి రాసిన "ఆశ" వచన గేయ నాటకం ఒక గొప్ప ప్రయోగం. నారాయణరెడ్డి వచన కవితలో అనేక సంకలనాలను వెలువరించాడు. బైరాగి నూతిలో గొంతులు, చీకటి నీడలు గొప్ప వచన గేయ సంకలనాలు. తిలక్ అమృతం కురిసిన రాత్రి కవితా సంకలనంలో అభ్యుదయాంశగల అనేక వచన గేయాలున్నవి.

నూతిలో గొంతులు తొలిపలుకులో బైరాగి ఈ వ్యవస్థ స్థితిని సింబాలిక్‌గా చెప్పాడు. "గొంతుకలు వస్తున్న నూతిలో నీళ్ళు లేవు. అదొక పాడునుయ్యి. పాడునుయ్యి పతనానికీ,మరణానికి సంకేతం. అందులో జీవనం ఉండదు. పైకి ప్రాకటానికి ఆధారం కనిపించదు. వారు కేకలు వేస్తారు. కాని వారి గొంతులు బయటి వారికి స్పష్టంగా అనిపించవు. భూగర్భపు లోతులు వారిని బాహ్యప్రపంచాన్నుంచి వేరు పరుస్తున్నవి. వారుయాత్రికులు కూడాకారు. వారికొక గమ్యం లేదు. చీకటి తప్పవారికి తోడెవ్వరూ లేరు. వారు గర్వాంధత వల్ల అభిశప్తులైన నహుషులు. కాని ఆ పాపం వారిదే కాదు. అందరిదీ ; అది సమస్త మానవ కోటికీ వర్తిస్తుంది." ఇట్లాబైరాగి చెప్పడంలో వ్యవస్థలోని దైన్యం, జగత్వం,సమస్యాపరిష్కారరాహిత్యంఅన్నీధ్వనిస్తున్నాయి. అతని కవిత్వంలో కూడా ఈ భావాలే ధ్వనింపబడతాయి. అంధకారాన్ని దర్శించడమే అతనికి తెలిసింది కాని,దాన్ని వెలుగుగా మార్చడం అర్థం కాలేదు. కనుకనే-

"రాత్రి
కాలరాత్రి
కరాళ కాలరాత్రి
ఆదిమ తమస్సులు ఆవరించాయి ఆకాశాన్నీ
అవనినీ, అగాధ హృదయాన్నీ.

కప్పేశాయి కాటుక చీకటి మంచులు
ప్రలయోన్ముఖ పురాతన ప్రపంచాన్ని
అంధకార సాగరాన వయనించిన ఓడల
గురుతులుండవు
వల్లకాటి మునివాకిటి నాటిన మొక్కలుండవు
చివరకు చీకటొకటే, చలనం లేదు చీకటికి"

అని తన నైరాశ్యాన్ని ప్రకటిస్తాడు. ప్రస్తుత సమాజం పల్లకాడని, దానికి వసంతం కాని, ఉషస్సుకాని లేవని బైరాగి ప్రగాఢ విశ్వాసం. ప్రపంచానుభూతితో స్వీయానుభూతి పర మైనపుడే ఉత్తమ కవిత్వం ఉద్భవిస్తుందనడమే అతనిలో గల అభ్యుదయాంశం.

అభ్యుదయ రచయితల సంఘం ఆవిర్భవించిననాటి నుంచీ ఈనాటి దాకా ఎంతోమంది కవులు వారి భావాభి వ్యక్తికి వచన కవితను వాహికగా చేసుకొన్నారు. ప్రయోగ మనే ప్రవాహదశను గడచి సంప్రదాయంగా ఘనీభవించింది వచన కవితా ప్రక్రియ. తెలుగు కవితా పరిణామ దశల్లో వచన కవిత ఒక మైలురాయి.

వచన కవిత పరను ప్రయోజనం భావాన్ని సూటిగా వ్యక్తం చెయ్యడం; భాషలో సాధ్యమయినంత సారళ్యాన్ని సాధించడం ; కవితను ప్రజల్లోకి వ్యాప్తి చెందించడం. అయితే-వచన కవిత కేవలం అభ్యుదయ భావానికే అంకితంకాక అనేక భావాల సంగమస్థానంగా రూపొందింది. అనుభూతి వాదం పేరుతో, వ్యక్తి వాదం పేరుతో, ప్రతీక, మార్మిక వాదాల పేర్లతో వచన కవిత అర్థ రహితంగానూ, అయోమయంగానూతయారైంది. శబ్దాడంబరత, అర్థక్లిష్టత, అన్వయ క్లిష్టత రాను రాను వచన కవితలో చోటు చేసు కొన్నాయి. వచన కవితకు పట్టిన ఈ దుస్థితిని గురించి తిలక్ ఇట్లా అంటాడు:

"రాత్రి రెండో జాములో రెండు కత్తుల్ని తిన్నాను.
గుండె మీద గుండు మీద సల్ఫ్యూరిక్ యాసిడ్
పోసుకున్నాను
నీ పెదవుల్ని కత్తిరించి నా వీపుమీద అతికాను
ఇలా రాయడం కొత్తగా గమ్మత్తుగా ఉంటుందిగాని
ఇది పసితనం + వెర్రితనం × డెకడెన్సు
ఈ కషాయం వికటిస్తుంది
ఈ వ్యవసాయం వెర్రితలలు వేస్తుంది"

ఏ కవితా ప్రక్రియకైనా దానిని ఒక ప్రక్రియగా నిలిపే అంశాలు రెండు. మొదటిది విషయం, రెండవది శిల్పం. శిల్ప సిద్ధాంతాల సమగ్ర స్వరూపావిష్కరణ ఉత్తమ కవిత్వంగా రూపొందుతుంది. ఒక ప్రక్రియను అంచనా కట్టేటప్పుడు ఆ ప్రక్రియలో నిష్ణాతులైన వారిని పరిగణనలోనికి తీసుకోవాలిగాని అల్పులను తీసుకొని వారి బలహీనతను ప్రక్రియా బలహీనతగా ఎత్తిచూపకూడదు. వచన కవితా వ్యతిరేకులైన విమర్శకులు అవలంబిస్తున్నది ఇదే పద్ధతి.

"కవిత్వం ఒక ఆల్కెమీ దాని రహస్యం
కవికే తెల్సు
కాళిదాసుకు తెలుసు, పెద్దనకు తెలుసు
కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు" అని తిలక్ అనడంలోగల ఔన్నత్యాన్ని అర్థం చేసుకోవాలి. చివరగా తిలక్ పాదాలతోనే ఈ ప్రసంగ వ్యాసాన్ని ముగిస్తాను.

"కొత్తదారితొక్కలేని, కొత్త మలుపు తిరగలేని
కుంటి, గుడ్డి వాళ్ళ ప్రయాణ కోలాహలం
మురికి కాల్వమీద, ముసలి తనంమీద, మృషాజగతి మీద
మహోదయం వికసించదు, వసంతం హసించదు
సంప్రదాయభీరువుకి అస్వతంత్ర వితంతువుకి
వసంతం లేదు."



# జీవన గీతం

శ్రీ కె. రాంమోహన్ రాజు

ఇక్కడే ఈ రోడ్లమీద పారేసుకున్న జీవితం
నిశ్శబ్దంలో, బాధలో ఒంటరిగా పోగొట్టుకున్న
బతుకు విలువలు, మూల్యాలు
ఈ రోడ్డుమీద ఆనందాలు, ఆకలిమంటలు
అన్నీ కలబోసుకుని కదంతొక్కాయి
జీవితం యొక్క వాస్తవికత ఇంకా
మెదడులోకి ప్రవేశించకముందు-
చిన్నప్పుడు-
ఈ రోడ్డుమీద పాటలు పాడుకుంటూ
తిరిగాను
ఎడాలసెంట్‌గా వున్నప్పుడు
కలలు కంటూ తిరిగాను
జీవితాన్ని ఇంద్రధనస్సుగా
భావించిన ఆరోజులు ఇప్పుడేవీ?
నా ప్రియమైన జీవితమా?
నువ్వెంత భయంకరమైన దానివి?!
నీ అందక
మచ్చల చర్మం వున్న చిరుత పులి
నీ అందం
తెల్లని పొలుసులు వున్న నాగుపాము
దృశ్యమానమైన మధురానుభవం
వాస్తవంలో చేదునిజం
ఐతే, జీవితమా!
నా ప్రియమైన జీవితమా
నీతోనే నా పోరాటం
భవిష్యత్తు మీద విశ్వాసమూ
భుజాల్లో శక్తి ఇంకా మిగిలివున్నవాణ్ని నేను



# కర్తవ్యం

శ్రీ కొడవంటి లీలామోహనరావు

బండ బారిన నేలను
మూలికలు పండిద్దామని
నలుగురి మనసులు నవ్విద్దామని
తంటాలు పడుతుంటే
హంసల రథం మీదతేలే
నా నేస్తం
నన్ను చూసి ఫక్కున నవ్వాడు.
సిగ్గుతో ముడుచుకు పోయి
నాతలను నాగుండెల్లో
దాచుకో బోయాను.
కాని
లోకం నాడి చూసిన పిల్ల తెమ్మెర
నేనున్నాను లెమ్మని
వీపు తట్టింది.
అంబర వీధుల్లో
బరు వెక్కిన మేఘం
కళ్ళు తెరచి చూడమని
రణగొణ ధ్వని చేసింది.



# నిత్యచైతన్యస్రవంతి

డా. గుమ్మనూరు రమేష్‌బాబు

అరమోడ్పు ఆ కనుల
  పొంగుతున్న కృష్ణకడలీ కెరటాల
రసరమ్య గీతులు!
అర విరసిన ఆ అధరాల
ఎలుగెత్తే మోహన మురళీస్వరాల
మీరా ప్రతిరూపాలు!
కరకంకణముల సవ్వడిలో
కాలి అందియల చప్పుడులో
వేణుధరుని వేడుకలే!
వేయి వెన్నెల్ల జాతరలే
తొలిశ్వాసలో దరిచేర్చుకొనే ఆశ
గోపాలుని పైనే ధ్యాస!
మలిశ్వాసలో విడిపోలేని అదోరకమైన పెనుఘోష
సదాగిరిధరుని పైనే ఎనలేని జిగీష!
వాత్సల్యమో
అవ్యాజానురాగమో
ప్రేమసింధూరమో
స్నేహ మాధుర్యమో
మోహమో
కామమో
ఉన్మాదమో
ఉద్వేగమో
ఎదలోతుల చెలరేగే ఆ అలజడి
ఎందుకో చెప్పగలేని ఆ హడావుడి
నావాడవు నీవని అనిపించుటకో!
కాక నేనే నీవని తెలియ జెప్పుటకో!
ఏమి దివ్యానుభూతి!
నిత్యచైతన్యస్రవంతి!

# నిరాశావాదులు

హిందీ మూలం: శ్రీ గోరక్ పాండే
తెలుగు అనువాదం: శ్రీ బి. బి. జి. తిలక్

వాళ్ళు
పువ్వులు వికసించడం
చూసి ఏడుస్తారు
ఎందుకంటె
పుట్టుకలోనే చావున్నదన్న
సత్యం వాళ్ళకు తెలుసు-
యంత్రాల్ని చూసినా—
వాళ్ళకు దుఃఖం ఆగదు
ఎటుచూసినా పువ్వులు వికసించిన
రోజులు గుర్తుకొచ్చి—
సగం నిండిన కుండలో
ఖాళీ భాగపు చీకటి
వాళ్ళని ఉత్తేజపరుస్తుంది—
పూర్తిధ్యానంతో శూన్యాన్ని
సృజియిస్తారు ఫిరంగులు వర్షించినట్లు—
నిశినో, నిర్యాణాన్నో వాదిస్తారు
వాళ్ళ పరాన్న జీవనాన్ని సమర్థించు కునేందుకు.

డాక్టర్ బి. ఆం. క. రావు

# ఆరవ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధి మార్గాలు

## సంక్షేమానికి పారిశ్రామికీకరణ

సమగ్ర మానవ సంక్షేమానికి ఆర్థిక సంక్షేమము; ఆర్థిక సంక్షేమానికి ఆర్థికాభివృద్ధి; ఆర్థికాభివృద్ధికి పారిశ్రామికాభివృద్ధిసాధనాలు. కాబట్టి అభివృద్ధి వ్యూహంలో పారిశ్రామికాభివృద్ధి కీలకపాత్ర వహిస్తుంది. ఆర్థికాభివృద్ధిలో వివిధీకరణ, ఆధునీకరణ, స్వయం నిర్భరత భాగాలు. వీటి సాధనకు పారిశ్రామికీకరణ అవశ్యము. అయిదవ ప్రణాళికాంతం వరకు సాధించిన విజయాలను, లోపాలను దృష్టిలో ఉంచుకుని మంచిని ముందంజ వేయించటానికి, లోపాలు మరల రాకుండా వుండటానికి అనువుగా ఆరవ ప్రణాళిక పెట్టుబడి పద్ధతి, గమనము ఉండటం అవసరము. మన ప్రణాళికా బద్ధమైన అభివృద్ధి విధానము ఇందుకు అనుకూలంగా ఉండాలి.

## ప్రాతిపదిక సంవత్సరపు మార్పు

ఆరవప్రణాళికకు 1979-80 ప్రాతిపదిక సంవత్సరము. శ్రీమతి ఇందిరా గాంధీ మరల ప్రధానమంత్రి కాగానే జనతాపార్టీ ప్రభుత్వమేర్పర్చిన ఆరవ ప్రణాళికను మార్చి కొత్త ఆరవ ప్రణాళికను ఈ సంవత్సరం నుండి ప్రారంభించినదని గుర్తుంచుకోవడము అవసరము.

## ప్రారంభ కాలంలో లోపాలు

ఈ 1979-80 లోనే బొగ్గు, విద్యుచ్ఛక్తి, రవాణా మాధ్యమాలకు లోటు ఏర్పడింది. ఇందువల్ల పారిశ్రామికీకరణకు ఆటంకం కల్గడమే గాక, ఈ రంగంలో ఉత్పత్తి గత సంవత్సరపు ఉత్పత్తిలో 1.4 శాతం తగ్గింది. వివిధ పరిశ్రమల్లో ఉత్పత్తి శక్తిని తగినట్లు ఉపయోగించలేదు. అందుచేత చాలా పారిశ్రామిక వస్తువులకు కొరత ఏర్పడింది. వ్యాపార సమతౌల్యము దెబ్బతిన్నది. సిమెంటు, ఉక్కు, చక్కెర, రసాయనిక ఎరువులు దిగుమతి చేసుకోవలసి వచ్చింది.

## కొరతల నివారణకు చర్యలు

దిగుమతి చేసుకొన్న ఈ వస్తువుల కొరతలను నివారించడానికి అభిలషణీయమైన రీతిలో ఉత్పత్తి శక్తిని ఉపయోగపర్చుకోవాలి. ఉత్పాదకతను కూడ మెరుగుపర్చుకోవాలి. వీటితోపాటు ఈ క్రింద చెబుతున్న చర్యల్ని కూడా తీసుకోవాలి.

(1) ప్రయివేట్, పబ్లిక్ రంగాలలోని వివిధ రకాల పరిశ్రమల్లో తయారీ శక్తిని తగినంతగా పెంచాలి. తద్వారా వినియోగ, అనశ్వర వస్తువుల సరఫరా పెంచవచ్చు. అంతేగాక మధ్యస్థ పెట్టుబడి వస్తువులను అందించి వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో వృద్ధిని పెంచవచ్చు. పెట్టుబడి వేగాన్ని పెంచాలి. తయారీ శక్తి, డిమాండ్ కంటె ముందంజ వేసేటట్లు చెయ్యాలి. తద్వారా విపణి వీధిలోని పోటీ శక్తులు బాగా పనిచేయడానికి తోడ్పడాలి. ఇందువల్ల ఆర్థిక వ్యవస్థ గమనానికి అవరోధంగా ఉన్న కొరతలను తొలగించాలి.

(2) అనేక రకాల ఆర్థిక కార్యకలాపాలకు దోహదం చేసే పెట్టుబడి వస్తువుల్ని ఉత్పత్తి చేసే పరిశ్రమలను, ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలను ప్రత్యేక శ్రద్ధతో మెరుగుపర్చాలి. పోటీ ధరలను, వస్తు నాణ్యతను దృష్టిలో ఉంచుకుని ఈ మెరుగుదలకు పూనుకోవాలి. అలా జరిగితేనే దేశీయ పెట్టుబడి వస్తువుల మీద ఆధారపడే ప్రాజెక్టుల నిర్మాణ ఖర్చులు ఎక్కువగా పెరగకుండా ఉండగలవు. అంతేగాక యాంత్రిక సాధనాలను, వాణిజ్య వాహనాలను తయారు చేసే పరిశ్రమల్ని కూడా మెరుగుపర్చాలి. అందువల్ల దేశీయావసరాలు తీరడానికేగాక, ఎగుమతులను అభివృద్ధి చేసే అవకాశాలు ఇప్పటికంటె ఎక్కువగా ఉద్యోగనియోగం కావడానికి వీలు కలుగుతుంది.

(3) ఇంజనీరింగ్ వస్తువుల్ని, పారిశ్రామిక వస్తువుల్ని, ప్రాజెక్టుల నిర్మాణానికి అవసరమయ్యే వస్తువుల్ని హెచ్చుగా ఎగుమతి చెయ్యాలి. తద్వారా విదేశీ ద్రవ్య వనరులను ఎక్కువగా సంపాదించి ఆరవ ప్రణాళిక అమలును బలపర్చాలి. ఈ ఎగుమతుల పెంపుదలకు అవసరమైన కొన్ని ప్రత్యేక పరిశ్రమల్లో తయారీ శక్తిని పెంచాలి. ఇందుకవసరమైన వ్యూహాలను ఏర్పర్చాలి.

(4) పారిశ్రామిక పురోగమనానికి సాంకేతిక శ్రేష్టత తప్పనిసరిగా కావాలి. అందువల్ల సమకాలీన సాంకేతిక విజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవాలి. దేశీయ పరిశోధనను పెంపొందించి దేశీయ సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించాలి. అప్పుడు ఈ రెండు సాంకేతిక విజ్ఞానాలను తగు ష్పత్తులలో కలిపి పనిచేయించాలి. అయితే విదేశాల నుండి సాంకేతిక విజ్ఞానాన్ని దిగుమతిచేసుకునే పద్ధతులను, అందువల్ల కలిగే అభీష్ట పరిమాణాల్ని సమీక్షించి, అవసరమైతే తగు రీతిలోనూ తన మార్గాలను ఏర్పర్చుకోవాలి. మన ప్రయోజనాలకనుగుణ్యమైన పరిశ్రమల అభివృద్ధికి తగిన పురోగామిక సాంకేతిక విజ్ఞానాన్ని ఏర్పర్చుకోవాలి. ఇందుకు కావలసిన దూరదర్శి ప్రణాళికలను, వ్యూహాలను ఏర్పర్చుకోవాలి. వీలైనంతవరకు విదేశ పారిశ్రామికుల కోర్కెల కనుసారంగా నడుచుకోవడము మానుకోవాలని ఈ సందర్భంలో చెప్పక తప్పదు.

(5) పారిశ్రామికాభివృద్ధివల్ల ఇంధనానికి డిమాండ్ పెరుగుతుంది. ఇప్పుడు ఇంధన కొరతకూడా కన్పిస్తోంది. తత్కారణంగా వస్తు తయారీ పరిశ్రమల్లోనేగాక, ముడి వస్తువుల తయారీ విషయంలోకూడా ఇంధనాన్ని సమర్థవంతంగా ఉపయోగించాలి. దేశీయ ఇంధన వనరుల కనుగుణ్యంగా ఇంధన వినియోగాన్ని ఏర్పాటు చేసుకోవాలి. రోడ్డు రవాణా వాహనాలను నడపడంలో ప్రత్యామ్నాయ ఇంధనాలను ఉపయోగించడం అందుకు మార్గము.

(6) వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి నూతన వ్యూహాలను ఏర్పర్చాలి. నూతన అభివృద్ధి నమూనాను ఏర్పర్చి ప్రస్తుత నగరాల ప్రాంతాలలో పారిశ్రామిక కేంద్రీకరణ జరగకుండా చెయ్యాలి. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి జాతీయ కమీషన్ యిచ్చిన సిఫారసులను, అందులోని వ్యూహాన్ని ఉపయోగించుకోవాలి.

## ఆర్థిక పరిస్థితులకు పారిశ్రామిక విధానానికి పరస్పరానుగుణ్యత

పారిశ్రామిక విధానం ఎల్లప్పుడూ మారకుండా ఉండటానికి వీలులేదు. ఆర్థిక పరిస్థితుల మార్పుకు అనుగుణ్యంగా మారాలి. ప్రారంభదశలో ఉన్న ఆర్థిక వ్యవస్థ కొరకు ఏర్పరచిన సూత్రాలు అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థకు పనికిరావు; ప్రణాళికలు అమలు జరిగినకాలంలో సాంకేతికవిజ్ఞానంలోను, పారిశ్రామిక నిర్వహణా నైపుణ్యాలలోను వృద్ధి వచ్చింది. వీటిని పూర్తిగా ఉపయోగించుకునే చైతన్యం కావాలి. ఈ అభిప్రాయం బలపడాలి. ఇందుకుగాను ఆర్థిక వ్యవస్థ ప్రాతిపదికలో సూత్రాలను త్రోసి పుచ్చరాదు. అందుకు గాను ఆర్థిక వ్యవస్థలో తగినంత సరళతను ప్రవేశపెట్టాలి. పరిశ్రమల్ని పోటీపడి సమర్థవంతంగా నడపాలి. కొరతగా

ఉన్న మూలధనాన్ని సమర్థవంతంగా ఉపయోగించాలి. ఈ రెంటిమీద ఎక్కువ శ్రద్ధ చూపటము అవసరము.

## ఔద్యోగితా దృష్టి ప్రభావం

ఔద్యోగితను కాపాడాలి. ఇందుకుగాను కుటీర, గ్రామీణ, లఘు పరిశ్రమల వృద్ధికి పూర్తి ప్రోత్సాహం ఇవ్వాలి. చిన్న తరహా పరిశ్రమలలో సమర్థవంతంగా ఉత్పత్తి అయ్యే వస్తువులను భవిష్యత్తులోకూడా ఆ రంగం లోనే వృద్ధి చేసే చర్యలు తీసుకోవాలి. కాని వికేంద్రీకృత రంగంవల్ల ఏర్పడే సాంఘిక వ్యయాలను తగిన హద్దుల్లో ఉంచాలి. అందువల్ల, ఒక వస్తూత్పత్తి చిన్న తరహా పరిశ్రమలతో పాటు ఇతర తరహా పరిశ్రమలకు కూడా కేటాయించినట్లయితే, ఈ రంగాలన్ని పోటీపడి పనిచేసి లాభదాయకం కావాలి.

## ఆర్థిక సమర్థత

## సాంకేతిక విజ్ఞానం దిగుమతిలో ఉదారత

ఆదాల తరహా ముఖ్యంకాని పరిశ్రమలను వివిధ చోట్లలో ఏర్పర్చి ప్రాంతీయ సమతౌల్యాన్ని ఏర్పర్చాలి. ఇందువల్ల ఆర్థిక సామర్థ్యము ఏర్పడుతుంది. అంతేగాక సాంఘికంగా అభిలషణీయం కూడా. అయితే కొన్ని చోట్ల ఉత్పత్తి ఖర్చులమీద ఆదాల తరహాల ప్రభావం కూడా ఉంటుంది ఇటువంటి సందర్భాలలో ఆర్థిక సమర్థత లేని చిన్న పరిమాణపు ఫ్యాక్టరీలను ఏర్పర్చకూడదు. ఇప్పుడున్న ఫ్యాక్టరీలను విస్తృత పర్చడానికి మాత్రమే ఆధిక్యత నివ్వాలి. దిగుమతులపై ఆధారపడే ఉత్పాదన శక్తుల విషయంలో ఈ ఆధిక్యతకు మరింత ప్రాధాన్యత ఉన్నది. సాంకేతిక స్వయం నిర్భరతను సాధించడానికి అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించడము అవసరము. అందువల్ల, ఎగుమతి వస్తువుల్ని తయారుచేసే కీలక పరిశ్రమల్లో ఉపయోగించడానికి అనువైన సాంకేతిక విజ్ఞానాన్ని విదేశాలనుండి దిగుమతి చేసుకోవడానికి మన దిగుమతి విధానాన్ని సరళం చేసి ఉదారమైన అనుమతిని ఇవ్వాలి.

## 1980 పారిశ్రామిక విధాన సారము

1980 జులైలో ప్రకటించిన పారిశ్రామిక విధానము ముఖ్యమైనది. ఈ ప్రకటన ముఖ్యాంశాలనిచ్చుటచూద్దాము. పరిశ్రమల్లో ఉన్న ఉత్పాదక శక్తిని అభిలషణీయమైన రీతిలో ఉపయోగించాలి. తద్వారా పారిశ్రామిక రంగంలో ఉత్పాదకతను, సామర్థ్యాన్ని పెంచాలి. సాంకేతికాభివృద్ధి వల్ల, శ్రామిక ఉత్పాదకతవల్ల పెరిగిన ఉత్పాదన శక్తిని గుర్తించాలి. పెరిగిన శక్తులకనుసారంగా ఎండార్సు చేసి పారిశ్రామిక లైసెన్సులు ఇవ్వాలి. అతి ముఖ్యమైన రంగాలలోని పరిశ్రమలను, ఆ రంగాలతో సంబంధమున్న పరిశ్రమలను, దీర్ఘకాలీనంగా ఎగుమతి వస్తువులు తయారుచేసే పరిశ్రమలను ఏ ఆటంకాలు రానివ్వకుండా వృద్ధిచెందనివ్వాలి. పురోగామిక సాంకేతిక విజ్ఞానాన్ని ప్రవేశపెట్టాలి. అభిలషణీయమైన రీతిలో ఇంధనాన్ని ఉపయోగించే ప్రక్రియలతో పనిచేయించాలి. ఆర్థిక ఆదాలను సాధించగల్గడానికి తోడ్పడే ఉత్పాదన శక్తులను ప్రవేశపెట్టాలి. ఎగుమతులకుపయోగించే పరిశ్రమల స్థాపనకు ప్రత్యేక ప్రాధాన్యతనివ్వాలి. జాతీయ, అంతర్జాతీయ రంగాలలో వచ్చే మార్పుల ఛాలెంజిని ఎదుర్కోవడానికి పారిశ్రామిక విధానంలోని ఆచరణ భాగాలను నిరంతరం సమీక్షిస్తూ ఉండాలి.

## గట్టెక్కించగల అవకాశాలు

అవస్థాపన రంగం గట్టిగా పని చేయుటం అవసరము. బొగ్గు, విద్యుచ్ఛక్తి, రైల్వే పరిశ్రమలు బాగా పనిచేసినపుడే పారిశ్రామికవృద్ధి సాధ్యమవుతుంది. (1) అవస్థాపన వ్యవస్థమీద శ్రద్ధ పూనడంవల్ల (2) 1980–81 ద్వితీయార్థంలో వచ్చిన మార్పుల వల్ల (3) బొగ్గు, విద్యుచ్ఛక్తి,

రైల్వే రంగాలమీద పెట్టుబడి చేసే పెద్ద మొత్తాలవల్ల పారిశ్రామికాభివృద్ధి మార్గం నుండి ఆటంకాలు చాలవరకు తొలగగలవని ఆశించవచ్చును. అటువంటి అనుకూలత ఏర్పడినట్లయితే ఆరవ ప్రణాళిక ఉత్పత్తి రంగంలో సాధించనెంచిన లక్ష్యాలకు ఉత్పాదన శక్తి కొంత అనే ఆటంకము రాదు. (1) గతంలో సాధించిన ఉత్పాదన శక్తి ఉపయోగితా స్థాయిలను (2) నెలకొన్న ఉత్పాదనశక్తి స్థాయిని (3) వినియోగించబడుతున్న ఉత్పాదన శక్తి స్థాయిని గణనలోకి తీసుకుంటే ఆరవ ప్రణాళిక లక్ష్యాలు సాధించబడతాయని చెప్పవచ్చు. పబ్లిక్ రంగం పెట్టుబడి పెరుగుతోంది. వ్యవసాయ రంగంలో వస్తున్న వృద్ధి ఆశాజనకంగా ఉన్నది. అవి, ముందూహిస్తున్న పారిశ్రామికోత్పత్తి లక్ష్యాల సాధన మార్గానికి డిమాండ్‌ను ఆటంకరంగా నిలబడనీయబోవచ్చును.

## చిన్న పరిశ్రమల ప్రముఖపాత్ర వాటి అభివృద్ధికి చర్యలు

జాతీయాభివృద్ధి వ్యూహంలో గ్రామీణ చిన్న తరహా పరిశ్రమలు ప్రముఖమైన పాత్రను నిర్వహించాలి. వాటి "మూలధన-ఉత్పత్తి" నిష్పత్తి అనుకూలమైనది. సాంద్రత గల ఔద్యోగితను ఏర్పర్చగలవు. గ్రామీణ, చిన్న తరహా పరిశ్రమలు అనుకూలమైన ఆశయాలు సాధించడానికి ఈ కార్యక్రమాలు అమలు జరుపబడాలి. (1) నైపుణ్యాలను, సాంకేతిక విజ్ఞానాన్ని మెరుగు పర్చే చర్యలు తీసుకోవాలి. ఉత్పత్తి దారుని కనుగుణ్యమైన విపణివీధి సౌకర్యాన్నేర్పర్చాలి. తద్వారా చేతి పనివారల ఉత్పత్తి స్థాయిలలోను, ఆర్జనలలోను మెరుగుదలరావాలి. (2) విస్తరణ, వికేంద్రీకరణలు ప్రాతిపదికగా అదనపు ఔద్యోగితావకాశాలు కల్పించబడాలి. (3) ఏర్పర్చిన ఉత్పాదన శక్తిని పూర్తిగా ఉపయోగించేటట్లు చెయ్యాలి. తద్వారా గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలలోని తయారీ రంగంలో అర్థవంతమైన వృద్ధి రావడానికి దోహదం చెయ్యాలి. (4) తగిన శిక్షణను సమకూర్చాలి. ప్రోత్సాహాల సముదాయాలను అందించాలి. తద్వారా విశాలమైన ఉద్యమ ప్రాతిపదికను ఏర్పర్చాలి. (5) లాభసాటిగా పనిచేయగల గ్రామీణ, చిన్న పరిశ్రమలను ఏర్పర్చాలి. తదుపరి నెమ్మదిగా సబ్సిడీలను తగ్గించవచ్చు. (6) గ్రామీణ, చిన్న పరిశ్రమలు తయారు చేసే వస్తువుల ఎగుమతులు విస్తృతమయ్యే ప్రయత్నాలు చెయ్యాలి.

## గ్రామీణ పరిశ్రమల అభివృద్ధికి విధానాలు

ఆరవ ప్రణాళికలో గ్రామీణ, లఘు పరిశ్రమలను అభివృద్ధి పర్చే కార్యక్రమాలకు ఈ క్రింది విధానాలు తోడ్పడగలవు. (1) ఇతర రంగానికి సంబంధించిన ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలను పరిశ్రమ అభివృద్ధి కార్యక్రమాలతో కలపాలి. తద్వారా గుచ్ఛాభివృద్ధి మార్గాన్ని ఏర్పర్చాలి. సాంప్రదాయక పరిశ్రమల విషయంలో ఈ పని ముఖ్యంగా జరగాలి. (2) వ్యవస్థాగత ప్రాతిపదికను జిల్లాస్థాయిలో పునర్వ్యవస్థీకరించి సమర్థవంతంగాను, ప్రయోజనదాయకంగాను పనిచెయ్యించాలి. (3)అనుగుణ సాంకేతిక విజ్ఞానాన్ని;నైపుణ్యాలను అభివృద్ధిచెయ్యాలి.తదుపరిసమర్థవంతంగా, వాటిని విస్తృతంచేసి లఘుపరిశ్రమలకు సంక్రమింపచెయ్యాలి. (4) కీలకముడి పదార్థాల బఫర్‌స్టాకులను ఏర్పర్చి, ముడిపదార్థాలను గ్రామీణా లఘుపరిశ్రమలకు హెచ్చుగా అందించాలి. (5) చేతిపనులవారికి, గ్రామీణ పరిశ్రలకు, అతిచిన్న యూనిట్లకు సహేతుకమైన వడ్డీమీద రుణాలను ఇప్పించాలి. (6) దేశంలోను, విదేశాలలోను ఉత్పత్తిదారునకు అనుకూలంగా వుండే విపణి వీధి సౌకర్యాలను ఏర్పర్చాలి. (7) కొన్ని వస్తువులను ఉత్పత్తి చేసే హక్కు కుటీర, లఘుపరిశ్రమలకు మాత్రమే ఇవ్వాలి. ఆ పరిశ్రమలనుండి మాత్రమే కొనుగోలుదారు ఆ వస్తువులను కొనే విధిని ఎంపిక రీతిలో ఏర్పర్చాలి. (8) అనుషంగిక

పరిశ్రమలను సమర్థవంతంగా వ్యవస్థాపించాలి. (9) కుటీర పరిశ్రమలకు అతి చిన్న పారిశ్రామిక యూనిట్లకు సహకార వ్యవస్థను ఏర్పర్చి బలపర్చి, విస్తృత పర్చాలి. (10) తగిన విధానాన్ని ఏర్పర్చడానికి, మదింపు చేయడానికి తోడ్ప డేందుకు తగిన సమాచార దత్తాంశ ప్రాతిపదికను ఏర్ప ర్చాలి.

పరిశ్రమలు ఔద్యోగితను, వస్తువులను, వేతనాలను ఆదాయాలను యిచ్చి ఆర్థిక సంక్షేమానికి తోడ్పడగలవు. ఆర్థికాభివృద్ధి ప్రక్రియ ప్రారంభంలో, గ్రామీణ జనాభా ప్రాధాన్యత గల భారతదేశంలో, బహుజన సంబంధమైన భూముల ద్వారా పెట్టుబడి ధనాన్ని సమకూర్చడానికి వ్యవ సాయ రంగాన్ని అభివృద్ధి చేయడం అవసరమే. అందువల్ల కొంత ఆర్థిక వికాసం జరిగిన పిదప, తగిన పరిశ్రమలు లేనిదే ఆర్థిక రంగాలలో ఏదీకూడా అభిలషణీయమైన రీతిలో వికసించలేదు. ఆర్థిక పురోగమనంలో వివిధ రంగాలకు పెట్టుబడి వస్తువులను (యంత్రాలను) అందించడానికి మూలధన వస్తువులు ప్రధానంగా కావాలి. వీటిని అందించే పారిశ్రామికీకరణ అతి ప్రధానమైనది. వికేంద్రీకరణను, చిన్న తరహా, కుటీర పరిశ్రమలను అంగీకరించినా వీటికి చిన్న యంత్రాలను అందించే పరిశ్రమలను స్థాపించక తప్పదు. 75 శాతం ప్రజలు గ్రామాల్లో ఉన్నప్పుడు, పట్ట ణాలు కొంత వరకు అభివృద్ధి చెందినాయి కాబట్టి, ఇప్పట్లో భారత ఆర్థికాభివృద్ధి గ్రామీణ ఆర్థికాభివృద్ధి కావాలి. అందుకు వివిధరకాల గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి అగినంత గాను, వేగంగాను జరగాలి. అప్పుడే భారతదేశంలో సమగ్ర మానవ సంక్షేమం సాధ్యం.



# ఎదుగు

ఈ జీవిత శైలంపై నిల్చి,
గతమనే నేలపైకి అనుభవాల దృష్టిని సారిస్తే,
నేను సాధించా ననుకున్న ఘనకార్యాలన్నీ
చిట్టి చీముల్లా, దోమల్లా, నలుసుల్లా,
కనిపిస్తోన్నాయ్ !
కట్టుకున్న మేడలన్నీ పిచ్చుక గూళ్ళలా,
అగపడుతున్నాయ్!
వర్తమానం శిఖరాగ్రమై గ్రుచ్చుకుంటోంది!

భవిష్యత్తనే ఆకాశంలోకి చూస్తే,
కళ్ళు తిరుగుతున్నాయి.
వెండి మబ్బులు,బంగారు చంద్రుడు,రతనాల చుక్కలు
కనిపించడం లేదు.
యదార్థంలా నిలిచిన సూర్యుడు
కళ్ళనిండా వెలుతురు నింపి
చీకటి చేసేస్తున్నాడు.

# శిలువ

కష్ట సుఖాలని కావడిలో మోస్తూ,
బ్రతుకు భారాన్ని ఈడుస్తోన్న
ఈ మనిషే ఒక శిలువ !

ఒక క్రీస్తే కాదు—
ప్రతి జీవితం వేయబడేంది శిలువ !

శ్రీ గన్ను కృష్ణమూర్తి.



# జల

## శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

"కస్త్వం? కో౽హం; కుత ఆయాతః" అని ప్రశ్నించుకుంటూ
జవాబు దొరుకుతుందేమోనని—
అంతర్ముఖుడనై నాగుండెను నేను చూసుకున్నాను.
ఊహాతందని యుగాలనాటినుంచీ
ఎవ్వరూ నివసించని రాతినేలలా;
రక్తసముద్ర పరివృతమైన దీవిలా కనిపించింది.
త్రుళ్లిపడ్డాను!
ఈ "రాతినేల" నాలో ఎందుకు పొదగబడినట్లు?
పూలచెట్లు లేనేలేవు—
కనీసం పచ్చని గరిక కూడా మొలవదే!
గిరికీలు కొట్టే పాలపిట్టలు అసలే లేవు—
రేడియమ్ అక్షరాల్లాంటి మిణుగురులైనా ఎగురవే!
ఏదో జిజ్ఞాస—
రాతినేలలా నాలో పడిఉన్న గుండె అట్టడుగున
ఏ రహస్యమో దాగి ఉంది.
దాన్ని త్రవ్వుకుంటూ పోతే—పరమార్థం లభిస్తుంది!
ఒక్కొక్క పొరనూ చీల్చుకుంటూ
అనిమేషంగా సమీక్షిస్తున్నాను.
మృణ్మయపాత్రలు; శల్యావశేషాలు;
ఏవేవో శాసనాలు; నాణాలు;
తాళపత్ర గ్రంథాలు; యజ్ఞఘోషలు;
మత విద్వేషాలు; యుద్ధాలు....
ఇంతలోతుగా త్రవ్వినా ఇవ్వే!
వీటిని గూర్చి నా చదువులే చెప్పాయి,
పురావస్తు ప్రదర్శనశాలలే నిరూపించాయి.
ఇంతేనా..గుండెలోతు? — ఇంకా ఉందే!
నా తరంకాదు త్రవ్వటం-కొంత విశ్రాంతి కావాల్సిందే!

బృహత్ప్రశ్నల అరణ్యాల్లోంచి;
చరిత్రల ఎడారుల నుంచి—
ఒక్కసారి లోకాన్ని చూద్దామని బయటపడ్డాను.
'రోడ్డుమీద అడుగు పెట్టానో లేదో—
ఆకలితో "దళసరి కాగితాల్ని" తింటున్న యువకులు కనిపించారు;
పదేళ్ళ పసివాడు పదిపైసల కూలికోసం
బండరాళ్లు మోస్తూ కనిపించాడు—
క్షీరసనభారం వాడి లేతవెన్నును
నిర్దాక్షిణ్యంగా విరిచేస్తోంది!
ఇంకా ముందుకు పోగా...పోగా...
చిరునవ్వుల గోముఖాలు తగిలించుకున్న
స్వార్థవ్యాఘ్రాలు కనిపించాయి;
దురహంకారాల మదపుటేనుగుల కాళ్ళ క్రింద
దారుణంగా నలిగిపోతున్న "కూలిచీమ"లు కనిపించాయి.

....ఇప్పుడు సగం త్రవ్వబడిన నాగుండెలో
ఏదో కదలిక!
పరాత్పరా! పూర్వాయుగాల విషాదాన్ని
సముద్రరూపంలో లోకానికి మూడు వైపులా నింపేసి
ఈ యుగ విషాదాన్ని నాలుగో వైపునింపుతావా!....
నాలో పెద్దశబ్దంతో ఏ సత్యమో బ్రద్దలయింది—
ఆపటానికి శక్యంకాని "జల"
రాతిగుండెలోంచి కళ్ళద్వారా నేలమీదికి దూకింది.
నా తల్లి; ధరిత్రి-ఆకుపచ్చగా నవ్వుతూ
ఆప్యాయంగా నన్ను తన అక్కునచేర్చుకుంది!



# క ల గూ ర గ ం ప

## ఆంధ్ర భాషార్ణవకర్త ఎవరు

ఆంధ్ర భాషార్ణవ మనునది తెలుగు భాషకు - సంస్కృతభాషకమరమువంటిది అమరభాషకమరకోశమెప్పు గిది యుపయోగకరమో ఆంధ్రభాషార్ణవము ఆంధ్ర భాష కంతటి యుపయోగకరము. ఇది పర్యాయపద నిఘంటువు కావున కావలసిన పేళ్ళను వెదకుకొనుటకు ఈ పేళ్ళెచ్చట నుండునని తెలిసికొని సులభముగ నెఱుంగుటకు ననుకూలముగ నమర కోశము ననుసరించి అట్లే మూడు కాండములు అవియే వర్గలు పెట్టి రచితమైనది. కాన దీనికి ఆంధ్రామర మని ప్రసిద్ధి కలిగినది. బహు చక్కని నిఘంటువు. ఇది పలు తావుల పలు ముద్రాశాలలలో పలువురు పండితులచేత పరిష్కృతమై పలుమారు అచ్చయినది. కోట వేంకనార్య విరచితము. నేను మూడు ప్రెస్సులలో అచ్చయి దీని మాతృకలను చూచి చదివియున్నాను. నాయెఱింగి నంతలో నిది మొట్టమొదట విశాఖపట్టణములో మహా మహోపాధ్యాయ శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యు లయ్యవారలం గారిచే అర్ష ముద్రాశాలలో నచ్చయినది. 1916 వ సంవత్సరములో ముద్రించిన వారి క్యాటలాగ్‌లో 14వ పుటలో నిఘంటువులు అను శీర్షిక క్రింద "ఆంధ్రభాషార్ణవము. ఇది కోటి వెంకన కవి ప్రణీతము. తెలుగు నిఘంటువు లన్నిటిలోను గొప్పది. తెనుగునకు అమరకోశము వంటిది. అమరకోశమునందువలె కాండములు వర్గములు అన్నియు కలవు. దీనిలో క్రియావర్గ మొకటి అధికము. రు ౦-౮-౦,, అని యున్నది. విశాఖపట్టణములోనే వి. అప్పలనరసింహముగారి శారదా ముకుట ముద్రాక్షరశాల క్యాటలాగులో గ్రంథ నామమువద్ద రచయిత నామము లేదు కాని గ్రంథోపయోగము మాత్రము తెలిపి దాని అప్పటి ఖరీదు వేసియున్న యది. చెన్నపురియందు శ్రీవావిళ్ళ ప్రెస్సులో 1931 సంవత్సరములో నచ్చయినది నే డంద తెఱింగి యున్నారు. అన్నిటిలోను కోటి వేంకనార్యరచిత మనియే యున్నది. ఇది యిట్లుండ 1966వ సంవత్సరమున ఏలూరు పట్టణమునందు వెంకట్రామ అండ్ కో అధ్యక్షుల వారైన శ్రీయుతులు ఈపం వెంకట్రావు పంతులవారిచే ముద్రించి ప్రచురించఁబడిన శిరోమణి శ్రీమాన్ చలమచర్ల రంగాచార్యుల (రీడర్, తెలుగుశాఖ ఉస్మానియా విశ్వ విద్యాలయము) వారిచే సంకలితమైన ఆంధ్రశబ్ద రత్నాకర మనెడు అకారాది వర్ణక్రమబద్ధమైన పెద్ద నిఘంటువులో అవ తారికలో 31వ పుటలో "4 ఆంధ్రభాషార్ణవము. నుదురు పాటి వేంకటకవి ఆంధ్రభాషార్ణవమును రచించెను. ఈతఁడు పుదుక్కోటసంస్థానమునం దుండిన విద్వత్కవి పదునెనిమి దవ శతాబ్ది తృతీయ పాదమునకు చెందినవాఁడు. దీనికే ఆంధ్రామర మని ప్రసిద్ధి" అని యున్నది. మఱియు నందే 74వ పుటలో "ఉపజీవ్య గ్రంథములు" అను శీర్షిక క్రింద ఆంధ్రభాషార్ణవము (పేరు)కు ఎదురుగ గ్రంథకర్తల పేళ్ళ దొంతిలో "నుదురుపాటి వేంకట కవి" అనియే యున్నది. మొత్తము మీఁద ఈయాచార్యులవారి సదరు నిఘంటువులో ఆంధ్రభాషార్ణవము నుదురుపాటి వేంకటకవి రచితమే యని తెలుపఁబడినది. దీనికి తోఁడు ఇంతకుముందే చాల యేండ్ల నాఁడు ముద్రితమయిన "లక్ష్మీనారాయణీయము" మనెడు శుద్ధాంధ్ర ప్రతిపదార్థ పర్యాయపద నిఘంటువు (ఇదియు అకారాది వర్ణక్రమకోశమే) నందు "పదాంతములందుఁ గనుపడు నిఘంటువుల సంకేతాక్షరాది వివరణ పట్టిక"లో పద్య నిఘంటువులయు తన్నిర్మాతలయు నామములు అను విషయములో మొట్టమొదటి భా-ఆంధ్రభాషార్ణవము. కోటి వెంకనార్యుఁడు లేక పార్వతీ పరిణయము కట్టిన నుదురు పాటి వెంకనార్యుఁడు. ఇందు ప్రథమ ద్వితీయ తృతీయ కాండములును పద్య సంఖ్యలును గలవు" అని కలదు. ఇట్టి వ్రాఁత వలన ఈ నిఘంటు రచయితగారు చదివిన ఆంధ్ర భాషార్ణవములలో తత్ప్రణేత కోటి వెంక నార్యుఁడని యున్నదనియు, చదివిన పార్వతీ పరిణయ గ్రంథములో నుదురుపాటి వెంకనార్యుఁ డని యునున్న

సంగతిని చదివి గ్రహించి ఆ విషయమును తెలిపి రనియుఁ దెలియనై యున్నది. దీని వలన ఆంధ్రభాషార్ణవము నుదురుపాటి వెంకనార్యప్రణీత మని పార్వతీ పరిణయమునందు కలదని గ్రహింపఁగలిగితిమి. లక్ష్మీనారాయణీయములో నింతమాత్రమున్నది. కాని అందు సదరు కోశము నందలి విభాగాది నామములు తెలుపఁబడి యుండ లేదు. శ్రీ పరవస్తు వారి కేటలాగ్‌లోనే కొంత విరివిగ తెలుపఁబడియున్నది. చెన్నపట్టణములో 1331 వ సంవత్సరము నందు వావిళ్ళవా రచ్చువేసిన ఆంధ్రభాషార్ణవము నందు తొలుత పీఠికా పద్యములలో తత్కర్త కోటి వెంకనార్యుఁడు రఘునాథ భూపాలుఁడు తననుఁగుఱించి నుడివినట్లు చెప్పిన పద్యములలో కోటి"అనియుండె "నుదురుపాటి",అనియుండె యింటి పేరు చెప్పక తన పేరు మాత్రము నుడివెను. ఆ పద్యము లివి—

క ॥ ఖచరీకచకుచవిసరా। ద్విచికీర్షార్హ ప్రసన్న వీక్షణకంద
 ప్రచురరుచిఁ బెనఁగొను కచా। కచిగా నీ కవిత
 లెన్న కవి వెంకన్నా ! ౮

గీ ॥ ఆంధ్ర గీర్వాణక వనంబులందు నీకుఁ।
 గలుగు జ్ఞానం బదేరికిఁ గలుగ నేర్చు,
 నాశ్రితుఁడ వంచు నుతియింపుచునట్లు గాదు।
 గాని యవి యిపు డేల వెంకన కవీంద్ర ! ౯

శ్రీ మాన్ చెంబు వేర్లవారనినట్లు వెంకట కవి యనినను, లేక పరవస్తువారు మున్నుగాఁగలవా రనినట్లు వెంకనకవి యనినను ఎట్లనినను శ్రీ వేంకటేశ్వరస్వామివారి పేరే కనుక ఒక్కటే. కాని యింటిపేరు "కోటి" అనియా ? నుదురుపాటి, అనియా ? అని సందియము పొడముచున్నయిది.

(ఇందులో "కోటి" అనునదియో "నుదురుపాటి," అను నదియో ఏదియో ఒకటి ఇంటి పేరు (అసలుగా తెలుఁగు వారిలో అనుస్యూతముగ పెట్టుకొనబడుచుండెడునది.) ఒకటి ఆ మున పుట్టి పెరిగి స్థిరపడుకొని వచ్చిన ఊరిపేరుగ నుండ వచ్చును. అట్టి వారి పేరుకు ముందు గుర్తుకొఱకు వారు వచ్చిన యూరి పేరును పెట్టి చెప్పుట కలదుకదా ? ఉదా: "శ్రీమాన్ మాతాత (పితామహులు)గారు పుట్టిపెరిగి చదువుకొనిన చెంగల్పట్టు జిల్లాలోని కళత్తూరు అను యూరి పేరు ముందు నుడివి వారి పేరును చెప్పుట కలదుకదా ! కళత్తూరు గాఘవాచార్యులవారు" అని. కొన్ని వారి రచనలు కూడా ఇట్టి ముద్రితములైనవి. శిక్షాభాష్యము వగైరాలు.

"నుదుపాటి వెంకటకవి పుదుక్కోట సంస్థాన నివాసి" అని ఆంధ్రశబ్దరత్నాకరములో నున్నది. వావిళ్ళవారు ముద్రించిన ఆంధ్రభాషార్ణవము ప్రథమ కాండము స్వర్గ వర్గములో (మొదట) పీఠికాపద్యములు- పాండ్యమహీపాలుండైన ఇంద్ర రఘునాథరాయులు కోటి వెంకనార్యుని ప్రోత్సాహపఱచెఁ గావున ఈ ఇంద్ర రఘునాథరాయలే పుదుక్కోట సంస్థానాధిపతి యనుకొనిన సరిపోవును కాని కవియొక్క యింటిపేరు (కోట–నుదురుపాటి)అనియా అని సందేహకరముగానే యున్నది. లక్ష్మీనారాయణీయమును బట్టి చూచినచో కోటి వెంకనార్యుఁడు, నుదురుపాటి వెంకట కవి వేరు వేరు వ్యక్తులని తోచుచున్నది. ఆంధ్రభాషార్ణవమును పేరుతో నీయిరువురు కవివరులు వేరువేరుగ రెండు నిఘంటువులను రచించినారా? ఆంధ్రభాషార్ణవము అచ్చుప్రతులు దొరకుచున్నవి. కాని పార్వతీ పరిణయపు ముద్రిత గ్రంథములు ఎచ్చటను కానరావు. అసలు అచ్చుపడినదో కాలేదో తెలియదు.

---

ఆంధ్రభాషార్ణవము ప్రథమకాండము స్వర్గవర్గము మొదట పీఠికా పద్యములలో "ర. ఖాది సైలింప కుంభ స్తనీమణుల్ ...." ఇత్యాది 14వ సీసపద్యము, క॥ అతఁడొకనాఁ డొకమానవ। సతిని వరించెను। దదీయ సౌందర్యంబు ద్భుత మగుఁ గద యా యింతికి। సుతులంతటఁ గలిగి రతుల సుగుణాన్వితులై, 15. అను పద్యములనుబట్టి నే నిచ్చట రఘునాథ రాయలుకు ముందు ఇంద్ర అని చేర్చి చెప్పితిని.

తెలిసినవారు ఆంధ్రభాషార్ణవ కర్త కోటి వేంక నార్యుఁడో లేక నుదురుపాటి వేంకట కవియో లేక కోగ వెంకనార్యుఁడును, నుదురుపాటి వేంకట కవియు నొక్క డేనా ! అయ్యిగనేని ఇంటిపేరు నేరుగనుద్భవ కారణమును "భారతి" మూలమునఁ బ్రజలకుఁ దెలుపుచు లేఖామూలమున (జాబు వ్రాసి నాకుఁ బ్రత్యేకముగఁ దెలుపఁ గోరెదను.

భాషా సేవకఁడు

విక్రాల శేషాచార్యులు

కలికి వాయు పోస్టు

(వయా) సింగరాయకొండ

ప్రకాశం జిల్లా.

# నిగమశర్మోపాఖ్యానము రామకృష్ణుని హృదయము

శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారు "నిగమశర్మఅక్క - పరమ పద సోపానము" అను వ్యాసమునందు (భారతి - జూన్, 1980) తెనాలి రామకృష్ణ కవి హాస్యప్రియుఁడగుట వలన అతని కవిత్వమునహాస్యముండునని తలచి, రాళ్ళపల్లి వారు తమ, నిగమ శర్మ అక్క అను వ్యాసమునకు చివర "పరిహాసము పవిత్ర వస్తువును కూడ గమనింపదేమో" అని వ్రాసినారనియు, అట్లను కొనినచో రామకృష్ణుని హృదయము చిక్కదేమో అనుటకు "నిగమశర్మఅక్క" వృత్తాంతము ఉదాహరణము అనియు అనుచుతాము "నిగమశర్మోపాఖ్యానము" లోదర్శించిన రామకృష్ణహృదయము నావిష్కరించుటకు ప్రయత్నించినారు. ఆ ప్రయత్నములోని అసామంజస్యమును శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు (భారతి - 1981 ఫిబ్రవరి) "నిగమశర్మఅక్క - ఒక పరిశీలన" అను "వ్యాసము వ కొంతవరకు చూపించుటకు ప్రయత్నించినారు శాస్త్రిగారు చూపినవేకాక ఇంకను కొన్ని అవక తవకల పునాదుల మీద రావుగారు తమ వ్యాసహర్మ్యమును నిర్మించుటకు ప్రయత్నించినారని వివరించుటయే నా ప్రధానాశయము.

శ్రీ తిరుమలరావుగారు "పరమపదప్రాప్తికి సోపాన సిద్ధాంతమును ప్రతిపాదించిన శ్రీ వైష్ణవాచార్యుఁడును, ఆ సోపానము నెక్కిపోయిన మన కావ్యనాయకుడును ఒక పేరు "నిగమ" కలవారగుట యాదృచ్ఛికముకాదు. రామకృష్ణుడ వే వనిగ కథానాయకునికా పేరు పెట్టెను. నిగమ శర్మను రక్షించిన కాపు అతనిని "దేశికోత్తమునిగా" భావించి కొలచి నట్లు రామకృష్ణుడు వర్ణించినాడు. ఇందు నిగమాంతదేశికుల స్ఫురణ ఉన్నది" అని వ్రాసినారు రావుగారు "నిగమశర్మోపాఖ్యానము" ను ఆంగ్లములోని "పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్" వంటి సంకేతకావ్యముగా చిత్రించుటకు దానిలోని ఈ రెండు మాటలే ఆధారము. ఈ రెండు మాటలు కలసిన "నిగమ దేశికోత్తమ" శబ్దమేర్పడును కాని "నిగమాంత దేశిక" శబ్దమేర్పడదు. నిగమాంత దేశిక శబ్దములోని "అంత" ఇచ్చట అంతర్హితమైయున్నది ! రామకృష్ణుడే పాండురంగ మాహాత్మ్యమున ద్వితీయాశ్వాసములో పుండరీక మహాముని చరిత్రము" లోని పుండరీకుని వర్ణనలో "నిగమ ఘంటావతైకాధ్వసీన బుద్ధి" (6వ పద్యము) అనియు "హాహయ దేశికా భుజగునమ్మహిద్రై వతమౌళి" (7వ పద్యము) అనియు, అతనిని వర్ణించినాడు, ఇచ్చట నిగమ దేశిక శబ్దములే కాక నిగమాంత దేశికులను స్ఫురణకు తెచ్చు 'ఘంటా' శబ్దముకూడ ఉన్నది. నిగమాంతదేశికులవారు శ్రీరంగనాథుని ఘంటావతారము అని శ్రీవైష్ణవుల నమ్మకము. కాన ఇచ్చట కూడ రావుగారి చొప్పున మరియొక "పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్" ఉండవలయును కదా! ఉన్నదా? ఉన్నచో, అది ఏది ?

"నిగమశర్మ తుది ఘడియలు వచ్చినప్పుడు నృసింహ క్షేత్రములో ఆక్రోశించి, విష్ణుసాయుజ్యమును చెందుట కావ్యపరమార్థము. ఈ ఫలప్రాప్తికి కావ్యమందలి ప్రతి విషయమును దోహదము చేయవలయును. సహాయము చేయువారు మంచివారనియు, నిరోధించువారు చెడ్డవారనియు సిద్ధాంతము. ఈ ప్రాతిపదికపైననే నా చర్చ

సాగింతును, అన్నారు రావుగారు. వీరు తను చర్చకు వేసికొన్న ప్రాతిపదిక ఎంతవరకు సమంజసమో మొట్టమొదట చర్చింపవలెను. నిగమశర్మ విష్ణుసాయుజ్యమును పొందబోవునని కవికి తెలియును. చదువరులకు తెలియును. కథానాయకుడైన నిగమశర్మకు తెలియునా? తెలియునని సూచించుటకైనను అవకాశము కలుగునట్లు కవి మనకు నిగమశర్మ మాటలలో సూచించినాడా? కవి నిగమశర్మ విషయములో పారకామికుల ప్రసక్తిని వర్ణించినాడే కాని ముక్తికామినిపై అతనికి కల అనురక్తిని ఎచ్చటను ప్రస్తావించలేదు. అతనికి ముక్తిచింత రవంతయు లేదని కావ్యమును పఠించు వారికే తేటతెల్లము. అతడు శిశ్నోదర, దురోదర పరాయణుడై, ఆస్తిని కరగదీయు చున్నాడు. "ఎన్ని జన్మంబు లేనియు చెప్ప వినని, కాని ప్రాపింపరానిధరానిలింపజాతి"ని "పాలవంటి కొలంబును"ను పాడుచేసి, పతితుడై పోవుచున్నాడు. "నింగివేల్పుల నేలకు, నేలవేల్పు కొలము నింగికి తెచ్చుచు" తన్ను వడసిన తల్లిదండ్రులను "అవలు కడలింబడి సుడివడు"నట్లు చేయుచున్నాడు. తల్లిదండ్రులకు, ఇతర గురుజనులకు అతనిని సరిదిద్దుట సాధ్యము కాకపోయినది. అప్పుడు నిగమశర్మ అక్క వచ్చి అతనిని సన్మార్గవర్తిగా చేయుటకు ప్రయత్నించినది. నిగమశర్మ జీవితమున "అనుద్దిష్ట ప్రయోజనుడు" (పాండురంగ మాహాత్మ్యము-తృతీయాశ్వాసము-వచనము - 107) రామకృష్ణుడే ఒకచోట అన్నట్లు వాడేమి కానున్న వాడో మీద? జీవితమున అనుద్దిష్టప్రయోజనుడైన నిగమశర్మ కట్టకడపటివరకును కలలో కూడ కాంక్షించని, వాంఛించని, ఎఱుంగని - ముక్తి ప్రాప్తి- అతని అక్కకు తెలియునని వాదించుట వాదము కాదు- ఉన్మాదము! కాన నిగమశర్మ ముక్తి ప్రాప్తికి సహాయము చేయువారు మంచివారనియు, అడ్డుపడువారు చెడ్డవారనియు రావుగారు వేసికొన్న ప్రాతిపదికయే లోపభూయిష్ఠము - హేతువాద భ్రష్టము!

పై లోపభూయిష్ఠమును, హేతువాదభ్రష్టమును అయిన ప్రాతిపదికపై చర్చను కొనసాగించ ప్రయత్నము చేసిన రావుగారు నిగమశర్మ అక్కను స్వార్థపరురాలని నిందించుచు అంతతో పోకుండ, ఆమెను ఆసురీశక్తులైన మారుడు, సైతాను మొదలగువారి వరుసలో నిలబెట్టినారు. వెలంది వెన్నెలవంటి వెలందిని తిమిరనిబిడమైన అనువన నిశిగా చిత్రించినారు! ఇది అన్యాయమే కాదు; దురన్యాయము కూడ! తమ్ముడు ముక్తికామిని యందనురక్తి కలవాడని తెలిసియును అక్క, అతనిని కుటుంబ బాంధవుల మధ్య మానవునిగా చేయుటకు ప్రయత్నించియుండినచో ఆమెను మనము స్వార్థపరురాలనవలసినదే. కాని, ఆమె కలలో కూడ నిగమశర్మ ముక్తి యాత్రికుడని ఎఱుగదు. దురభ్యాసము లకు బానిసయై, దురితపంకమున పొరలాడుచున్న అనుంగు తమ్ముని నిండు మనస్సుతో స్వధర్మప్రవర్తకునిగా నొనర్చుటకు ప్రయత్నించినది. ఇందులో ఆమెను స్వార్థపరురాలనుటలో అర్థము మృగ్యము!

రావుగారు నిగమశర్మ అక్కకు ఆసురీశక్తుల వరుసలో ఆసనమిచ్చి అవమానించుటయే కాక, పరమ నీచుడును, పతితుడును అయిన నిగమశర్మను ధర్మ సంస్థాపనార్థమును, లోక సంగ్రహార్థమును అవతరించిన మహనీయులును, మహాత్ములును, మానవోత్తములును అయిన సిద్ధార్థ జీసస్‌ల వరుసలో కూర్చుండబెట్టి గౌరవించినారు! శిశ్నోదర దురోదర పరాయణుడగు నిగమశర్మ ఎక్కడ? విశ్వకల్యాణమునకై నశ్వర సుఖములను త్యజించిన సిద్ధార్థ జీసస్‌లెక్కడ? నక్క ఎక్కడ? నాకలోకమెక్కడ? సిద్ధార్థజీసస్‌లు పుట్టుకతోనే మహాత్ములు. వారి జీవితోద్దేశములు వారికి తెలియును. లోకకంటకులైన ఆసురీశక్తులు వారిని విషయసుఖోన్ముఖులుగా చేయుటకు సర్వ విధముల ప్రయత్నించినవి. విఫలములైనవి. నిగమశర్మ ఎవరి కల్యాణమునకై జనించినాడు? పోనీ, చివరకు, తన ముక్తి కోసమైనను తాను ప్రయత్నించినాడా? కథలో నిగమశర్మ ముక్తిపొంది, విష్ణుపార్శ్వచరులు ఎనమండుగురిలో ఒకడయినంత మాత్రమున అతడు మహామానవుడు కాడు; పురుషోత్తముడు కాడు. అతని

ముక్తి యాదృచ్ఛికమే కాని ప్రయత్న ప్రాప్తము కాదు. పూర్వజన్మ సుకృతమువలన నృసింహక్షేత్రమున మరణించి నందున నిగమశర్మ ముక్తి నంద వచ్చును. హరికి మాన నీయత వహించవచ్చును. కాని మానవుల కాదర్శప్రాయుడు కాడు. సిద్ధార్థుడు, జీసస్ క్రైస్తును మానవుల కాదర్శ ప్రాయులు. కాని నిరుపమానులైన పరమపురుషులగు వారితో నేతిబీరకాయవంటి నిగమశర్మను పోల్చుట యుక్తిగా కానగదు. అందువలన నిగమశర్మ అక్క అతనిని ముక్తి యాత్రాపథమునుండి మరలించి, సంసారకూపమున పడ వేయుటకు ప్రయత్నించిన "మారి" యనుట- ఘోరమైన అపరాధము!

రావుగారు నిగమశర్మోపాఖ్యానములో రామకృష్ణుడు ప్రతి పాదించినాడని భ్రమించిన పరమపద సోపానమును, శ్రీవైష్ణవ ప్రపత్తిమార్గమును ప్రతిష్ఠాపన చేయువలయును. అందుకొఱకు సర్వవిధములను దుర్మార్గుడై, శిశ్నోదర దురో దర పరాయణత్వమున పరాకాష్ఠనందుకొన్న నిగమశర్మను ముముక్షువుగాను, అతి సుకుమారియు, అమృతహృదయము, అమాయకురాలును అయిన నిగమశర్మ అక్కను స్వార్థపరు రాలిగను, మారిగను, సైతానుగను, ఘోరిసర్పిగను తారు మారు చేసినారు! జాగ్రత్తగా ఆలోచించినచో, ఇచ్చట స్వార్థమన్నది ఉన్నది నిగమశర్మ అక్కలో కాదు; ఆమెను తమ విమర్శనా పటుత్వమును, అద్భుతదర్శనమును ప్రద ర్శించుటకై బలిపశువుగా దుర్వినియోగపరచుకొనిన రావు గారిలో!

నిగమశర్మోపాఖ్యానమును "వైకుంఠపాళి" ఆట అని చెప్పుచు రావుగారు ముముక్షువైన నిగమశర్మ పారమార్థిక ఖేలనములో కాపువడతి, మాలెత- నిచ్చెనలన్నారు. నిగమ శర్మ భార్యను పామన్నారు. రావుగారి చొప్పున నిగమ శర్మ అగ్నిసాక్షిగా పెండ్లియాడిన ఇల్లాలు-పాము! అతనితో లేచి వచ్చిన కాపువడతియు, కాపువడతి చనిపోయిన తరువాత కామసంతృప్తికై అతడు కూడుకొన్న మాలెతయు-నిచ్చె నలు! తర్కమన్న ఇట్లుండ లేదు. ముముక్షువునకు సంసారము త్యాజ్యమట. సంసారమన్న రావుగారి దృష్టిలో తల్లి, తండ్రి, అక్క, బావ, భార్య- వీరే! ఉంపుడుకత్తెలు, చుట్టము రాండ్రు రావుగారి దృష్టిలో పూజ్యులు! రావుగారి అభిప్రాయమున నిగమశర్మ కాపు గుబ్బెతతోను, మాలెత తోను చేసినది- సంసారము కాదు; ముక్తియాత్ర.

నిగమశర్మ "అన్న పాదకాంక్ష"తో కొన్నాళ్ళు తేనె పూసిన కత్తివలె ఉండి సమయమునకై వేచి, కుటుంబము లోని అందరి ఆభరణములను ఊచముట్టుగ దోచుకొనిపోయి నపుడు నిగమశర్మ తండ్రి, తల్లి, అక్క, బావ - వరుసగా ఒక్కొక్కరొక్కొక్క ఆభరణమును పోగొట్టుకొన్నందులకై దుఃఖించుచుండగా, రామకృష్ణుడు తన సహజ హాస్యధోరణిలో ఎంత దుర్బుద్ధి, ఎంత దుర్భ్రాంతి అహహ, సర్వధనములు నద్దురా చోరశీలు, దూచముట్టుగ నిలుదోచి యుక్తికి చనుట, ఎఱుగరో కాక ఎప్పేళ ఎఱుక గలదె? అని వెక్కిరించును. వీరు నలుగురును ఒక్కొక్క రొక్కొక్క సొమ్ము పోగొట్టు కొన్నందుకై ఏడ్చుచున్నారే, నిగమశర్మ సర్వధనములు, సర్వాభరణములు దోచికొని పోవుట వీరికి తెలియదా!

మహాకవులు కథను చెప్పునప్పుడు భవిష్యత్కథను సూచించు పదములను, పదబంధములను, అలంకారములను వాడుదురు. నిగమశర్మోపాఖ్యానమునందును రామకృష్ణు డక్కడక్కడ ఆపని చేసినాడు. మాలెతయును, పిల్లలును అగ్నికాహుతియైన తరువాత నిగమశర్మ విషమాటవిలో కూడు నీళ్ళులేక తూగుచు, తూలుచు పోవుటను "కాగలపుణ్యుడు" అయిన నిగమశర్మ వహించు దుఃఖభారంతోనేమో అన్నట్లున్న దని ఉత్ప్రేక్షించును. అనగా, ఇక నిగమశర్మ నృసింహ క్షేత్రమువైపు నడచును. అతడింక పాపములను చేయు స్థితిలో లేడు పుణ్యుడగును అని భావికథను సూచించును. నిగమశర్మ క్రిందికిపడి, మరలపైకి లేచుటను నీచమగు మేను పాటింగవైచు కరణి, పడి సరోరుహనేత్రుని పారకరుణ, అధమ లోకంబువీడి అయ్యమరపథము, చూచుటకు బోలె తను తానలేచనతడు అను పద్యములో నిగమశర్మ నీచమైన తనమేను విసర్జించి, అమరపథము చేరునని భావికథను

ఉత్ప్రేక్షమూలమున సూచించును నిగమశర్మ నృసింహ క్షేత్రమున మరణించుటకు ముందు చాల దినములు అన్నపానములు లేకుండ మనఃపూర్వకముగ పరిత్యజించుట ప్రాయోపవిష్టుడగుటను నిరూపించునని ... వేరుకాదు. (విష్ణువు) పది అవతారములను స్మరించునట్లు వర్ణన చేయును. ఈ వర్ణనము కూడ భవిష్యత్కథను సూచించుటకు చేసినదియే కాని అతని నిలువెల్ల విష్ణుతత్త్వము ఆవరించుట వలన కాదు. రావుగారు ఉత్ప్రేక్షలను వాస్తవములుగా భ్రమించుట వారికి తమ దర్శనమును ప్రదర్శించుటలో కల పేరాసయే గాని – వేరుకాదు.

నిగమశర్మ పతితుడు కావలెను; అధఃపతితుడు కావలెను' శరణాగతి చొరవలెను అని వ్రాసినారు రావుగారు. విష్ణుకృపాస్రోతస్విని పతితుడైన నిగమశర్మమీద ప్రవహించినది కాన ప్రతివ్యక్తియు విష్ణుకృపాపాత్రుడు కావలయునన్న పతితుడు కావలయునని యే వీరు సిద్ధాంతీకరించుచున్నట్లున్నది. వీరి చొప్పున విష్ణువునకు ఎవ్వనిపై అవ్యాజకృప కలుగునో వానిని కార్శ్యముల పాలుచేసి, అధఃపతితులను చేయును. విష్ణువు భక్తుని భక్తిని పరీక్షించుటకు అతనిని కార్శ్యముల పాలుచేయవచ్చును. కాని అధఃపతితులను చేయును అనుట ఎవ్వరును అంగీకరించరు. గజేంద్రుడు, ప్రహ్లాదుడు, కుచేలుడు– మున్నగువారు విష్ణువుచే కార్శ్యముల పాల్జేయబడియును అధఃపతితులు కాలేదు కాన అతనికృపకు పాత్రులైనారు. పాండురంగమాహాత్మ్యములో సుశీలను విష్ణువు బాధలకు గురిచేసినాడు; పరీక్షించినాడు. ఆమె అధఃపతితకాలేదు కాన ఆమెకు ముక్తిని ప్రసాదించినాడు. నిగమశర్మ పతితుడై ముక్తిపొందెను. కాన ప్రతివ్యక్తియు పతితుడైన తప్ప శరణాగతి చొరుటకనర్హుడు; అతని మీద విష్ణుకృపాస్రోతస్విని ప్రవహింపదని భ్రమపడుచున్నారు రావుగారు. నిగమశర్మ వరుసగా ఒకదాని కన్న నీచమైన మరియొక పతనము చెందుచు, "అనుద్దిష్ట ప్రయోజనుడై" తుదకు పూర్వసంస్కారతపః ఫలంబున నృసింహక్షేత్రమున సంగమ స్నానముచేసి, నృసింహ స్వామిని దర్శించి, మరణించి, ముక్తిపొందు ఒక ప్రత్యేక సందర్భమునుండి ఒక సామాన్య సిద్ధాంతమును ప్రవచించుట రావుగారి వంటి శేముషీధురంధరుల శేముషికి గిటురాదు! ఎన్ని అధఃపతనములు పొంది ఉండినను నిగమశర్మ నృసింహక్షేత్రమున పంచత్వము గాంచి యుండనిచో ముక్తినంది యుండువాడు కాడని రావుగారికి చెప్పనవసరము లేదు! ఇచ్చట రామకృష్ణుడు నృసింహక్షేత్రము పరమ పవిత్రమైనదనియు, అచట ఎటువంటి పరమనీచుడు వచ్చినను ముక్తి పొందుననియు ఆ క్షేత్ర మహాత్మ్యమును నిరూపించుటకై నిగమశర్మను పరమ నీచములైన పతనములకు గురిచేసినాడు. అంతియే కాని కరముపద సోపానమును వైష్ణవ ప్రపత్తి సిద్ధాంతమును ప్రతిపాదించుటకు కాదు. పాండురంగ మహాత్మ్యములో అందువలననే తక్కిన ఉపాఖ్యానములలో ఇటువంటి పాత్రలేదు.

పాండురంగ మహాత్మ్యమున ప్రతి పాత్రయు, ప్రతి ఉపాఖ్యానమును పాండురంగ తదనుబంధ క్షేత్రముల పవిత్రతను నిరూపించుటకు కల్పింపబడినవి. అదియే ఈ కావ్యములోని ఉపాఖ్యానములలోని ఐక్యతాసూత్రము. రావుగారి ప్రకారము ఈ కావ్యము పరమపద సోపానము, శరణాగతి సిద్ధాంతమును ప్రతిపాదించిన నిగమశర్మోపాఖ్యానమేకాక మిగిలిన ఉపాఖ్యానములును అదే పనిని చేయవలయును కదా? పాండురంగ మహాత్మ్యమున అట్లు లేదని అందరికిని తెలియును. రావుగారు నిగమశర్మను ముముక్షువుగా చిత్రించినారు. పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్‌లోని క్రిశ్చియన్ వలె నిగమశర్మ సంసారమును త్యజించి ముక్తియాత్ర కుద్యమించినాడని భ్రమించినారు. అందువలన ముముక్షువునకు సంసారము త్యాజ్యమన్నారు. ఇది రామకృష్ణుని హృదయమని తలంచినారు. కాని పాండురంగ మహాత్మ్యములోని కట్టకడపటికథ అయిన "అయుతనియుత చరిత్రము"లో రామకృష్ణుడు నిరూపించినదేమి? "గృహమేధి ధర్మవర్మా, సహమతి యగు కుమతి యయుతు చందమునను దు, స్సహదుఃఖగ్రాహనన, గుహబడు" నని! ఇది కూడ నృసింహక్షేత్రమహాత్మ్యమును తెలుపు కథయే. ఓః

కథలో గృహస్థ ధర్మము త్యాగమనియు, మరియొక కథలో సంసారము పూజ్యమనియు నిరూపించిన యెడల రామకృష్ణుని కావ్యమున ఐక్యత ఎట్లు పొసగును? పొసగదుకాన-నిగమశర్మోపాఖ్యానము సంసారము నీసడించుకొని, ముక్తి నగరమునకై ప్రయాణము చేయుచున్న యాత్రికుని పురోగతి చిత్రించు పిల్గ్రిమ్స్ ప్రోగ్రెసువంటి సంకేత కావ్యము కాదు. నిగమశర్మ అక్క తమ్ముని సంసారోన్ముఖునిగా చేయుటకు చేసిన బోధనలో అవంతయు అవినీతిలేదు. కావ్యమును పూర్ణదృష్టితో దర్శించు విమర్శకునకు నిగమశర్మ అక్క పద్మ కర్ణిక కొలువున్న పద్మపోలె ప్రత్యక్షమై హృదయమును పవిత్రీకరించును కాని రావుగారికి కనబడినట్లు "మహామారి" వలె కనిపించి, మానసమున మంటలురేపదు।

నిగమశర్మ అక్కను తెనాలి రామకృష్ణుడు "పద్మ కర్ణిక కొలువున్న పద్మపోలె"అని వర్ణించుటలో ఒక కిటుకున్న దని చెప్పుచు రావుగారు "పద్మ" అన్న లక్ష్మి కాన విష్ణువు నిగమశర్మమీద కల అవ్యాజమయిన కృపా సంపదతో నీవు పోయి ఆ నిగమశర్మను త్వరగా పంపించుము"ని లక్ష్మిని పురమాయించినాడా అని అనుమానము కలుగక మానదన్నారు. ఆ లక్ష్మీదేవియే నిగమశర్మను వైకుంఠమునకు త్వరగా పంపుటకు ఎత్తుఎత్తినదా అక్క రూపమున వచ్చి? అని ప్రశ్నించినారుకూడ. రావుగారు ఒకవైపు నిగమశర్మ అక్కను తమ్ముని సంసారమున కూర్కొనునట్లు చేయ ప్రయత్నించు "మారి" అందురు. ఇంకొకవైపు వైకుంఠమున కతనిని పంపుటకు విచ్చేసిన విష్ణుపత్ని యందురు. ఇది స్వవచన వ్యాఘాతము కాదా? అట్లయిన వారు నిగమశర్మోపాఖ్యానములో దర్శించిన అద్భుత దర్శనమేమైనట్లు? సుదర్శనమైనట్లా?

-శ్రీ శంకరగంటి రంగాచార్యులు

రాళ్ళపల్లి.

# సోమలదేవి - దాక్షారామ శాసనము

సోమలదేవిని గురించి 1981 ఫిబ్రవరి "భారతి"లో కొల్లూరు సూర్యనారాయణగారు (పునః) ప్రారంభించిన చర్చను తురగా కృష్ణమూర్తిగారు 1982 జనవరి "భారతి"లో కొనసాగించినారు. ఆ చర్చలను చదివిన పిమ్మట నాకీ విషయమున గల సందేహములను "భారతి" ద్వారా విన్నవించుచున్నాను. చరిత్ర పరిశోధకులు వీటిని నివృత్తి చేయుదురు గాక.

(1) సోమలదేవి, దాక్షారామ భీమేశునకు కొన్ని దానములిచ్చినది. ఈ దానములను తెలుపు క్రీ.శ. 1065 నాటి శాసనములో సోమలదేవి "దొల్లి భీమేశ్వర వల్లభునకు ....ఇచ్చె" నని చెప్పబడినది. దీనినిబట్టి ఈ దానములు క్రీ.శ. 1065 లో ఇచ్చినవి కాక అంతకు పూర్వమెప్పుడో ఇచ్చినవని అర్థము చెప్పవలయును గదా। లేక దానములు క్రీ.శ. 1065లో ఇచ్చినప్పటికి, శాసనము తరువాత ఎప్పుడో చెక్కబడినదా? శాసనములోని 'దొల్లి' పదము దానమిచ్చిన కాలమునకు, శాసనమును చెక్కిన కాలమునకు మధ్య కొన్ని సంవత్సరములు గతించినవని తెల్పుట లేదా?

(2) శాసనమందలి "బెజయితదేవుని" అను పదమునకు "విజయాదిత్య దేవుని" అని అర్థము చెప్పకొనవలయునా?

(3) రాజరాజు, విజయాదిత్యుడు సోదరులు. రాజరాజు క్రీ.శ. 1019 లో పట్టాభిషిక్తుడైనాడు. క్రీ.శ.1061లో మరణించినాడు. మరణించునప్పటి కాతనికి రాజ్యాన్ని పాలించే కుమారుడు, ఆ కుమారునకు కొడుకులు గలరు. ఏ విధముగా చూచినను అతని కప్పటికి 65 సం॥ల వయసు కన్న తక్కువయుండదు. అతని తమ్ముడు అతనికన్న 10 సం॥లు చిన్నవాడను కొనిన విజయాదిత్యుని కప్పటికి 55 సం॥ల వయసు. అప్పటికతని కుమార్తె సోమలదేవి వయసు కృష్ణమూర్తిగారి అంచనా ప్రకారము 11 సం. అన్న మనుమలు, తన కుమార్తె ఇంచుమించు సమవయస్కులగుట అసహజమేమీకాదు. కాని, సోమలదేవి, శాసనములో చెప్పబడిన ప్రకారము "దొల్లి" (చాలాకాలము క్రిందట) భీమేశ్వరునకు దానమిచ్చుట, అది శాసనస్థము

చేయ దగినంత ప్రాముఖ్యము గలదగుట, శాసనములో ఆమె వర్ణింపబడిన తీరు గమనించిన క్రీ.శ. 1065 నాటికి ఆమెవయసు 15 సంవత్సరము లేనా అన్న అనుమానము రాక తప్పదు. అప్పటికామె వయసు 20 సం॥ లకు తక్కువ యుండియుండదు.

సోమలదేవి తండ్రి విజయాదిత్యుడు వేంగి సింహాసనముకై రాజరాజుతో జరిపిన పోరాటములో అతనికి కళింగ గాంగరాజులు సహాయపడిరి. రాజరాజు తన మామ రాజేంద్ర చోళుని సైన్య సహాయముతో విజయాదిత్యుని వేంగి నుండి పారద్రోలెను. విజయాదిత్యుడు మరల గంగ రాజైన 3వ వజ్రహస్తుని కుమారుడగు దేవేంద్రవర్మ సహాయముతో వేంగి సింహాసనాన్ని ఆక్రమించినాడని అనంత వర్మ చోడగంగుని శాసనాలలో గలదని డా. కె. సుందరం గారు "ది సింహాచలమ్ టెంపుల్" అను ఆంగ్ల గ్రంథములో వ్రాసిరి. (పుట 19) దీనినిబట్టి విజయాదిత్యుడు గంగరాజులతో వియ్యమంది తన కుమార్తెయగు సోమలదేవిని గంగరాజైన దేవేంద్రవర్మ కిచ్చినట్లు ఊహించుట కవకాశమున్నది. దేవేంద్రవర్మ విజయములను కుమారుడు అనంత వర్మ చోడ గంగుడు తన శాసనములలో ప్రస్తుతించినట్లు డా. సుందరంగారు వ్రాసిరి. జనవరి 82 "భారతి"లో కృష్ణ మూర్తిగారుదాహరించిన క్రీ.శ. 1103 నాటి ముఖలింగ శాసనమున పేర్కొనబడిన "త్రికళింగ మండలపతియగు శ్రీ గంగ చూడామణి" దేవేంద్రవర్మయే అయిన (శాసనమున గంగాచూడామణియని ఉండగా వివరణకర్త బ "చోడగంగు"డని వ్రాయుట ప్రామాదికము దేవేంద్రవర్మ గంగరాజేగాని "చోడగంగు" కాదు) అతని "మనోమానస హంసి"గా పేర్కొనబడిన సోమలదేవి దాక్షారామ శాసనమున చెప్పబడిన సోమలదేవియే అనుటకు సందేహమేమి, దేవేంద్ర వర్మ సోమలదేవి నేకాక రాజరాజనరేంద్రుని మనుమరాలు, కులోత్తుంగ చోళుని కుమార్తె అయిన "రాజసుందరి"ని వివాహము చేసికొని గాంగ-చోడవంశములకు సంబంధము స్థిర పరచినాడు. వీరి కుమారుడే అనంతవర్మ చోడగంగు (ది సింహాచలమ్ టెంపుల్ పుట 19) కనుక సోమలదేవి, తన భర్తయైన గాంగరాజు సాయముతో తన తండ్రి వేంగి సింహాసనమున సుస్థిరుడైన పిమ్మట తాను "తొల్లి" భీమేశ్వరునకిచ్చిన దానమును గూర్చి అప్పుడు- అనగా క్రీ.శ. 1085లో శాసనమును వ్రాయించెననుకొనుట సమంజసము కాదా!

(4) విజయాదిత్యుడు వృద్ధాప్యమున ఒక కుమారుని కనినట్లు, అతని స్వస్థతకై రెండు గ్రామములను దానమిచ్చినట్లు తెల్పబడిన ర్యాలిశాసనమున విజయాదిత్యుడు "రాష్ట్రకూట ప్రముఖ కుటుంబినుల సమావేశపరచి మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజ, దౌవారిక సమక్షమున "తన సంతాన బలాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం" దానమిచ్చుచున్నట్లుల్లేఖింపబడినది. అది 1172వ సంవత్సరమున జరిగినది అప్పటికి యువరాజు (పేరు తెలియదు) సజీవుడయ్యే యున్నాడు" అనికృష్ణమూర్తిగారు వ్రాసిరి.

ఇందలి "యువరాజ" శబ్దము విజయాదిత్యుని కుమారునికై స్పష్టముగా నిర్దేశింపబడినదా? అని నాసందేహము. ఎందువలననగా,

i) యువ రాజునకై స్పష్టముగా నిర్దేశింపబడినచో శాసనమున "యువరాజ బలాయురారోగ్య...."అని చెప్పబడవలయును గాని, స్త్రీ పురుష విభేదము తెలియని "సంతాన బలాయురారోగ్య...." అని"సంతాన" శబ్దముచే చెప్పకూడదు గదా!

ii) "మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక" అను సమాసము ఆనాటి దాన శాసనములలో ఒక సంప్రదాయముగా ఉపయోగింపబడుచున్నట్లు కనబడుచున్నది ఉదా॥ "శ్రీరాజరాజరాజదేవో రెండేఱుల నడిమి విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక ప్రధాన సమక్షమ...." క్రీ.శ. 1053 నాటి రాజరాజు నందంపూడి శాసనం. ....ప్రోలు నాంటి విషయ వాసినో రాష్ట్రకూట ప్రముఖాన్సకుటుంబిన స్సర్వాన్ సమాహూయ మంత్రి

పురోహిత సేనాపతి యువరాజ దౌవారికాది సమక్షమ్......"
క్రీ. శ. 1186 నాటి పృధివీశ్వరుని పిఠాపుర శాసనము (సెలక్టెడ్ తెలుగు ఇన్‌స్క్రిప్షన్స్ పుట 1?, 65)

కనుక ర్యాలి శాసనమందు చెప్పబడిన విజయాదిత్యుని "సంతాన" మెవరు?

(5) కృష్ణమూర్తిగారు తాముదాహరించిన "పంచబ్రహ్మోదయభాష్య" మను సంస్కృత గ్రంధమును రచించిన దెవరో ఆ గ్రంధమే కాలమున వ్రాయబడినదో తెలుపలేదు. వారుదాహరించిన శ్లోకములలో చెప్పబడిన త్రిలింగ దేశము లోని రాజమందిరము రాజమహేంద్ర వరములోనిదే అనుట ఎట్లు? రాజమహేంద్రవరమే "రాజమందిర"మని చెప్పబడినదా?

శ్రీ సూర్యదేవర రవికుమార్
దుత్తలూరు

## ప్రొఫెసర్ బి. జి. యల్. స్వామిగారి విశిష్ట కృతి: "హసురుహొన్ను" (పచ్చబంగారం) ఒక సమీక్ష

1979 సంవత్సరపు కేంద్ర సాహిత్య అకాడమి బహుమతి నందుకొన్న అతి విశిష్టమైన శాస్త్రీయగ్రంథం, ప్రొఫెసర్ బి. జి. యల్. స్వామిగారి పచ్చబంగారం" (హసురు హొన్ను) ఈ రచన ఏ కోవకు చెందినదో చెప్పటం కష్టం. ఇదొక యాత్రా గ్రంథం; వృక్షశాస్త్ర గ్రంథం, చారిత్రక పరిశోధనా గ్రంథం; హాస్య ప్రబంధం; మనో విశ్లేషణాత్మక గ్రంథం; సంగ్రహంగా చెప్పాలంటే పై గుణాలన్నిటిని సంతరించుకొన్న 'వృక్షశాస్త్ర సంబంధమగు నవల' అనటం సబబుగా వుంటుంది.

"కాలానుగుణంగా మన జీవితంతో ఏదో ఒక రీతిగ సన్నిహిత సంబంధం గల వృక్షజాతులను పరిచయంచేసే ప్రయత్నమే ఈ రచన" అన్నారు ప్రొఫెసర్ స్వామిగారు.

డా. బి. జి. యల్. స్వామి అనంతమైన అభిరుచులు కలిగిన మహా మేధావి. మైసూరు విశ్వవిద్యాలయంలోను, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలోను వృక్షశాస్త్ర పరిశోధనలు గావించి 1953 నుండి ఇరువదేళ్ళపాటు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో వృక్ష శాస్త్ర ప్రధానాచార్యులుగా పనిచేశారు. తమ అభిమాన పాత్రమైన పరిశోధన - బోధన కార్యక్రమాలకు అంతరాయం కల్గిస్తుందనే భావనతో ప్రెసిడెన్సీ కళాశాల ప్రిన్సిపల్ పదవిని తిరస్కరించిన శాస్త్ర పరిశోధకు డాయన.

విజ్ఞాన శాస్త్ర విషయం సాహిత్య రూపాన్ని సంతరించుకోవాలంటే ఈ రెండు రంగాలలోను పరిణత ప్రజ్ఞ అత్యావసరం. అంతే కాదు ఎంతో సామాజిక తత్వం వుండాలి ఈ లక్షణాలన్నిటినీ పుణికి పుచ్చుకొన్న విశిష్టమైన విజ్ఞాన గ్రంథం డా. స్వామిగారి "పచ్చ బంగారం."

ఈ గ్రంథంలో కొన్ని వందల వృక్షజాతుల, తీగల, మొక్కల పరిచయం వుంది. డైవేరియా, జాజికాయ, జాపత్రి, కదంబ, రుద్రాక్షి, భద్రాక్షి, సప్తపర్ణి, అనిమోన్, సర్పగంధి, అశోక, మాధవీలత. సార్కెంద్రా, గోరింటాకు, ధూమ, కన్యాస్త్రీ, వెదురు, వుసిరిక, తమాల (లవంగ) మిరియాలు - తాళ. శ్రీతాలజాపాళ, అశ్వత్థ, కమల, కుముద, పోక, గ్లోరియోసా, మంత మామిడి వగైరా వగైరా వాటి పరిచయం అపూర్వంగాకలుగుతుంది.

వృక్ష శాస్త్రంలో స్నాతకోత్తర విద్యార్థులను సస్య సంచాయనానికై విధిగా ఏడాదికొకమారు అరణ్య ప్రదేశాలకు తీసికొని వెళ్ళటం, అచట వివిధ వృక్ష జాతులను సేకరింపచేసి వాటిని గురించిన సమగ్ర వివరణమును పరీక్షలో ఒక భాగంగా సమర్పింపచేయటం సాధారణంగా జరుగుతూ వుంటుంది. ప్రొఫెసర్ స్వామిగారి నేతృత్వంలో విద్యార్థి

బృందాలు విజ్ఞానయాత్రలకు వెళ్ళటం ఈ శాస్త్రీయ నవలా గ్రంథానికి పూర్వ రంగమని చెప్పవచ్చు.

వృక్షశాస్త్ర అధ్యయనంలో "వర్గీకరణం" అత్యంత క్లిష్టమైన విభాగం. కఠినమైన ఈ విషయాన్ని సామాన్య పాఠకులకు సైతం అర్థమయ్యే రీతిలో రచించిన తీరు మనల నెంతగానో ఆకర్షిస్తుంది. హాస్య గుంభితమైన సులభశైలీ విన్యాసంతో కూడుకొన్న రచనా విధానమే ఈ గ్రంథ ప్రశస్తికి ప్రధాన కారణం అనవచ్చును.

సాధారణంగా శాస్త్రీయ గ్రంథాలలోని భాష పాఠకులను చదివించేదిగా వుండదు. విదేశీ భాష నుండి అనువదించినపుడు వాక్యాలను "మక్కీకి మక్కీ"గా అర్థం చేయడం, కృత్రిమ వాక్యానుసంధానం చేయుటం సాధారణం. ఇట్టి కృత్రిమత్వం ఏ మాత్రం లేకుండా ఆకర్షణీయమైన శైలిలో సాగుతూ, గొప్ప నవలలా మనలను ఆద్యంతము చదివింపగల చేవవున్న రచన ఇది. స్వామిగారి సాహిత్య, సాంస్కృతిక, భౌగోళిక, చారిత్రక అభిరుచులను తెల్పే గ్రంథమిది. స్వామిగారే గీచిన రేఖా చిత్రాలు మనకు వినోదాన్నే కాక విజ్ఞానాన్ని కూడ అందిస్తాయి. శాస్త్రీయ విషయాలను వివరించిన తీరు గమనింప దగినది.

భారతీయ సంస్కృతితో పాటు విస్తరించింది మన కదంబ వృక్షం. హిమాలయ సానువులలో వెలయాడుతున్న ఈ వృక్షమును 'సౌందరనంద" కావ్యం వర్ణించింది. శివ పార్వతుల సరస సల్లాపానికి ఎడమిచ్చి పుత్రోత్సవ సమయంలో ఛత్రం వలె ఆశ్రయ మిచ్చినదీ కదంబం. త్రిపురాసుర సంహారం తరువాత అలసిపోయిన శివుని ఫాలభాగం నుండి రాలిన చెమట చుక్కయొకటి భూమిపై పడి కదంబ వృక్షంగా మారింది. ఉమ కదంబ వనవాసిని- కాదంబ కాంతార వాసప్రియ, ఉమ కదంబ పుష్పాలతో పరమేశ్వరుని అర్చించింది. శివునికి నచ్చిన పుష్పం. కవుల కలగ్రత్త పెక్కు రూపాలు దాల్చింది. కదంబ వృక్షానికి వారు పెట్టిన విశేషణాలు చూడండి- షట్పదేష్ట, ప్రావృషేణ్య, హరిప్రియ, కదంబక, కాదంబర్య, వృత్తపుష్ప, కేశరాఢ్య, ప్రఖేణ, నదీజ, దాసవృక్ష, సీధుపుష్ప, ప్రియక, నీప, క్షేత్రక్షపా, "కదంబ కోరక న్యాయ" "కదంబ ముకుళన్యాయ" ములను నిర్మించారు. కదంబ పుష్పముల పరిమళంతో మత్తెక్కిన బలరాముడు తీవ్ర మద్యపానాసక్తుడయ్యాడట. (విష్ణు పురాణం)

పనస పండును గురించి విద్యార్థులకు వివరిస్తూ తమిళ కవి "ఇళంగో అడిగళ్" పద్య పాదాలను వుటంకించి పుష్పించకనే ఫలాన్నిచ్చే పనసపండువంటివారు కొందరు, పుష్పించి పండును ప్రసాదించే మామిడి పండు వంటివారు కొందరు, పుష్పించినా పండివ్వని చెట్టువంటివారు కొందరు వుంటారు.

మామిడి పళ్ళలోని రకాలు అనగి మామిడి జాతి క్రీ. శ. 600 సంIIలోనే పుట్టిన బృహత్ సంహితలో చెప్పబడింది. క్రీ. శ. 169 లో ఇటలీదేశం నుండి మన దేశానికి విచ్చేసిన "కరేం" అనే యాత్రికుడు గోవాలో లభించే అంటు మామిడి పళ్ళ రకాలను గురించి పేర్కొంటాడు. శిల్పాల్లోను, చిత్రాల్లోను, రూపొందిన "మామిడి" పళ్ళ మనోహరత్వాన్ని పండుగలు పబ్బాలలోను శుభ కార్యాలలోను మామిడి పళ్ళ అవసరాన్ని నిరూపిస్తూ సంస్కృత, తమిళ, కన్నడ కవులు ఈ పండ్ల ప్రభావానికి లోనై వాటిని వర్ణించిన తీరు చదువుతున్నప్పుడు మనం శాస్త్ర రంగంలోనుండి సాహిత్య రంగంలోకి ప్రవేశించి మైమరచిపోతాం.

"సప్తపర్ణి" (అల్‌స్టోనియా స్కాలేరిస్) వృక్ష విశేషాన్ని వర్ణిస్తూ ప్రాచీనకాలంలో స్నాతకోత్సవ చిహ్నంగా ప్రతి విద్యార్థికీ సప్తపర్ణి" రెమ్మనొకదానిని ఇచ్చే సంప్రదాయం బెంగాల్‌లో వుండేది.

శాల్మలీ వృక్షం (బూరుగ) చాల పెద్దదన్న విషయం మన వేదర్షులకు తెలుసును. (తైత్తరీయ వాజసనేయ సంహిత, "శతపథ" పంచ వింశ బ్రాహ్మణములు) ఈ వృక్షాన్ని గురించి సంస్కృతంలో ఒక సుభాషితముంది. "శాల్మలీ వృక్షం ప్రతిరోజు పండలాది ప్రజలను మోసగిస్తుందట. హంసలు ఎఱ్ఱటి పువ్వులను కమలమని తప్పుగా భావిస్తాయి. గ్రద్దలు మాంస ఖండములనుకొని మోసపోతాయి. బాటసారులు బాగా పండిన పళ్ళు అని మోసపోతారు. తేనె టీగలు మధువు దొరుకుతుందనుకొని మోసపోతాయి. సద్గుణములేమాత్రమూ లేని చెట్టుకు ముళ్ళు వేరే (శార్ఙ్గధర పద్ధతి)

విద్యార్థి బృందంలోని వరదరాజయ్యంగార్‌కు సాహిత్యం పట్ల ఆసక్తి తక్కువ. "ఈ వృక్షం యొక్క

ప్రయోజనమేమైనా వారు తెలుసుకున్నారా?" అని తంగవేలును ప్రశ్నిస్తాడు. తంగవేలు సాహిత్య ప్రియుడు. "బూరుగ పువ్వులతో పులిహోర చేస్తారు. దాని కొమ్మలను, రెమ్మలను చీల్చి ఆ ముక్కలతో నీవు తెచ్చిన చక్కిలంలాంటి తినుబండారములను చేస్తారు." వరదరాజు : "ఆరు చక్కిలాలను తిన్న ఆ నోటితో ఇలా అనవచ్చా?"

తంగవేలు : ఒరే! ప్రతిదానికి ప్రయోజనమేమి అని అడుగుతున్నావే! రసికుల మనస్సులను ఆకర్షించటమే దాని ప్రయోజనం.

హంస చచ్చేముందు పాడుతుందట. ఇదొక కవి సమయం. వెదురు చచ్చేముందు పుష్పించి సింగారం ఒలకబోస్తుంది. అది వాస్తవం. ఒక మారు పుష్పించిన వెదురు అంతటితో చచ్చిపోతుంది. వెదురు పుష్పించిందంటే సామాన్య ప్రజలు భయపడుతారు. రాబోయే కరువు కాటకాలకు ముందు సూచనగా భావిస్తారు. ఈ భయానికి కారణం లేకపోలేదు. గుత్తులు గుత్తులుగా వుండే వెదురు బియ్యము రాలిపోయినపుడు ఎలుకల రాజ్యం ప్రారంభమవుతుంది. వెదురు బియ్యము తిన్న ఎలుకల సంతానం అమిత వేగంగా పెరుగుతుంది. మితిమీరిన ఎలుకలు పొలాలపై పడుతాయి. రైతుల ఇళ్ళపై దాడిచేస్తాయి. వెదురుజాతి నశిస్తుంది. దంశక ప్రాణికులము పెరుగుతుంది. రైతు లోకం కష్టనష్టాలకు గురి అవుతుంది. చచ్చిన ఎలుకలు కుళ్ళిపోవటంతో ప్లేగువ్యాధి వ్యాపిస్తుంది. ఈవిధంగా వచ్చే కరువు కాటకాలకు వెదురు అపరోక్షంగా కారణమవుతుంది. వెదురు మన నిత్య జీవితంతో పెనవేసుకున్నది. ఈ విధంగా వెదురును గురించి ఎన్నో వివరాలు చెప్పుకుంటూ పోతారు రచయిత. (ఇటీవల నల్లమల అడవుల్లోని వెదురు పుష్పించిందని అటవీశాఖ అధికారులు ఎంతో ఆందోళన పడుతున్నట్లు పత్రికలలో వార్తలు వచ్చాయి.) వెదురు జాతులలోని పెక్కు తెగలు ముప్పది - నలుబదేళ్ళ కొకమారు పుష్పించి నశిస్తాయి. విత్తులు మొలిచి క్రొత్త తరం పుడుతుంది. స్వామిగారు తమ రచనలో నానాటికీ నశిస్తున్న సాంఘిక, నైతిక విలువలను గురించి తమ ఆందోళనను వ్యక్తం చేస్తారు. అందుకోసం వారు కవితలను చొప్పించలేదు. ఉపన్యాసాలను గుప్పించలేదు. వాగాడంబరాన్ని అసలే ప్రదర్శించలేదు. సందర్భాను సారంగా తమ ఆవేదనను అక్కడక్కడా అత్యంత ప్రభావ పూరితంగా వ్యక్తం చేస్తారు.

సస్య వర్గీకరణ శాస్త్ర విభాగం (టాక్సోనమి) మన దేశంలో ఇంకా పెంపొందలేదు. కళాశాలల్లో విశ్వవిద్యాలయాల్లో ఈ విభాగాన్ని గురించి బోధించాలనే నియమం వున్నప్పటికీ శ్రద్ధగా అధ్యయనం చేసే అధ్యాపకులు లేరు, విద్యార్థులూ లేరు. ముప్పదేళ్ళ క్రితం తాము విద్యార్థిగా వున్నప్పుడు నేర్చుకొన్న విషయాలనే తు. చ. తప్పక బోధించి పాటగా కాలం గడిపేస్తారు. అధ్యాపకులయ్యాక కదా! ఇక తెలుసుకోవలసిందేమీ లేదనుకొంటారు. తమ పేపర్లను గురించి మాత్రమే ఆలోచిస్తుంటారు. ఇక సీనియర్ లెక్చరర్లు చెప్పినదాన్నే చెబుతూ ఈ అవర వయస్సులో చదువుకొనేదేముంది అనే వేదాంతంలో మునిగిపోతారు.

పాలనా రంగంలో ఎర్రబద్దీ మనస్తత్వం పరిశోధకులకు ఎలా అడ్డు తగులుతుందో హాస్య పూరితంగా నిరూపించారు. వృక్ష శాస్త్ర విభాగంలో రోజువారీ కూలీలను నియమించుకోవటం దండగమారి ఖర్చుగా భావిస్తూ అందుకు ప్రత్యామ్నాయంగా గాడిదలను కొనటం ఎంతో పొదుపుగా వుంటుందని ఒక కాలేజీ ప్రిన్సిపల్ అభిప్రాయం.

ఒక చెట్టునుగాని, ఒక తీగనుగాని, మొక్కనుగాని వర్ణించునపుడు వాటి ఆమూలాగ్ర సమీక్ష చేయటం స్వామిగారి ప్రత్యేకత. జాజికాయ ఎలా కాయకాదో, జాపత్రి ఎలా పత్రికాదో విశదీకరిస్తారు. వైద్య రంగంలో ఆయా తీగలు వేళ్ళు కాయలు ఆకులు ఎలా ఉపయోగపడుతాయో వివరిస్తారు.

ఈ విధంగా వృక్షశాస్త్ర విజ్ఞానాన్ని ఒక ప్రత్యేక గ్రంథాలో రచించి ప్రశస్తి నందుకొన్న ఆచార్య బి. జి. ఎల్. స్వామిగారు ఇటీవలనే దివంగతులయ్యారు.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి



# గ్రంథ విమర్శలు

## "యువభారతి" వారి మూడు క్రొత్త ప్రచురణలు

## 1. మరో జంఘాలశాస్త్రి

[రచన: శ్రీ అడుగుల సోమయాజుల- నాగేశ్వరరావు. డెమ్మీ సైజు 8 | 48 పేజీలు. వెల మూడు రూపాయలు.]

స్వర్గీయ పానుగంటి-లక్ష్మీనరసింహారావు పంతులు గారి సాక్షి ఉపన్యాసాలను ఎరగని సాహిత్యాభిమానులు ఉండరు. సాక్షి ఉపన్యాసాల రూపంగా ఆరు పెద్ద సంపుటాలలో ప్రకటితాలయి బహుళవ్యాప్తిని పొందాయి. ఆ వ్యాసాలను వరవడిగా పెట్టుకొని వచనరచనసాగించిన రచయితలూ ఉన్నారు. ఆ ఉపన్యాసాలు సాంఘిక-ఆర్థిక-సారస్వతాదులయిన పెక్కు విషయాలకు సంబంధించి ఆయనకు సహజమైన హాస్యధోరణితో జనసామాన్యరంజకాలై ఉన్నవి. నాటికి సాక్షి ఉపన్యాసాలని పేరువున్నా సాక్షి సంఘ సభ్యులలో జంఘాలశాస్త్రిదే ప్రాధాన్యం. ఇంచుమించు ఉపన్యాసాలన్నీ ఆయన యిచ్చినవే! పంతులుగారి సాక్షి వ్యాసాలు రచయితకు బాగా నచ్చినవి. వాటి ప్రభావంవల్ల ఆ ధోరణిలోనే వ్యాసాలు వ్రాయాలనే సంకల్పం కలిగింది. సాక్షి వ్యాసాలలో జంఘాలశాస్త్రి ముఖ్యుడు కాబట్టి, ఈ రచయిత కూడా అతని చేతనే ఉపన్యాసాలిప్పించి ఈ "మరో జంఘాలశాస్త్రి"ని రచించారు. సాక్షిలోవలెనే యిందులోకూడా వివిధ విషయాలు విమర్శించబడ్డాయి. రచన ఆ ధోరణిలోనే నడిచింది. సాక్షి వ్యాస సంపుటాలు ఇప్పుడు అందుబాటులో లేవు. అందువల్ల పంతులుగారి రచన ఏ విధంగా వున్నదీ చాలామందికి తెలియకపోవచ్చును. ఈ వ్యాసాలు అదే ధోరణిలో ఉండడంవల్ల వీటిని చదివి సాక్షిరచనా పద్ధతిని గ్రహించవచ్చును.

పానుగంటివారి జంఘాలశాస్త్రి నిర్మొగమాటంగా తాను చెప్పవలసిన దానిని ఢంకామీద దెబ్బ కొట్టినట్లు గట్టిగా చెప్తాడు. అయ్యల సోమయాజులవారి శాస్త్రికూడా ఆ పెద్ద జంఘాలశాస్త్రి అడుగుజాడల్లోనే నడిచాడు. ఇందులోని వ్యాసాలు పానుగంటి వారి వ్యాసాలకంటె చిన్నవైనందున ఈ పొట్టి శాస్త్రి చిన్న జంఘాలశాస్త్రి అనుకోవడంలో తప్పేమీ లేదనుకుంటాను. రచన చిన్నదే అయినా విషయంమాత్రం పెద్దదే అని చెప్పవలసి వున్నది.

ఆధునిక గ్రామ పరిస్థితులు, తెలుగు ఉత్తమ చిత్రములు, మహాను కవికుల పోటీలు, కళాశాల వార్షికోత్సవము, మహిళా మండలి, కవులు- సామాజికస్పృహ, గుర్రపు పందెములు, మద్యపాన నిషేధము, సినీకవులు- విమర్శ, అభిమాన సంఘములు, కవిసమ్మేళనములు, జంతు ప్రదర్శనశాల, వింత స్వప్నము, ఇందులోని విషయాలు. ఇవి జీవితంలోని వేర్వేరు అంశాలకు సంబంధించినవి. పంతులుగారి హాస్యధోరణి యీ పుస్తకంలో కూడా కానవస్తున్నది. రచన రమణీయంగాను, ఆకృతి ఆకర్షణీయంగానూ ఉన్నది. పానుగంటివారు జంఘాలశాస్త్రి భౌతికాకృతిని మనకు అందచెయ్యలేదు. కాని వారి రచనను బట్టి శాస్త్రి ఊహాచిత్రాన్ని చిత్రించి మనకు అందజేసిన చిత్రకారుడు సుధామగారు అభినందనీయులు. ఆ చిత్రంతో కూడా అందంగా దీనిని ముద్రింపించి, ప్రకటించి, సాక్షిని మనకు తలపునకు తెప్పిస్తున్న యువభారతివారినీ, రచయిత నాగేశ్వరరావుగారినీ మనం అభినందించ వలసియున్నది.

## 2. మన పురాణ సంకేతాలు

[రచన: డాక్టర్ ముదిగొండ-శివప్రసాద్ ఎం. ఎ. పి. హెచ్. డి. డెమ్మీ సైజు. 24 పేజీలు. వెల 2 రూ.]

మనం మన అభిప్రాయాలను ఎదుటివారికి తెలుపుటకు మాటలాడడంగాని, సైగలు చెయ్యడంగాని జరుగుతుంది. దూర ప్రదేశాలలో ఉన్న వారికి మన భావాలను వ్రాత మూలంగా గాని, సంకేతాల మూలంగా గాని తెలపడం

ప్రాచీన కాలం నుంచీ ఉన్నది. ఆ సంకేత రూపాలయిన చిత్రాల మూలంగానే వివిధాలైన లిపులేర్పడినట్లు పరిశోధనల వలన తెలుస్తూ ఉన్నది. ఆవిధంగానే ఆయా సంకేతాలకు పారిభాషిక పదాలను నిర్ణయించడం శాస్త్రాలలో ఉన్నది. ప్రతి శాస్త్రంలోనూ పారిభాషికాలు ఉంటూనే ఉన్నవి. సంకేతాలు లేకపోతే విషయప్రతిపాదన సులభంగా సాగదు

సంకేతాలలో విషయాన్ని చెప్పడం మానవునికి స్వాభావికమే. మన మాటల్లో మనకు తెలియకుండానే అవి దూరుతూ ఉంటాయి. కవులు కవితల్లో చెప్పనే అక్కర్లేదు. "వాడికి బాగా కిరీట పూజ జరిగింది" అంటే నెత్తిమీద బాగా దెబ్బలు పడ్డాయన్న మాట! అర్థాంతరం గ్రహించలేని వారు కిరీటానికి పూజ జరిగిందనే అనుకుంటారు. ఒక కవి ఒక కన్యను వర్ణిస్తూ "కన్యకు నైదు జంఘులను, కన్యకు నారు కుచద్వయంబులున్" అని వర్ణిస్తే యథార్థాన్ని గ్రహించలేని ఒక వ్యక్తి "ఏం కన్యకబాబూ! దానికి అయిదు పిక్కలట! ఆరు స్తనద్వయాలట!" అని ఆశ్చర్యపోయాడు. అసలర్థం ఏమిటంటే-కన్యారాశికి అయిదవదైన మకరం వంటి పిక్కలనీ, ఆరవదైన కుంభం వంటి కుచాలనీ. ఈ విధంగా సంకేతం బహుళ ప్రచారానికి వచ్చింది.

నాటి వేదాలు మొదలుకొని నేటికావ్యాల వరకు వున్న వాఙ్మయమంతా సంకేతాలతో కూడినదే! మన పురాణాలలోని కథలు అస్వాభావికాలనీ, అభూతకల్పనలతో నిండినవనీ అనుకునివారు యథార్థాన్ని ఎరుగనివారనే చెప్పవలసి ఉన్నది. సంకేతశాస్త్రాన్ని ఎరిగిన వారు మాత్రం వాటిని ప్రామాణికాలుగానే గ్రహిస్తారు.

సున్నితమైన ఆలోచనపయి ఆధారపడి ఉన్నందున ఈశాస్త్రం కొంత దురవగాహంగా కనబడుతుంది. ఆసక్తి ఉన్నవారికి సులభంగానే ఉంటుంది. వేదాలలోని సంకేతాల విశేషార్థాలను వివరించిన మహనీయులు ఆధునిక యుగంలో శ్రీ అరవింద యోగీంద్రులు. వారి రచనలవల్ల ప్రభావితులైన రచయితకు మన పురాణాలలోని సంకేతాలను గూర్చి పరిశోధించాలనే సంకల్పం కలిగింది. లిపులకూ, సంకేతాలకూ సంబంధించిన గ్రంథాలను పరికించి యీ వ్యాసాన్ని రచించారు. లిపుల పుట్టుపూర్వోత్తరాలను గురించీ, వేదపురాణాలలోని సంకేతాలను గురించీ సూక్ష్మంగా యీ పుస్తకంలో తెలియజేశారు. దీనివివర, ఈ వ్యాసంలో తాను సమగ్ర విషయాన్ని చెప్పలేదనీ, విస్మృతి పథంలో పడుతున్న అంశాలను గుర్తుచేయడమే జరిగిందనీ, వేద శాస్త్ర పురాణాలను చదివి వాని సంకేతాలను గ్రహించవలసి ఉన్నదనీ, ఇంకా ఈ విషయమై ఎక్కువ పరిశీలన జరగవలసి ఉన్నదనీ రచయిత తెలియజేశారు.

ఈ 24 పేజీల చిన్న పుస్తకంలో రచయిత అనేక విషయాలను తెలియజేశారు. ముక్కోటి ఏకాదశి, రథసప్తమి మహాశివరాత్రి, హోళీపండుగ మున్నగువాని అంతరార్థాన్ని చక్కగా వివరించారు. త్రిమూర్తుల వాహనాలను గురించీ, త్రిపురాసుర సంహారాన్ని గురించీ చక్కని విషయాలు తెలియజేశారు. రామాయణంలోని అహల్యా వృత్తాంతం త్రిజటాస్వప్నం మొదలైన వాటి అంతరార్థాన్ని వివరించారు. భూమి శేషునిపైని ఆధారపడి ఉన్నదంటే-ఆదిశేషుడనే సర్పం మీద నిలబడి ఉన్నదని అర్థంకాదనీ, సర్వమూ నశించగా మిగిలిన భగవంతునిపైనే సృష్టి ఆధారపడి ఉన్నదని గ్రహించాలనీ-ఇట్టి విషయాలను తెలియజేశారు. దీన్నిబట్టి వీరి నిశిత దృష్టి వ్యక్తమవుతూ ఉన్నది. రచయిత పురాణాదుల సంకేతాలను గురించి పెద్దగ్రంథాన్ని రచించవలెనని సంకల్పించినట్లు వారి మాటలవల్లనే తెలుస్తున్నది. ఆ గ్రంథం తయారయి ముద్రితమైతే ఎన్నో అపూర్వవిషయాలు తెలుస్తాయి. దాని మూలంగా పురాణాదులపై గౌరవంలేని వారికికూడా వాటిపై సదభిప్రాయం కలుగుతుందనీ, ఆస్తికభావం వ్యాప్తమవుతుందనీ ఆశించవచ్చును. ఆ గ్రంథం త్వరలోనే తయారు కాగలదని ఆశిస్తున్నాను.

## 3. ఆలోచనా లహరి

[ఆరుగురు సుప్రసిద్ధాంధ్రాచార్యుల ఉపన్యాసములు. (ఉపన్యాసమంజరి) డెమ్మీ సైజు-11+128 పేజీలు, వెల. 16 రూపాయలు.]

ఆంధ్రసాహితీ సంస్కృతుల వికాసానికై అపారమైన కృషి చేస్తున్న యువభారతీ సంస్థ కొన్ని సంవత్సరాలుగా విఖ్యాతులైన విద్వాంసులచేత ఉపన్యాసాలిప్పిస్తూ, వాటిని గ్రంథరూపంగా యువదాంధ్రానీకానికి అందజేస్తున్న సంగతి అందరికీ తెలిసినదే. వారిదివరలో ప్రాచీన కవులనూ, వారి గ్రంథాలను గురించిన ఉపన్యాస సంపుటాలను ప్రకటించినట్లే ఇప్పుడు ఈ శతాబ్దానికి చెందిన ఆరుగురు ఆంధ్ర మహాపురుషులను గురించి ఆరుగురు సుప్రసిద్ధ విద్వాంసుల చేత వ్రాయించిన ఉపన్యాసాలీ పుస్తకరూపంగా ప్రకటించారు.

(1) ఇందల్లి ఉపన్యాసాలలో మొదటిది శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిని గురించి డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మగారి ఉపన్యాసం. రెడ్డిగారు ఆంధ్ర-ఆంగ్ల భాషల్లో నిష్ణాతులు. ఉన్నత పదవులలంకరించి, రాజకీయాలకోసం పదవులు విడిచి దేశసేవకై పాటుపడిన మహనీయులు, మనదేశంలో పేరుపడిన మహోపన్యాసకులలో వీరొకరు. గొప్ప విమర్శకులు. చక్కని కవిత్వం చెప్పే సరస కవులు. ఆంధ్రవాఙ్మయ పరిశీలనలో నూతనమార్గమును అనుసరించి ఆధునిక విమర్శకులకు దారి చూపిన గొప్ప విమర్శకులు. పింగళి సూరన కళాపూర్ణోదయానికి వారు వ్రాసిన పెద్ద పీఠిక, వారి కవిత్వతత్త్వ విచారం తెలుగు వాఙ్మయ విమర్శనలలో అగ్రస్థానం వహించాయి. నిర్మొగమాటంగా విమర్శించినా ఆయన దోషైకదృక్కులుకారు సత్యపక్షపాతి. ఈ విషయం వివరిస్తూ వ్యాసరచయిత "మహాభారతంలోని ప్రతిపద్యం రసాస్పదమైనట్లే వీరి ప్రతికవితా ఉదాత్త భావాస్పదమై భాసిస్తున్న"దని ప్రశంసించారు.

రెండవది శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారిని గురించినది. ఆయన సంగీత సాహిత్యాలలో నిధులు. రస వత్కవులు చక్కని విమర్శకులు. వారి రచనలు అందరినీ ఆకర్షిస్తాయి. ఆయన సన్నిహితులు గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు శర్మగారిని ప్రశంసిస్తూ విపులంగా పెక్కు విషయాలను తెలియజేశారు. శ్రీ శర్మగారి కవిత్వ, పాండిత్య, పరిశీలన శక్తులను గురించియే కాక శీల, గోష్ఠీప్రియత్వ, కుటుంబ మర్యాదలను గురించికూడా వారి సన్నిహితులు రామ సుబ్బ శర్మగారికి బాగా తెలుసును. ఈ వ్యాసంలో శర్మగారి జీవితాన్ని గురించీ, వారితోడి వ్యాసకర్త పరిచయాన్ని గురించీకూడా వివరంగా ఉన్నది. శ్రీ శర్మగారి జన్మాదికము శ్రీ శర్మగారితో పరిచయము, పరిచయాభివృద్ధి, శ్రీ శర్మ గారి అభిమాన కవులు, గోష్ఠీ ప్రియత్వము, ప్రాస్తావికములు పరిష్కరణము-పాఠనిర్ణయములు, గ్రంథములు, మతసామరస్యము, కుటుంబ మర్యాద, తుదిఘట్టము - ఇందులోని శీర్షికలు. శ్రీ శర్మగారిని గూర్చిన సంగ్రహ చరిత్రగా దీనిని భావించవచ్చును.

(3) కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారిని గురించి ఆచార్య బి. రామరాజుగారు వ్రాసినది మూడవది. పంతులుగారు చిన్నప్పుడు నాగపూరులో విద్యనభ్యసించి మహారాష్ట్రభాషలో విద్వాంసులయినా, మాతృభాష అయిన ఆంధ్రంమీద అభిమానం అపారం. ఆయన గొప్ప పరిశోధకులు, విద్వాంసులు, ఉదారహృదయులు. తెలుగువారి విజ్ఞానాభివృద్ధికి వీరు బహుముఖాల కృషి చేశారు. పరిశోధక మండలి స్థాపన, విజ్ఞాన పరీక్షల నిర్వహణ, విజ్ఞాన చంద్రికా గ్రంథమాల స్థాపన, విజ్ఞాన సర్వస్వ ప్రకటన- అన్నీ ఆయన పరిశోధనకు, పాండిత్యానికి, చరిత్ర రచనా శక్తికి ఉదాహరణలు. పంతులుగారి వ్యాసావళి ఎందరో పరిశీలకులకు మార్గదర్శకమయింది. ఆచార్య రామరాజుగారు పంతులు గారిని గురించినవిషయాలన్నిటినీఎంతో శ్రమపడి సేకరించి, దీనిని వ్రాసినట్లు స్పష్టంగా తెలుస్తున్నది. లక్ష్మణరావుగారి

సంకల్పాలు పూర్తిగా నెరవేరకముందే ఆయన దివం గతులు కావటం ఆంధ్రుల దురదృష్టం. ఆయన జీవితం ఆదర్శప్రాయం.

4. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారి ఉపన్యాసం గిడుగు రామ్మూర్తి పంతులుగార్ని గురించినది నాలుగవది. వ్యావహారిక వాదాన్ని సమర్థిస్తూ పంతులుగారు ఉపన్యసిస్తూ ఉంటే పిడుగులు పడినట్లే ఉండేది. అ చేత "గిడుగుపిడుగు" అనే కీర్తి ఆయనకు వచ్చింది. మనం నిత్యం వాడుకునే భాష వ్యాకరణ విరుద్ధంగా ఉన్నందున అది ప్రయోగయోగ్యం కాదనీ, గ్రాంథిక భాషనే వాడాలనీ కొందరు పండిత కవుల పట్టుదల. శిష్టులు వ్యవహరించే భాష గ్రామ్యంకాదనీ, ప్రయోగయోగ్యమనీ, గ్రాంథిక వాదుల రచనల్లోవ్యాకరణవిరుద్ధాలైనప్రయోగాలుఎన్నో ఉన్నాయనీ ప్రాచీన కవుల ప్రయోగాలు వ్యాకరణ శృంఖలాలను త్రెంచు కొన్న వెన్నో కలవనీ పంతులుగారు వాదించి, వ్యావహారిక భాషకు ప్రయోగ యోగ్యతనుకల్గించారు. గ్రాంథిక వాదులైన పిఠాపురం రాజా వారి ఆశ్రితులైన విద్వాంసులు వ్యావహారిక వాదానికి వ్యతిరేకించినా, పంతులుగారిని అమోదించిన విద్వాంసులు ఎందరో ఉన్నారు. బహుభాషా వేత్తలైన పంతులుగారు జీవద్భాషకు చేసిన సేవ అమోఘమైనది. ఆ విషయాలన్నీ రమాపతిరావుగారు ఇందులో బాగా వివరించారు. వ్యావహారిక భాషావాదచరిత్ర దీని మూలంగా వివరంగా తెలుస్తుంది, పంతులుగారి జీవిత చరిత్రా తెలుస్తుంది.

(5) డాక్టర్ ముదిగొండ శివప్రసాద్‌గారు తర్వాతి ఉపన్యాసంలో సుప్రసిద్ధ పాత్రికేయులు ముట్నూరి కృష్ణారావుగారిని గురించి వివరంగా తెలిపారు. మహర్షి రఘుపతి-వెంకటరత్నం నాయుడుగారి ప్రభావం ఆయన మీద పని చేసిందనీ, బ్రహ్మ సమాజం గూర్చి ఉపన్యాసా లిచ్చే వారనీ, కృష్ణా పత్రికకు తొలుత, సహాయ సంపాదకులై తెలుగువారి ప్రగతికి మార్గ దర్శకులైనారనీ ఇందులో వివరించ బడింది. కృష్ణారావుగారి సంపాదకీయాలు ఉదాత్తంగా, విజ్ఞానదాయకంగా ఉంటాయి. అవి పదే పదే మననం చెయ్యవలసినవికాని, చదివి పారవేయవలసినవికావు వారి సంపాదకీయాల కోసం ప్రతీవారం పాఠకులు ఎదురు చూచేవారు. అవి స్వాతంత్ర్యప్రబోధకాలుగాకూడా ఉండేవి కృష్ణారావుగారిని గురించి, వారి జీవిత విశేషాలను కళ్ళకు కట్టేటట్లు ఇందులో చూపబడింది.

(6) చివరిది శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని గురించి డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యంగారి ఉపన్యాసం. నేటి విద్వత్కవి లోకంలో అగ్రశేణిని వహించిన వారు కవిసమ్రాట్ విశ్వనాథవారు. తెలుగు వాఙ్మయంలో ఆయన స్పృశించని ప్రక్రియలేదు. తెలుగు వారిలో జ్ఞాన పీఠ బహుమతిని పొందినవారు ఆయన మాత్రమే. వీరి కవిత రసవంతమైనది. ప్రాచీన కవిత్వంపై ఆదరం ఉన్నా, అధునాతన కవిత్వాన్ని కూడా ఆమోదించినట్లు, వీరు వాటికి వ్రాసిన పీఠికలు చెప్పుతున్నవి. వీరి పీఠికలు క్రొత్త పరిశీలన పద్ధతిలో సాగి, పాఠకులకు ఆమోదాన్ని కలిగిస్తాయి. సుబ్రహ్మణ్యంగారు వీరిని విమర్శక చక్రవర్తి అనిచెప్పటం సముచితంగా వున్నది. ఈ కవి సమ్రాట్టు వ్యక్తిత్వాన్ని గురించీ, వైశిష్ట్యాన్ని గురించీ విపులంగా తెలియజేశారు. ఈ ఉపన్యాసం విశ్వనాథవారి సాహిత్య జీవితానికి ప్రతిబింబమని చెప్పవలసి ఉన్నది.

యువ భారతి వారి యీ పొత్తము పుస్తకాలూ ఆంధ్ర సరస్వతికి నూతనా లంకారాలని చెప్పవచ్చును.

పై ప్రతులకు(1)యువభారతి, 5-కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003 లేదా (2) యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు, తిలక్‌రోడ్డు, హైదరాబాదు-500 001. అను చిరునామాకు వ్రాయవలెను.

-"అంగీరస"

# శ్రీ హర్షనైషధము

(తృతీయ భాగము- టీకాతాత్పర్య సహితము 7నుంచి 9 సర్గలు)

[వ్యాఖ్యాత: శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఎ. ప్రిన్సిపాల్, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు. డెమ్మీసైజు, పుటలు 474, వెల: 12.00 : ప్రచురణ ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-4.]

"నైషధం" అనే పేరు వినపడగానే నైషధం విద్వదౌషధం" అనే నానుడి స్మరణకు వస్తుంది. వినయంలేనే "విద్వత్త"కూడానిరవధికం. కాని దురహంకార మూలకమైన "విద్వత్త" అమయ సదృశం కనుకనే దాని ప్రక్కనే ఔషధం అవసరమయింది. అట్టి విద్వదౌషధమే నైషధం.

సామాన్యంగా చివరభాగంలో ఉన్నది "మకుట"మని పించు కొంటుంది. పంచ కావ్యాలకు చివర ఉన్న నైషధం కూడా మకుటస్థానీయమే ఔతుంది. ఈ మకుటానికి నలకథ, మహిత మాణిక్య స్థానీయం.

దేవతలు నలకథా ఽమృతమును ఆస్వాదించిన పిమ్మట తమ అసలు అమృతమును అంతగా ఆదరించడం లేదట. ఇట్లే ఈ కలియుగంలో ఈ నలకథ స్మరింపబడి నంత మాత్రం చేతనే స్మరించిన వారందరియొక్క పాప పంకిలాలను నీటితో కడిగినట్లు కడిగివేస్తూందిట. (పవిత్ర మత్రా ఽ కనుతే జగద్యుగేస్మృతారక్షాళనయేవతత్కథా)

ఇట్లు ప్రత్యేక ప్రభావ భాసురమై, ఉభయతారకంగా ఉజ్వలమణివలె ఉన్న ఈ మహాకావ్యాన్ని — శ్రీ సుబ్బరామశాస్త్రిగారు, స్వర్గం నుండి స్వర్గంగనువలె ఆంధ్రలోకానికి దగ్గరగా అవతరింపజేయడం, ఆంధ్ర విద్యార్థుల అదృష్టమే అనాలి. ఈ మహా కార్యసాధనకు ప్రోత్సాహకులైన వారికి కూడా సత్ఫలితం లేకపోలేదు.

ఇట్టి మహా కావ్యాన్ని, జితేంద్రియుడైన శ్రీహర్ష మహాకవి "చింతామణి" మంత్రోపాసనాప్రభావంతో 22 సర్గలతో రచించినాడు.

ఈ మహా కావ్యానికి పలువురు వ్యాఖ్యలు వ్రాసినట్లును, ఆ వ్యాఖ్యలన్నింటిలో మల్లినాథసూరి యొక్క "జీవాతు" నామక వ్యాఖ్యానమే నాయకమణిగా ఉన్నట్లును మల్లినాథుడు తన వ్యాఖ్యాదిలో వ్రాసినాడు.

ఈ కావ్యంలోని 22 సర్గలకూ నారాయణీయవ్యాఖ్య ఉన్నా, మన ఆంధ్ర వ్యాఖ్యాత మల్లినాథ వ్యాఖ్యనే ఆదరించినట్లగపడుతుంది. ఇందులకు, శ్రీ సుబ్బరామశాస్త్రిగారి వ్యాఖ్య నుండి కొన్ని నిదర్శనాలను చూపుతున్నాను. ప్రతి ప్రతీకం ప్రథమం ప్రియాయాముథాంతరా ఽ నంద సుధా సముద్రీ,

తతః ప్రమోదాఽశ్రు పరంపరాయాం మమజ్జతుస్తస్యదృశౌనృపస్య ॥(సర్గ7-శ్లో 2)

ఈ శ్లోకభావం సుగమమయేటట్లుగా ఆంధ్రవ్యాఖ్యాతటీకలో ఇట్లు వ్రాశారు.

"....నలుని దృష్టి యనెడి ఒక ఆధేయము, క్రమముగా ప్రియురాలియందును, తర్వాత ఆమెయొక్క యువయువము లన్నింటిమీదను తర్వాత ఆనంద సుధాసాగరమునందును, తర్వాత ఆనంద బాష్పప్రవాహమందునుమునిగెనని ఒక్క ఆధేయమునకు పెక్కుఆధారములను జెప్పుటవలన పర్యాయాలంకారము."

ఈ శ్లోకానికిగల మల్లినాథ వ్యాఖ్యలో, మీ దివాక్యాల భావం ఇలా ఉంది. ".... అత్ర దృగ్రూపస్య ఏకస్యాధేయస్యక్రమాత్ప్రియా ఽ వయవాద్యనేకాఽధారవృత్తిత్వకథనాత్పర్యాయాలంకారభేదః ............" (చూటిప్పణి) ఈ విషయం నారాయణీయ వ్యాఖ్యలో లేదు. ఇట్లే ఇంకా 7 వ సర్గ 4వ శ్లోకం-

"వేలామతిక్రమ్యపృథుం ముఖేందోరాలోకపీయూషరసేన తస్యాః!

నలస్యరాగాంబునిధౌవివృద్ధేతుంగౌకుచావాశ్రయతిస్మదృష్టిః ॥ (7-4)

ఇందు"..........కుచావాశ్రయతః స్మదృష్టిః" అని నారాయణీయ పాఠం. ఇక "ఆశ్రయతిస్మదృష్టిః" అని మల్లినాథ పాఠం. మన వ్యాఖ్యాత దీనినే గ్రహించారు. ఈ శ్లోకానికి

వ్యాఖ్యాత వ్రాసిన విశేషంలో. "........దమయంతి ముఖ చంద్రుని దర్శనముచే (నలుని) అనురాగసాగరము పొంగి గట్టును మించగా, నలుని దృష్టి,తాను మునుగుదు నను భయముచే నెత్తైన యామెకుచములనాశ్రయించినది" అను ప్రస్తుత వృత్తాంతముచేత, .... "సముద్రము పొంగునపుడు అందలి మనుష్యుడు ఎత్తైన స్థానమును ఆశ్రయించును" అను అప్రస్తుత వృత్తాంతము స్ఫురించుచున్నది కాన సమాసోక్త్యలంకారము. ... నలుని దృష్టికి వాస్తవముగా భయములేక పోయినను ఆ భయముచేతనో యన్నట్లు దమయంతి యొక్క కుచములనాశ్రయించెనని చెప్పుటవలని ఉత్ప్రేక్ష. ఆ సమాసోక్తివలన నుత్ప్రేక్ష వ్యక్తమైనది గాన అలంకారముచే అలంకారధ్వని. (చూ. ఆంధ్ర వ్యాఖ్య 3వ పేజీ/ మీది వాక్యాలలోని భావం, ఈ శ్లోకానికి గల మల్లినాథ వ్యాఖ్యలో ఇలా ఉంది. "అత్ర చంద్రోదయే సముద్రవృద్ధౌతన్మజ్జన భయాత్ ఉత్సేధాశ్రయి జనప్రతీతేః సమాసోక్తిరలంకారఃతేనచాబ్ధిమజ్జన భయాదివేత్యుత్ప్రేక్షావ్యజ్యత ఇతి అలంకారేణాఽలంకారధ్వనిః ఇతి మల్లినాథసూరిః" (చూ. ఈ శ్లోకవ్యాఖ్యకుమూలంలో క్రింది టిప్పణిలో)

ఇట్లే 9వ సర్గలో 47వ శ్లోకం :—

"నివేశ్య సేయద్యనలేనలోజ్ఝితాసురేత దదస్మిన్మహతీ
దయాఽదృతా।
చిరాదనేనార్థనయాపి దుర్లభం స్వయంత్వయైవాజ్ఞ।
యదంగమర్ప్యతే॥"

ఇంతకు ముందు దమయంతి "--చేతో నలంకామయతే మదీయం---" అనే వాక్యం ద్వారా "నా మనస్సు నలుణ్ణే కోరుతూంది; ఆ నలుడు నాకు లభ్యం కాని పక్షంలో "అనలుని, అంటే అగ్నిని కోరుదిండి" (చేతః + అనలం, కామయతే అని కూడా పదచ్ఛేదమౌతుంది) అని చెప్పిన వాక్యానికి చెలికత్తె చెప్పిన సమాధానం మీది శ్లోకం. "చెలీ! నీవు అగ్నిలో పడేపక్షంలో, అగ్ని దేవుడుకూడ నిన్ను వరించి ఉండుటచేత అతడికి నిన్ను నీవే అర్పించుకున్నట్లౌవుతుందిగాన అవని కూడా అనర్థ హేతువే ఔతుంది. ఇట్లు నీవు నిరాకరించిన అగ్ని దేవుని నీవే ఆదరించినట్లౌతుంది" అనే భావంకల ఈ శ్లోకానికి వ్యాఖ్యాత వ్రాసిన విశేషం. "ఇచ్చట నలుడు లభింపనపుడు, అనల (అగ్ని) గ్రహణ బుద్ధి ననుసరించి యనర్థమును జెప్పుటవలన విషమాలంకారము" ఈ భావం నారాయణీయంలో లేదు. మల్లినాథీయంలో ఇలా ఉంది.

"అత్రనలాఽలాభే జీవిత జిహాసోరనల గ్రహణ బుద్ధి
రుపాలానర్థాత్తేః
ర్విషమాలంకారః" (విరుద్ధకార్యస్యోత్పత్తిర్యత్రా
ఽనర్థస్యవాథవేత్....."

మీద చూపిన విధంగా శ్రీ శాస్త్రి మహోదయుల ఆంధ్రవ్యాఖ్య-కవి హృదయాన్ని, కావ్యగత గాంభీర్యాన్ని, శ్రీ హర్షకవి చూపిన ఉత్కట పాండిత్య ప్రాభవాన్ని అద్దంలో చూపినట్లు సులభ సుందరరీతిలో చక్కగా విశదం చేస్తూ, దివ్య ఔషధమైననైషధకావ్య సర్వస్వాన్నీ విద్యార్థుల చేతికి వలిచిని అనటి పండువలె, తక్షణానుభవ యోగ్యంగా అందిస్తూంది. ఈ వ్యాఖ్యలోగల ఇంకో ముఖ్య విషయం "సమాసములు". ఈ ప్రక్రియ ద్వారా వీరు విద్యార్థులకు సమాసముల అర్థజ్ఞానమును, సులభంగా సమాసముల వేర్పాటుకు తగినంత శక్తిని, తద్వారా, శ్లోకాన్ని అర్థం చేసికోగల శక్తిని ప్రసాదించినట్లయింది. విశేషములలో ఆలంకారిక జ్ఞానాన్ని ప్రసాదించి విద్యార్థులకు వీరు మహోపకారం చేసినారు.

నైషధకావ్యం చేతబట్టే ప్రతిఒక్క విద్యార్థికీ శ్రీశాస్త్రి గారి వ్యాఖ్య "కల్పలతిక" వంటిదని నేను నమ్ముచున్నాను. ఈ గ్రంథ రచయితలు, ఈ గ్రంథ పరిష్కరణకర్తలు ఆంధ్రదేశానికి ఒక పెన్నిధిని ప్రసాదించారు. "స్వస్తి".

శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి.

## ప్రభంజనం (కథల సంపుటి)

[రచన: జాతశ్రీ. ప్రచురణ : ఖమ్మంజిల్లా అభ్యుదయ రచయితల సంఘం పేజీలు : 115 వెల : అయిదు రూపాయలు. ప్రతులకు : సృజనాలయం, ఇల్లందు, ఖమ్మంజిల్లా, 507 123 ]

ఈ మధ్య కాలంలో, ఆధునిక తెలుగు సాహిత్యాన్ని అభ్యుదయాం వైపుగా నడిపిస్తున్నామంటూ, డప్పులు గొట్టుకుంటూ, సాహిత్యగిమ్మిక్కులు చేస్తున్న వారిలో;కొన్ని వింత పోకడలు కనిపిస్తున్నాయి.

ఫైటింగ్సు, మానభంగాలు, వస్త్రాపహరణాలు, అంగాంగ ప్రదర్శనలు, సెక్సు చిత్రమంతటా గుప్పించి, ప్రేక్షకుడిని, అతనిలోని బలహీనతలనూ, సొమ్ము చేసుకోవటమే ప్రవృత్తి ధ్యేయంగా పెట్టుకుని, చివరలో ఆడదానికి అన్యాయం జరుగుతూ వున్నదన్న స్లోగన్లు పెట్టి, ప్రయోజనాత్మక చిత్రాల్ని తీస్తున్నామని గొప్పలు చెప్పుకునే చీప్ చిత్రాల నిర్మాతల్లాగా- దా. గవ్యాపారుల్లాగా-

— సెక్సు, సాడిజం, హింసా, జుగుప్సాకరమయిన వర్ణనలూ, గుప్పించి సామాన్య పాఠకున్ని ఆకర్షించి, ఆ కథలకు సామాజిక ప్రయోజనమనే మేలి ముసుగును తగిలించి కాలరెగరేసి. చౌంకలు కారుస్తూ, కేవలం ఫలానా మార్కు రచయితలకే ప్రాచుర్యం ఇస్తూ, సాహిత్యాన్ని తమ ఇనుప కౌగిళ్ళలో బంధించ జూస్తూ, ఏదో రకరకంగా సర్కులేషన్ని పెంచటానికి ఆరాటపడ్తూ, గుత్త పెట్టుబడీ దారీ విధానాల్నీ, ధనస్వాముల్నీ కథలలో ఖండిస్తూనే, ఆ పెట్టుబడిదారుల మోచేతి నీళ్ళు తాగుతూ వారి దయాదాక్షిణ్యాల వర్షాల కోసం తాపత్రయ పడుతూ, మందులో పడి దొర్లుతూ ద్వంద్వ విధానాల రచనల మాయా మంత్ర జాలంతో సర్కసు ఫీట్లు చేస్తూ, భుజకీర్తులు తగిలించుకుని, పోజులు గొట్టేనయా రివిజనిస్టు సాహిత్య ప్రవచన స్వాములై పోజులు గొట్టటయే గాక డబాయించటం బాగా అలవాటయిన కొందరు కిరాయి సంపాదకులు ఈనాడు తమ పెద్దపెద్ద, గొంతులతో, అనుచర బృందాలతో, డప్పుల మోతలతో, స్వకుచమర్దనాలతో, తీవ్రమయిన దూషణలతో, చిత్రవిచిత్రమయిన చేష్టలతో ఆధునిక తెలుగు సాహిత్యాన్ని చిందర వందరగా చేసి పారేసున్నారన్న మాట ఒకటి వున్నది. దీన్ని కొట్టి వేయటానికి వీలులేదు. సాహిత్యంలో, ఇటువంటి కుహనా ధోరణులు గలవారు నిర్వహించే పాత్రనికూడా, విస్మరించటానికి సాధ్యంకాదు. వీరి అనుచరవర్గం, (సంఖ్యలో స్వల్పమయినా) యొక్క గొంతులు చాలా పెద్దవి, వాడి అయినవి కూడా. బూజుపట్టిన పాతకాలాల దివాణాల రాక్షసాలూ, డబ్బుగల వారి క్రూర కృత్యాలూ, పేదలూ అసహాయులయిన స్త్రీల మానభంగాలూ, హింసాత్మక సంఘటనలూ, ప్రధానంగా వర్ణన చేయబడి, చివరలో ఈ వ్యవస్థనీ, దీని వ్యవస్థల్నీ కొని, బూతు మాటలతో తిట్టిపోయటంతో కథల్ని అంతంచేసి "సాడిజం" అన్న పాఠకుడి బలహీనతని సొమ్ము చేసుకోవటం మరిగిన తమ "గురు సంపాదకుల" మెచ్చుకోళ్ళకోసం దేబి చూపులు చూసే రచయితలు పుట్టుకువచ్చారు. వీరి వ్యుత్పత్తి బహుస్వల్పం. అంతరు విరిచి చేతగాదు. అందువలన "రాశిగాదు వాసి ముఖ్యం" అన్న స్లోగను వీరి నాలుకల మీదే వుంటుంది. ఇష్టమయితే భుజాలమీదికి ఎక్కించుకుని పిచ్చిగంతులు వేయటం, అయిష్టమయితే నడుం విరిగేలాగా క్రిందకి త్రోసి పారేసి నీచమయిన దూషణలకి పాల్పడటం వీరి అలవాటు. పెద్దగొంతు, పోజు గొట్టడం అసహనంతో గావు కేకలు పెట్టడం, వాస్తవాల్ని విస్మరించి, తాత్కాలికమ్యాల్ని మంచి కుస్తీపట్లకి దిగటం వీరి నిత్య వ్యాపారాలు. ఈ కారణం వలన సాహిత్య వ్యవసాయ ప్రాంగణం [illegible] సైకిలు చెయిన్లు తెగిపడి [illegible] అలవాలమయిందనీ, సాధారణ పాఠకుని దృష్టిలో, సాహిత్యాన్ని వ్యుత్పత్తి చేసి, చలామణీ చేసేవారం, స్థాయి దిగజారి పోయిందని అంటున్నారు. ఇలా బజారున పడవేసిన తెలుగు సాహితీ లలామ సాడిజానికి గురయి కౌరవ సభలో నిలబడిన ద్రవుపదిలాగా అయిందనికొందరు వాపోతున్నారు. ఆలోచనకీ ఆచరణకీ పొంతనలేని ఇటువంటి ధోరణులు ఏ సాహిత్యోద్యమానికయినా ఏ విధంగానూ ఆరోగ్యకరం కాదని గోల బెట్టున్నారు చాలామంది అభిజ్ఞులూ, పిరికి సాహిత్య పండిట్ లూ.

నవయుగ సాహిత్య పండిట్‌లమనీ, సాహిత్య విప్లవకారులమనీ ఒక వయిపున గొప్పలు చెప్పుకుంటూనే, సర్కులేషన్ పెరుగుదల కోసం, యజమానుల మెప్పుదల కోసం క్షుద్ర సాహిత్యాన్నీ, నీచ సాహిత్యాన్నీ, రేప్ సాహిత్యాన్నీ ప్రోత్సాహిస్తూ, దొంగ ముసుగులు ధరించి, అభ్యుదయ సాహిత్యాన్ని గురించి ప్రవచనాలు వల్లించే ప్రబుద్ధుల చెయిదాల్ని ఖండించేదమ్ము ఎవరికీ లేకపోవటం దురదృష్టం కాక మరేమిటి ? ఎందుకూ అంటే వారుసంపాదకులూ, రచయితలకి వారి దయాదాక్షిణ్యాల అవసరం వుండిచావటమూ. అందుకనే విస్సన్న చెప్పిందే వేదంగా చలామణీ అయిపోతూ వుంది.

డబ్బూ, గుత్త పెట్టుబడిదారీ విధానమూ, నిజాయితీ కరువయిన కుహనా ధోరణులూ, కుల మత, ప్రాంతీయ కేటాయింపుల పద్ధతులూపోయి సృజనాత్మకమయిన ప్రయోజనకరమయిన తెలుగు కథా సాహిత్యం వెలువడి సాటివారిలో తెలుగు కథ తలెత్తుకుని నిలబడాలంటే కొంత ఆత్మవిమర్శా,

ఎంతో నిగ్రహమూ, విజ్ఞత మిగిన మార్గ నిర్దేశకత్వమూ కావాలి. సంపాదకులూ, రచయితలూ, విమర్శకులూ ఆత్మ పరిశీలన చేసుకుని నిజాయితీతో ఆలోచించవలసిన సమయం ఆసన్నమయింది. ఆత్మావలోకనం కరువయినపుడు ఏదయినా నూతిలోని కప్పచందమే అవుతుంది. డంబాలే మిగులుతాయి.'

ఆలోచన కరువయిన, పైటింగుల్లో నలుగుతూవున్న ఈ కుహనా సాహిత్య సేవకులు, పాఠకులుచేత కాలరు పట్టించుకుని "ఏమిటిదంతా?" అని అడిగించుకొనటం కన్నా మించిన దౌర్భాగ్యం మరొకటిలేదు. అందువలన వృద్ధికంలో పడి బురదగుంటల్లోకి మూక నుద్యుక్తులవుతూ వున్న ఈ సాహితీ పెత్తందార్లు తమ నయా రివిజనిస్టు ధోరణులను మాని, నిలబడి ఆలోచించాలని మనవి చేయక తప్పదు.

"ఏ సాహితీ వేత్తో కితాబు ఇస్తే నాకు అభినందనలో, ఆ పరమయిన అవార్డులో మిగలొచ్చు కాని జనం మిగుల్తారనేది అబద్ధం. వీపు నిమురటంగాదు, గుండెల్ని గోకడం అవసరం. అందువలన యోగ్యతా పత్రం ఇవ్వాల్సింది. పాఠకుడు మాత్రమే" అన్న, కలగా పులగమయిన ఒక విచిత్ర నిర్వచనాన్ని పుస్తకంలో అచ్చు కొట్టించిన జాతశ్రీ, ఈ పుస్తకాన్ని సమీక్షకు పంపు కోవటం ఒక విచిత్రం! డప్పులు గొట్టుకోవటం, స్వకుచమర్దనానికి పాల్పడటం నేటి కుర్రకారు రచయితలకు బాగా అలవడిందనటానికి ఇది ఒక నిదర్శనం.

స్థూలంగా పైన వివరించిన ధోరణులు వున్న ఏడు చిన్న కథలు ఈ పుస్తకంలో చోటు చేసుకొన్నాయి.

ఈ కథలలోని శైలిలో వేగం వుందికాని విషయం కొరవడి నటువంటి, కొన్ని నినాదధోరణులు నిండివుండటం వీటిల్లోని బలహీనత.

"మద్దకారం కలిసిన సంకటి-ఎర్రగా-తన బిడ్డ చినిగిన మానంలోంచి చిందిన నెత్తురులాగా అనిపించింది"-

"దొరా, నీ పియ్యితింట"-

"లమ్డి కొడకా! నీ అలినమ్మురా. నీ తల్లినీ, చెల్లినీ వేలం వెయ్యరా"-

మొదలయిన జుగుప్సాకరమయిన వర్ణనలూ,

"-అంటూ, శరీరాన్ని పిసుకుతూ -రవికలోకి చేతిని పోనిచ్చి" వంటి థర్డ్ రేట్ సెక్సు చిత్రాలూ చోటు చేసుకున్నాయి.

జీత్రా అన్న కథలో-రచయిత తను చెప్పదల్చుకున్న దాన్ని చెప్పలేక పేలవమయిన పలాయన వాదాన్ని ఆశ్రయించటం జరిగింది.

కథల నిండా అవాస్తవికత వుంది.
నినాదాల వుద్రేకం వుంది.
అసమగ్రమయిన చిత్రీకరణలు వున్నాయి.
అసంబద్ధమయిన అరుపులు వున్నాయి.

ఇంకా ఎంతో కృషి చేసి, శిల్పంలో, శైలిలో, కథానికా టెక్నిక్కులో ఎదగ వలసివున్న ఈ పుస్తకం రచయిత అప్పుడే స్వంత డబ్బా ఒకటి తగిలించుకుని, సాహిత్యాన్ని గురించి ప్రవచనాలను గుప్పించ బూనటం, ఈనాటి ఈరకం రచయితల దుస్సాహసాన్ని తలపుకి తెస్తుంది.

శ్రీ వంకాయలపాటి వెంకయ్యగారికి అంకితం ఇయ్యబడిన ఈ పుస్తకంలోని కథలలో సమాజానికి అద్దం పట్టాలన్న అసమగ్ర ప్రయత్నం కనిపిస్తుంది.

ముఖచిత్రం బాగుంది.

అక్కడక్కడా అచ్చు తప్పులున్నాయి.

కేవలం ఏడు చిన్న చిన్న కథలు కలిగిన ఈ పుస్తకాన్ని అయిదు రూపాయలు పెట్టి కొని చదవటానికి ఎవరయినా వెనుకాడుతారని పించుతుంది.

శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna att he Andhra Patrik Press, Gandhinagar, Vijayawada-3, Editor S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247